KRSA102M104




"All that we are is the product of what we have thought"

- *Dammapada.*

సంపుటి 24 మే, 2013 సంచిక 5



*Printed & Published by*
**Bapanna Alapati**
at **Kala Jyothi Process Pvt. Ltd.,**
1-1-60/5, R.T.C. 'X' Roads,
Musheerabad, Hyderabad - 500 020.
Ph. 040-27645536
E-mail : misimi_monthly@yahoo.in
e-magazine : www.kinige.com/misimi

ప్రతి : ₹20 సంవత్సరానికి : ₹240
విదేశాలకు ప్రతి : $ 2.50 సంవత్సరానికి : $ 25

(Library of Congress Control Number)
LCCN 91-903060

# ఈ నెల...



*ముఖచిత్రం* : మహాభి నిష్క్రమణ
*రెండవ అట్ట* : దుఃఖ హేతువులు
*మూడవ అట్ట* : భూమి స్పర్శ
*నాల్గవ అట్ట* : యువ సిద్ధార్థ

అజ్ఞాత చిత్రకారుడు చిత్రించిన సిద్ధార్థ గౌతముని జీవిత ఘట్టాలు

ఈ ప్రత్యేక సంచిక 2557 వ బుద్ధ జయంతి సందర్భంగా వెలువరిస్తున్నాము.

ఒక ఉపాసకుడు బుద్ధుని ఈ విధంగా ప్రశ్నించాడు. "భగవాన్ మీరు ఎన్నో విషయాలను బోధిస్తున్నారు. ధర్మమంటే ఏమిటో క్లుప్తంగా వివరించండి."

'సబ్బ పాపస్స అకరణం కుశలస్స ఉప సంపద, సచిత్త పరియోదపనం, ఏతం బుద్ధాన సాసనం' - పాప కర్మలను చేయకపోవటం, కుశల కార్యాలను ఆచరించటం, చిత్త పరిశుద్ధతను కాపాడుకోవటం, ఇదే బుద్ధుని బోధన... అని భగవాన్ ప్రవచించాడు.

ఈ బోధనలు ప్రపంచ వ్యాప్తంగా ఎందరినో ప్రభావితం చేశాయి. అందులో ముఖ్యులు మహాత్మా గాంధీ, విశ్వకవి రవీంద్రుడు, బాబా సాహెబ్ అంబేద్కర్ ఉన్నారు. ఈ సంచికలో వారి రచనలను అందిస్తున్నాం.

మూల బౌద్ధ సాహిత్యాన్ని మూడు భాగాలు (త్రిపిటకాలు) గా విభజించారు. సూత్ర పిటకం, వినయ పిటకం, అభిధర్మ పిటకం. పిటకం అంటే గంప. ఇవి కాక బౌద్ధంలో ఎంతో సాహిత్యం ఉంది. ఈ సాహిత్యాన్ని 'పిటకేతర సాహిత్యం' అంటారు. దీని గురించి విపులంగా వివరించారు ప్రఖ్యాత బౌద్ధ పండితులు రాజగోపాలరావు. దానిలోని మొదటిభాగం ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

బౌద్ధానికి శీల, సమాధి, ప్రజ్ఞ అనే మూడూ మూల స్తంభాలు. వీటి విపులీకరణ ఈ సంచికలో ప్రత్యేక రచనలో చదవవచ్చు.

పాళీ భాషలో థేర అనే పదానికి పెద్దలు అని అర్థం. జ్ఞానియైన భిక్షువుని థేర, భిక్షుణిని థేరీ అని అంటారు. భిక్షుణీ, భిక్షువుల ధార్మిక అనుభవాలను థేర గాథలు వివరిస్తాయి. అందులో ఆనాటి సాంఘిక పరిస్థితులు మనకు కనిపిస్తాయి.

ఈనాటి జన జీవితంలో బుద్ధుని బోధనలు ఎంత అవసరమో, మానసిక శాంతికి, సరళ ప్రవర్తనకు, మానవీయ సంబంధాలకు వీటి ఉపయుక్తం ఎంత ఉంటుందో, ముఖ్యంగా యువతకు మార్గనిర్దేశకంగా ఈ ప్రత్యేక సంచిక ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం.



మరో విధంగా చెప్పాలంటే ధమ్మపదంలోని ఈ గాథను ఉదహరించవచ్చు.

దీఘా జాగరతో రత్తి / దీఘం సన్తస్స యోజనం,
దీఘో బాలానం సంసారో / సద్ధమ్మం అవిజానతం.

అంటే, కన్ను మూత పడని రాత్రి కడు దీర్ఘ మనిపించును. / అలసి సొలసిన వానికి గమ్యం కడు దూర మనిపించును. / సద్ధర్మం తెలియని మందబుద్ధికి జీవితం ఎంతో భారం.

- సంపాదకులు



# కమ్మతెమ్మెరలు

* "...మార్చి 2013 **మిసిమి** లోని వీరయ్యగారి నాస్తికత్వానికి పర్యాయపదం గోరా వ్యాసం ఆలస్యంగా చదవటం జరిగింది. నాకు తెలిసిన విషయం **మిసిమి**తో పంచుకుంటున్నాను. శ్రీరామకృష్ణ సమితి (ఇప్పుడు శ్రీరామకృష్ణ మిషన్), గాంధీనగరం, విజయవాడలో బోధ స్వరూపానంద స్వామి కార్యక్రమానికి వక్తగా కాదు శ్రోతగా వచ్చారు. చివరి క్షణాలలో ఎవరో భక్తుడు ఆయన గొంతులో శ్రీరామకృష్ణ చరణామృతం పోయటం విచిత్రం అయితే, ఆ పవిత్ర క్షణంలో మరణం సంభవించటం కాకతాళీయమో లేక యాదృచ్ఛికమో? ఏది ఏమైనా ఆయనకు స్వామి వివేకానందుల దేశభక్తి, మానవత్వం, సమాజసేవ, ఉన్నతాదర్శములు ఇష్టములు అనటానికి, వారు వివేకానందుల సాహిత్యము తీసుకుంటూ ఉండేవారు..."

  **– బి.ఆర్. శుద్ధ చైతన్య**, భీమునిపట్నం.

* "...ఒక మిత్రుడి ద్వారా ఆలస్యంగానే చేతికందిన మీ **మిసిమి** జనవరి, 2013 మాస పత్రికను ఆసాంతం చదివాను. ఒక సాహిత్యకారుడిగా మనసు పరవశించింది. అంతే కాక అందులో తన ఏకైక కుమార్తెను నాకిచ్చి సాలంకృత కన్యాదానం చేసిన తొలి తెలుగు సినీగీత రచయిత, ఆధ్యాత్మిక చింతనాపరుడైన నా మామగారు కీ.శే. *చందాల కేశవదాసు* గారి జీవిత విశేషాలతో కూడిన వ్యాసాన్ని కూడా చదివాను. వారి అల్లుడుగా వ్యాసాన్ని ప్రచురించిన సంపాదక వర్గానికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. అలాగే తన పరిశీలన ద్వారా నాకు తెలియని (ఫొటో విషయాలు), కొన్ని విషయాలను తన వ్యాసంలో ఉటంకించినందుకు మిత్రులు, జితేంద్రబాబును మనసారా అభినందిస్తున్నాను. ఒక జాతి మనుగడకు, దాని పుష్టికి, పరిపుష్టికి మాతృభాష వెన్నెముక లాంటిది. మాతృభాష నీరసిస్తే జాతి నీరసిస్తుంది. కాబట్టి తెలుగు సంస్కృతి సంప్రదాయాలను అనుసరించే మనం, తెలుగు వారమైన మనం మన మాతృభాష అయిన తెలుగు భాషను పరిరక్షించాలి. పత్రికలో ప్రచురించిన అన్ని వ్యాసాలు మన తెలుగు భాషాభివృద్ధికి చెందినవే. అందుచేత అక్షరజ్ఞానం కలిగిన ప్రతి తెలుగు వాడు ఇలాంటి వ్యాసాలను చదవాలి, చదవడమే కాదు, చదవడంలో, వ్రాయడంలో, మాట్లాడటంలో దోషాలు దొర్లకుండా సరిచూసుకోవాలి. అప్పుడే దాని మనుగడ సాధ్యం అవుతుంది..."

  **– గంధం నరసయ్య**, నల్లగొండ జిల్లా.

* "...చాలా మంచి వ్యాసాలు ప్రచురిస్తున్నందుకు అభినందనలు. ముకుంద రామారావు గారి *అరబ్బీ కవిత్వం* చాలా చాలా బావుంది. *పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా*, గోపీచంద్ రచన, ఏప్రిల్ సంచికలో రావినూతల సత్యనారాయణ గారు అద్భుతంగా పరిచయం చేశారు. ధన్యవాదాలు."

  **– ఎమ్. వీరేశ్వర రావు**, బర్హంపూర్.

* "...మార్చి, 2013 సంచిక అలనాటి సాహిత్య మాస పత్రిక భారతిని, స్రవంతిలను గుర్తు చేసింది. పోగా చక్కని ముద్రణతో, నాణ్యమైన కాగితంతో, వైవిధ్యమైన అంశాలతో, వాటి కన్నా ఒక వీసమెక్కువ అనిపించింది... ఒక డజనుకు పైగానున్న అంశాలలో దేనికదే పోటీ పడ్డది. వస్తు విషయంలోనూ, వైవిధ్యంలోనూ, రచనా శిల్పంలోనూ దేనికదే సాటి అనిపించింది... ...కాగా పోగా ఒక్క అంశాన్నే ఎంచుకొని, బాగోగులు నిర్ణయించమంటే ముకుంద రామారావు వ్రాసిన మధ్య ప్రాచ్యంలో *అరబ్బీ కవిత్వాన్ని* ఎంచుకుంటాను. అలతి అలతి పదాలలో, సొంపైన పొందికతో, ఇంపైన శైలిలో మనస్సును ఆకట్టుకుందీ రచన...

...'హృదయంలో విశ్వాసం ఎడారిలో నీరుండే చోటు లాంటి; నీ నోటిలో తిండి వున్నపుడు నీవెలా పాడగలవు; నీ చేతి నిండా బంగారమున్నపుడు ఎలా దీవించగలవు' మున్నగు చిత్ర విచిత్రమైన పదజాల కల్పనతో మనస్సును ఇహలోకంలోనే కాని, ఊహా లోకంలో విహరింప జేసింది... రచయితకు అభినందన మందారమాల... నా వయస్సు 72 సంవత్సరాలు. నేను పుట్టినప్పటి నుండి అలంపురం, మహబూబ్‌నగర్ జిల్లాలో వుండగా, కర్నూలు జిల్లా ఆలయాల ఛాయాచిత్రాలలో ప్రచురించడం భావ్యమా? ఆలోచించండి..."

"...షడ్రుచుల సమ్మేళనం ఉగాది పచ్చడిలా ఏప్రిల్ ***మిసిమి*** వింత వింత సోయగాలతో భాసిల్లింది... పాఠకులు పలురకాలు. అందరి అభిరుచికి అనుగుణంగా కొన్ని శీర్షికలు ఎన్నుకొని, ప్రత్యేకమైన అభిరుచులకు మరి కొన్ని శీర్షికలు కేటాయించడం ఆనందకరం... పదిహేను వ్యాసాలున్న ఈ ***మిసిమి*** తన మిస మిసలను ప్రతి శీర్షికలో చూపినా, కొన్ని మాత్రం మిగతా వాటికన్నా ఎక్కువ మెరిసాయి... *హిందూస్థానీ-కర్ణాటక ఆచార్య బృహస్పతి వాదం* - నండూరి పార్థసారథి రచన సంగీతంలో లోతుపాతులను, ఎన్నో ఎరుగని విషయాలను స్పృశించింది... ముకుంద రామారావు *ఫార్సీ, తుర్కీ, హీబ్రూ కవిత్వం* వస్తుపరంగా, కవితాత్మకంగా చక్కగా వుంది... పన్నాల సుబ్రమణ్యభట్టు, పెద్దిబొట్ల సుబ్బరామయ్యగారితో *మాట కచేరీ*, పసందుగా, రసరమ్యంగా వుంది... *రేడియో నాటకం* గురించి మారుతీరావు వివరణ ఆసక్తిదాయకంగా వుంది..."

– **డాక్టర్ శివభూషణం,** కర్నూలు.

* "...ఉగాది సంచిక ముఖచిత్రాలు వేటికవే ఆణిముత్యాలనటంలో అతిశయోక్తి లేదు. శ్రీమతి అన్నపూర్ణగారికి అభినందనలు. సృజనాత్మక కళల్లో శిల్పకళ, చిత్రలేఖనం ముఖ్యమైనవి అనుకుంటాను. కళాకారుని మదిలో మెదిలే అనేక ఊహలకు అద్దంపట్టి రూపాన్ని సంతరించుకొనే ఈ కళ భావుకులకు వరం... నేనెన్నో సార్లు అనుకున్నాను. నేను ఒక చిత్రకారుణ్ణి కాలేకపోయానని. ప్రకృతి ఆరాధకుడినైన నాకు చిత్రకళ అబ్బిఉంటే ఇంకెంత బావుండేదో. మా వంటి రసికులకు ఆనందాన్ని అందిస్తున్న మీకు హృదయ పూర్వక అభినందనలు. *తీపి చేదుల ఉగాది, పంచాంగ శ్రవణం, అమ్మా పూలమ్మా, వలపు రాగం* ఇవి వేటికవే సాటి. ప్రతి చిత్రం వెనక ఎంతో దీక్ష, నిశిత కళా దృష్టి తపన దాగి ఉన్నాయి..."

– **గీతాంజలి మూర్తి,** హైదరాబాదు.

✦ మంచి ఉత్తరానికి ఒక మంచి పుస్తకం బహుమతి! ✦

# లోకోత్తరుడు

- మహాత్మాగాంధి

**బా**ల్యదశలో నేను ఇంగ్లాండు వెళ్లినప్పుడు చదివిన మొట్టమొదటి మతగ్రంథం *లైట్ ఆఫ్ ఏషియా*. అందలి ప్రతి పుట క్షుణ్ణంగా చదివాను. సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ మనోహరంగా రచించిన బుద్ధుని ఉపదేశాలపట్ల నాకు అపారమైన గౌరవం కలిగింది. పూజ్యభావంతో పుస్తకం ముగించాను. దక్షిణాఫ్రికాలో నేను జీవనం ప్రారంభించినప్పుడు ఆ గ్రంథం మరొక పర్యాయం పఠించాను. అప్పటికి నేను ప్రపంచంలోని గొప్ప మతాలకు సంబంధించిన గ్రంథాలు కొంతవరకు చదివాను. *లైట్ ఆఫ్ ఏషియా* నేను రెండవసారి చదివినప్పుడు కూడా నాకు మొదటి పర్యాయం కలిగిన పూజ్యభావం యెంత మాత్రం తగ్గలేదు. తరువాత కొంతకాలానికి ఎరవాడ జైలులో వున్నప్పుడు మరికొంత సాహిత్యం చదివాను.

బౌద్ధమత అధ్యాపకులవలె, హిందూ తత్త్వవేత్తలవలె హిందూ మత ప్రధాన సిద్ధాంతాలకు, బౌద్ధమత ప్రధాన సిద్ధాంతాలకు ముఖ్యమైన భేదం వున్నదని నేను భావించను. బుద్ధుడు నిజజీవితంలో అనుష్ఠించినది, హిందూ మత ధర్మమనే నా అభిప్రాయం. అతడు సంస్కర్త అన్న మాట నిజమే. ఆ కాల పరిస్థితులు కడు దారుణమైనవి. తన ఉన్నతికి, సంఘం ఉన్నతికి అత్యవసరమని తాను భావించిన సంస్కరణను సాధించడానికి యెంతటి బాధ అనుభవించ డానికైనా అతడు లెఖ్ఖచెయ్యలేదు.



మాయాదేవి స్వప్నం

చరిత్ర చెప్పేమాట నిజమే అయితే, అంధప్రాయంగా తత్కాలస్థితిని సమర్థించే బ్రాహ్మణులు అతని సంస్కరణను నిరాకరించారు. వారి స్వార్థపరత్వమే అందుకు కారణం. అయితే, సామాన్యప్రజలు తత్త్వవేత్తలు కారు. వారు వేదాంతగోష్ఠితో కాలక్షేపం చేసేవారు కారు. క్రియా జీవితమే వారి వేదాంతం. వారికి సహజ జ్ఞానం పుష్టిగాను పదునుగాను వుంది. వారు బ్రాహ్మణుల స్వాతిశయాన్ని, స్వార్థపరత్వాన్ని లక్ష్యపెట్టలేదు. కనుక తమ ధర్మాన్ని గురించి సరిగా చెబుతున్న ప్రవక్త బుద్ధుడేనని గుర్తించడానికి వారు సందేహించలేదు. నేనుకూడా సామాన్య మానవుడనే, ప్రజలమధ్య జీవిస్తున్నవాడనే. కనుక బౌద్ధమతం ప్రజా బాహుళ్యపు ఆచరణా పరిధిలోకి వచ్చిన హిందూ మతమేనని నేను గ్రహించాను. సుగ్రాహ్యమైన బుద్ధుని ఉపదేశాలకు విద్వాంసులు సంతృప్తి చెందకపోవడం కద్దు. వారు తమ మేధను సంతృప్తిపరచు కొనాలని ఆశించి, ఆశాభంగం చెందుతారు. మతం ముఖ్యంగా హృదయానికి సంబంధించిన విషయం. ధీశాలిననే అహంకారంతో దానిని పరిశీలించడానికి పూనుకుంటే ఆశాభంగం కలుగక తప్పదు.

బుద్ధుడు నాస్తికుడు కాదని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను. భగవంతుడు, తన దగ్గరకు స్వాతిశయ భావంతో వచ్చేవానికి, భక్తునికైనా సరే, దర్శనమివ్వడానికి నిరాకరిస్తాడు. నేలమీద సాష్టాంగపడి, ముక్కు నేలకు రాచుకునేవారిని అతడు నమ్మడు. ముక్కు మీద మచ్చలు చూడ్డానికి అతడిచ్చగించడు. రోజూ మసీదులో సాష్టాంగపడి నుదురు నేలకు రాచుకొనడంవల్ల అనేకమంది ముసల్మానుల నుదురుమీద ఏర్పడిన పెద్ద మచ్చలు మీలో కొంతమంది చూచేవుంటారు. భగవంతుడు, అపేక్షించేది యిట్టి మచ్చలు కాదు. అతడు శీలాన్ని తరచి, తరచి చూస్తాడు. ఒకడు

తన ముక్కు కోసుకోవచ్చు, అరగ తీసుకోవచ్చు. కాని, సాటిమానవునితో శత్రుత్వం వహిస్తే, తోటివారికోసం హృదయం గాయపడకపోతే, హృదయంలో నుంచి రక్తం ధారాళంగా ప్రవహించకపోతే అతనిని తన వానిగా భగవంతుడు గుర్తించడు. గర్వమెట్టిదో యెరుగని ప్రజలు నమ్రతతో భగవంతుని సమీపిస్తారు. ఇదే బౌద్ధమత ముఖ్యధర్మమని నా అభిప్రాయం. బౌద్ధమతం విశేషంగా ప్రజాసామాన్యానికి తగిన మతం.

బౌద్ధమతం భారతదేశంనుంచి బహిష్కరించబడిందన్న మాట నేనెంతమాత్రం అంగీకరించను. బౌద్ధమత ధర్మాలలో ముఖ్యమైనదల్ల చైనా, సింహళం, జపాన్ దేశాలలో కంటె భారతదేశంలోనే యెక్కువగా కార్యరూపం దాల్చింది.

మన బర్మా మిత్రులకంటె కూడా యెక్కువగా మనమే బౌద్ధమతాన్ని ఆచరణలో మన్నిస్తున్నామని చెప్ప సాహసిస్తున్నాను. బుద్ధుని బహిష్కరించడం సాధ్యంకాని పని. భారతదేశంలో అతడు జన్మించిన మాట కాదనడం యెలా సాధ్యం? తన జీవితంతో అతడు తన పేరు చిరస్థాయి చేసుకున్నాడు. కోటాను కోట్ల ప్రజల జీవితంలో నేడతడు జీవిస్తున్నాడు. చిన్న దేవళానికి వెళ్ళి అతని ప్రతిమను పూజిస్తేనేమి? పూజించక పోతేనేమి? అతని నామం జపిస్తేనేమి? జపించక పోతేనేమి? నా హృదయం పరిశుద్ధమైనదేతే, నేను రాముని పేరు 'మరా' అని తప్పుగా పలికినా దోషంలేదని, తప్పుగా పలికినా బ్రాహ్మణ పండితుల కంటె నేనెక్కువ పటిమతో ఉచ్చరించ గలనని నా హిందూ మతం చెబుతుంది. సత్యాన్వేషణకై లక్షలాది ప్రజలు ఏ ఒక్క వ్యక్తి అనుచరులమనో చెప్పుకోనవసరం లేదని బుద్ధుడు మనకు బోధించాడని నా అభిప్రాయం.

బుద్ధభగవానుని సందేశం మనమెంత వరకు పాటిస్తున్నామో, మానవకోటికి ధర్మం ఉపదేశించిన ఆ మహితాత్మునికి జోహారులర్పించగల యోగ్యత మనకెంతవరకు కలదో, యెవరిమట్టుకు వారు ఆత్మపరీక్ష చేసుకొనడం మంచిది. ఆచంద్రతారార్కం అతడు లోకోత్తరులలో ఒకడుగా ఎన్నబడగలడనటానికి నా కెట్టి సందేహం లేదు.

మనం హిందువులమైనా, మరెవరమైనా మానవకోటికి బుద్ధదేవుడు అనేక శతాబ్దాల క్రితం చేసిన ఉపదేశాన్ని మన జీవితంలో పాలించడానికి పరాత్పరుడు తోడ్పడుగాక.



సిద్ధార్థుని జననం

# బుద్ధ దేవుడు

- రవీంద్రనాథ్ ఠాగూరు

సర్వ శ్రేష్ఠుడైన మానవునిగా నా హృదయం ఎవరినైతే భావిస్తుందో, ఆయన జన్మోత్సవ సందర్భంలో ఈ వైశాఖ పూర్ణిమనాడు ఆయనకు నా ప్రణామాలు అర్పించడం కోసం వచ్చాను. కేవలం ఏదో విశేషమైన ఒక ఉత్సవానికి ఒక పరికరంగా గానీ లేదా అలంకారప్రాయమైన వస్తువుగా గానీ నేనీ పని చేయడంలేదు. ఏకాంతంలో అనేక సార్లు నేను సమర్పించుకుంటూ వస్తున్న అర్ఘ్యమే తిరిగి ఈ రోజు ఇక్కడ మీ సమక్షంలో అర్పిస్తున్నాను.

ఒకసారి బుద్ధగయ దేవాలయాన్ని సందర్శించు కొనేందుకు వెళ్ళాను. అప్పుడు నా మనసులో - తన చరణ స్పర్శతో వసుంధరను పవిత్రం చేస్తూ ఈ గయక్షేత్రంలో సశరీరంగా బుద్ధభగవానుడు సంచరిస్తున్న కాలంలో నేనెందుకు జన్మించలేదు? మనోవాక్కాయ పూర్వకంగా ఆయన పుణ్య ప్రభావానుభూతిని ప్రత్యక్షంగా ఎందుకు అనుభవించలేక పోయాను? అనే ఆలోచన కలిగింది.

కానీ, వెంటనే నాకు మరో ఆలోచన కూడా వచ్చింది- వర్తమాన కాల పరిధి ఎప్పుడూ చాలా సంకీర్ణమైందిగా ఉంటుంది. అప్పుడప్పుడే జరిగిన సంఘటనలు రేపే సుడిగాలితో అది కలుషితమై ఉంటుంది. అలాంటి సంకుచిత, కలుషిత కాలంలో ఆ మహామానవున్ని మనం పూర్తిగా అర్థం చేసుకోగలిగి ఉండే వారం కాదు. ఈ విషయాన్ని చరిత్ర అనేక సార్లు రుజువు చేసింది. బుద్ధదేవుడు తన జీవితకాలంలో క్షుద్ర మనస్కుల ఈర్ష్యను, వ్యతిరేకుల విరోధాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆయన గొప్పతనాన్ని తగ్గించడానికి అనేక విధాల మిథ్యా ప్రచారం జరిగింది. వేల మంది మనుషులు ప్రత్యక్షంగా తమ కన్నులతో ఆయనను చూశారు. కానీ వారంతా బుద్ధదేవుని విస్తృతమైన 'దూరత్వాన్ని' అవగాహన చేసుకోలేక పోయారు. ఆయన అలౌకికత్వాన్ని వారు యథార్థ రూపంలో తెలుసుకోలేక పోయారు. ఎందుచేతనంటే, అప్పటికి ఆయన జన్మించి ఎక్కువ కాలం గడవలేదు కాబట్టి. అందువల్ల ఆయన కాలంనాటి సంఘటనల అస్పష్ట ఆవరణంలో ఆయనను ప్రత్యక్షంగా దర్శించుకోలేక పోవడం మంచిదే అయిందనే భావన నాకు కలిగింది..

మహా పురుషులైనవారు తాము జన్మించిన వెంటనే ఒక గొప్ప యుగంలో తమను ప్రతిష్ఠింప చేసుకుంటారు.. గతకాలంలోనూ వారి ఉపస్థితి ఉంటుంది, సువిశాలమైన భవిష్యత్కాలంలోనూ వారు విరాజిల్లుతుంటారు. ఆనాడు బుద్ధగయ మందిరంలో ఉండగా నాకీ విషయం బాగా బోధపడింది. నేనక్కడొక దృశ్యం చూశాను. ఎంతో దూర దేశమైన జపాన్ నుంచి, సముద్రం దాటి ఒక పేద జాలరి ఆ దేవాలయంలోకి వచ్చి ఉన్నాడు. తను చేసిన ఏదో ఒక దుష్కర్మ విషయంలో పశ్చాత్తాపం వెలిబుచ్చడానికి. నిర్జనము, నిశ్శబ్దము అయిన ఆ అర్ధ రాత్రి ఏకాగ్ర మనస్కుడై చేతులు జోడించి అతడు మాటిమాటికి "నేను బుద్ధుని శరణు జొచ్చుతున్నాను" అని పలుకుతూనే ఉండి పోయాడు.

కొన్నిశతాబ్దాల మునుపు శాక్యవంశ రాజపుత్రుడు మానవుని దుఃఖార్తిని తొలగించే ధ్యాన సాధన చేయడానికి అర్ధ రాత్రిపూట రాజభవనం వదలిపెట్టి వెళ్ళిపోయాడు. కానీ ఆయన శరణు వేడేందుకే వేదనాభరితుడైన ఆ జపానీ



సిద్ధార్థునికి గల మహాపురుష లక్షణాలను చూసి అసితుడు ఆశ్చర్య చకితుడగుట

తీర్థయాత్రికుడు ఆ రోజున ఆ అర్ధ రాత్రి సమయంలో బుద్ధ గయలోని ఆ మందిరంలోకి వచ్చాడు. ఆ పాప పరితప్త యాత్రికునికి ఆ సమయంలో ప్రపంచంలో ప్రత్యక్షంగా ఉన్న వస్తువులన్నింటికంటే ప్రత్యక్షంగా ఉన్నవాడుగా, అప్పుడుగా బుద్ధ దేవుడు ప్రకాశమానుడైనాడు. ముక్తి కాముకులైన అలాంటి వ్యక్తుల జీవితంలో బుద్ధదేవుని జన్మదినం పరివ్యాప్తమై పోయి ఉంది. ఆ యాత్రికుడు ఆ నాడు తనలో జ్వలించే మానవత్వపు గంభీరాకాంక్షా దీప్తిలో తన ఎదుట నరోత్తముడైన బుద్ధుని దర్శించ గలిగాడు.

తాను జన్మించిన యుగంలో బుద్ధ భగవానుడు ప్రతాపవంతుడైన రాజుగానో, లేక విజేత అయిన వీరుడుగానో ప్రపంచం ఎదుటికి వచ్చి ఉంటే, మొత్తం ఆ యుగాన్ని తలమునకలు చేసి సులభంగానే అపూర్వ గౌరవమర్యాదలు పొందగలిగి ఉండేవాడు. కానీ ఆ గౌరవమర్యాదలు తన సంకుచిత కాల పరిమితుల్లో అంతరించి పోయి ఉండేవి. ప్రజల దృష్టిలో రాజు గొప్పవాడు. పేదవాని దృష్టిలో ధనవంతుడు గొప్పవాడు. బలహీనుని దృష్టిలో బలవంతుడు గొప్పవాడు. కానీ మానవత్వ సాధన చేసిన వారే, పూర్ణత్వ సాధన చేసిన వారే, మహామానవుని అభ్యర్థన చేయగలుగుతారు. మానవుడు మహామానవున్ని తనలో స్వీకరించడమే మహాయుగానికి ఆధారంగా ఉంటుంది. బుద్ధ భగవానుని ఆనాటి వెలుగు కాల పరిమితులను అతిక్రమిస్తూ మానవ హృదయ సింహాసనం పైన విరాజిల్లుతుండగా, ఈనాడు చూస్తున్నాం. తన చిత్త వికారంతోను, తన నైతిక స్వభావంలోని అపూర్ణత తోను, కించ పడుతున్న మానవుడు ఈ రోజు కూడా ఆయన వద్దకే వచ్చి "బుద్ధుడే నాకు శరణు" అని అంటున్నాడు. చిరకాలం నుంచి ప్రసరిస్తూ వస్తున్న మానవ చిత్తం యొక్క



సిద్ధార్థుని ప్రథమ ధ్యానం

ఈ ఘనిష్ఠానుభూతి లోనే బుద్ధ దేవుని అసలు ఆవిర్భావం ఉంది. సాధారణ మానవులమైన మన పరిచయం ఒక ప్రత్యేకమైన శ్రేణికి, ఒక ప్రత్యేకమైన జాతికి, ఒక ప్రత్యేకమైన సమాజానికి సంబంధించిన పరిచయంగా ఉంటుంది. ప్రతి బింబించిన ఇతరుల వెలుగులోకాక తమంత తామే ప్రకాశించే వారు, తమ మహిమ ద్వారానే, సత్యం ద్వారానే సంపూర్ణ ప్రకాశంతో వెలుగొందే వారు ప్రపంచంలో చాలా తక్కువ మందే జన్మించారు. అలాంటి ప్రకాశం యొక్క అంశ రూపాన్ని మాత్రం మనం చాలా మంది గొప్పవారిలో చూస్తూ ఉంటాం. వారు జ్ఞానులు, పండితులు, వీరులు, రాష్ట్ర నాయకులు. వారు మానవులను తాము కోరుకున్న పద్ధతిలో నడిపించారు. తమ సంకల్పశక్తితో చరిత్రను మలిచారు. అయితే వారిది ఆంశికమైన ప్రకాశమే. పరిపూర్ణమైన మానవత్వ వికాసం మాత్రం అన్ని దేశాల పైన, అన్ని యుగాల పైన, అందరు ప్రజల పైన అధికారం చేసిన వారిలోనే కనబడుతుంది. వారి చైతన్యం దేశ-కాలాల, జాతుల హద్దుల ద్వారా ఖండింప బడదు.

సత్యమే మానవుని అంతఃప్రకాశం. ఈ సత్యాన్ని గురించి ఉపనిషత్తుల్లో ఇలా చెప్పబడి ఉంది: "ఆత్మవత్ సర్వ భూతేషు యః పశ్యతి స పశ్యతి" ఎవరైతే సమస్త ప్రాణులను తమతో సమానంగా చూస్తారో, వారే సత్యాన్ని అర్థం చేసుకున్నవారు. ఎవరైతే తమ ఆంతర్యంలో సత్యాన్ని ఈ విధంగా అనుభూత మొనర్చుకున్నారో, వారిలోనే మానవత్వం ప్రకాశమానమవుతుంది. వారు తమ మానవత్వ మహిమతో దేదీప్యమానంగా వెలుగొందు తున్నారు.

**శ్లో॥ యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి**
**ఆత్మనః సర్వభూతేషు న తతో విజుగుప్సతే ।**

అందరియందు తనను, తనలో అందరిని ఎవరైతే దర్శించగలరో, అట్టివారు దాగి ఉండలేరు. సార్వకాలికమగు కాంతితో వారు ప్రకాశిస్తూ ఉంటారు. అలాంటి మానవత్వ ప్రకాశం ఈనాడు ప్రపంచంలోని అధిక సంఖ్యాకుల్లో ఆచ్ఛాదితమై ఉంది. కొన్ని చోట్ల అది స్పష్టంగా కనిపిస్తూ ఉంటే, మరి కొన్ని చోట్ల అది మరుగున పడి ఉంది. విశ్వ సృష్టి జరిగిన ఆదియుగంలో భూమండలమంతా దట్టమైన ఆవిరి తెరతో కప్పు బడి ఉండేది. అప్పుడు కొన్ని పర్వత శిఖరాలు మాత్రమే ఈ ఆవరణం పైకి లేచి ప్రకాశిస్తూ ఉండేవి. అదే విధంగా ఇప్పుడు కూడా, అధిక సంఖ్యాకులైన ప్రజలు తమ స్వార్థంతో, అహంకారంతో అవరుద్ధమైన చైతన్యంతో ఆచ్ఛాదితులై ఉన్నారు. అధిక సంఖ్యాకులైన

అలాంటి ప్రజల్లో సత్యానుభూతి అపరిణత స్థితిలోనే ఉంది.

మానవ సృష్టి ఇప్పటికీ అసంపూర్ణంగానే ఉంది. ప్రకాశవంతులైన మహాపురుషుల రూపంలో మానవత్వం ఒక్కసారిగా మన ఎదుట ఆవిర్భవించకుండా ఉండి ఉంటే అసంపూర్ణ మానవత్వపు దట్టమైన ఆవరణంలో మనకు మానవుని గూర్చిన అసలు పరిచయం ఎలా లభించేది? బుద్ధ భగవానునిలో మానవుని సత్యస్వరూపం దేదీప్యమానం కావడం ద్వారా మానవ లోకానికి అటువంటి మహాభాగ్యం కలిగింది. ఆయన ప్రతి మానవ మాత్రుణ్ణి తన విశాల హృదయంలోకి తీసుకొన్నాడు, మానవతను ప్రకాశింప చేశాడు. "న తతో విజుగుప్సతే" అలాంటి వారిని గుప్తంగా ఎవరు ఉంచ గలుగుతారు? దేశ కాలాలకు చెందిన ఏ హద్దు,ఏ స్వార్థం, ఏ లోభం వారిని దాచి ఉంచ గలుగుతుంది?

తపో వేదిక నుంచి లేచిన వెంటనే బుద్ధ భగవానుడు తన్ను తాను ప్రకాశింప చేసుకున్నాడు. ఈ ప్రకాశం యొక్క సత్య దీప్తితో భారత దేశం ప్రకాశవంతమైంది. మానవ చరిత్రలో జరిగిన ఆయన చిరంతన ఆవిర్భావం భారత దేశ భౌగోళిక హద్దులను దాటి దేశదేశాంతరాల్లో వ్యాపించింది. అన్ని దేశాలకు భారత దేశం ఒక తీర్థస్థానమైంది. ఎందు చేతనంటే, బుద్ధుని ప్రబోధాల ప్రభావం ద్వారా ఆనాడు భారతదేశం సమస్త మానవ జాతిని తన లోకి స్వీకరించింది కాబట్టి. ఈ దేశం ఎవరినీ ఉపేక్షించ లేదు, అందువల్లనే అది స్వయంగా కూడా అనామకంగా ఉండ లేదు. సత్య ఝంఝూనిలం వర్ణభేదాల గోడలను కూల్చి వేసింది, భారతదేశం పిలుపు దేశ విదేశాల్లోని అన్నిజాతుల దాకా చేరింది. చైనా, బ్రహ్మదేశం, జపాన్, టిబెట్, మంగోలియా ఈ పిలుపునందుకున్నాయి. అమోఘ సత్యానికి సంబంధించిన ఈ సందేశానికి దుర్గమ్యమైన పర్వతాలు, సముద్రాలు వైదొలగి దారి ఇచ్చాయి, దూర తీరాల మానవులు: "అదిగో, మనుష్యుడొకడు స్వయంప్రకాశితుడైనాడు. వేము దర్శించాము- మహాంతమ్ పురుషమ్ తమసః పరస్తాత్'' (ఆ మహాపురుషుడు అంధకారానికి అతీతుడు) అని చెప్పుకో సాగారు.

ఈ ప్రకటన వాక్యానికి మరుభూముల శిలా ప్రతిమల్లో అక్షయమైన రూపం లభించింది, అద్భుతమైన పూనికతో, శ్రమశక్తితో మానవుడు విగ్రహాల ద్వారా, చిత్రాల ద్వారా, స్తూపాల ద్వారా బుద్ధదేవుని పట్ల తమ ఆరాధనా భావాన్ని తెలియ చేశాడు. "దుస్సాధ్యమైన సాధనాల ద్వారానే ఈ అలౌకిక పురుషుని పట్ల భక్తి కనవరచ వలసి ఉంటుంది" అని అందరూ అన్నారు. అంతట వారి మనసుల్లో ఒకానొక అపూర్వమైన శక్తి యొక్క ప్రేరణ రేకెత్తింది. చీకటి గుహల గోడల పైన వారు చిత్రాలు గీశారు, ఒకదాన్ని మించి మరొకటిగా ఉన్న బరువైన బండరాళ్ళను పర్వత శిఖరాలకు చేర్చి దేవాలయాలు నిర్మించారు. వారి శిల్ప ప్రతిభ సముద్రాలు దాటి అపురూపమైన శిల్ప సంపదను నిర్మించింది. శిల్పులు తమ పేర్లు మరిచి, 'బుద్ధం శరణం గచ్ఛామి' అనే మంత్రాన్ని మాత్రమే శాశ్వతంగా వదలి వెళ్ళారు;

జావా ద్వీపంలో బొరొబుదూర్ స్తూప ప్రదక్షిణ చేస్తూ నేను జాతక కథలు చిత్రించి ఉన్న వందలాది విగ్రహాలను చూశాను. వాటిలోని ఒక్కొక్క విగ్రహంలో శిల్పి నైపుణ్యం తొణికిసలాడుతూంది. ఎక్కడా రవ్వంత అలసత్వంగానీ, అశ్రద్ధగానీ నాకు కనిపించ లేదు. దీన్నే శిల్పతపస్సని అంటారు. అంతేకాదు, అది భక్తికి సంబంధించిన తపస్సు కూడా. ఇక్కడ కీర్తి ప్రతిష్ఠల ఆశలేని నిష్కామ, కష్టమయ సాధన ఉంది. ఈ చిరస్మరణీయునికి, శిల్పి తన సర్వ శ్రేష్ఠమైన శక్తిని అర్పించాడు. వారంతా దుర్భర కష్టాలను స్వీకరించి తమ భక్తిని సార్థకం చేసుకున్నారు.

వారి భావన ఇది: "మానవ మాత్రునికి చెందిన చిరంతనమైన కళభాష ఏదైతే ఉందో, దాని ద్వారా ఉదార రూపంలో మన ప్రతిభను గనక మనం వ్యక్తీకరించకపోతే బుద్ధ దేవుడు సమస్త మానవ జాతి కోసం అవతరించాడు, యుగ-యుగాంతరాల కోసం అవతరించాడు, అని ఎలా అనగలం?" బుద్ధ దేవుడు మానవుల నుంచి దుస్సాధ్యమైన, చిర జాగరూకమైన, బంధన విచ్ఛేదకమైన విజయాన్ని



దేవదత్తుని హింసా ప్రవృత్తి

ప్రసాదించే అభివ్యక్తిని కోరాడు. అందువల్లనే పూర్వం ఈ మహాదేశంలో దుర్గమ స్థానాల్లో, పర్వత శిఖరాల పైన, ఎడారుల్లో, నిర్జన గుహల్లో పూజా రూపంలో ఆయన విజయ వాణి ప్రతిష్ఠితమైంది. బుద్ధభగవానునికి ఇంతకంటే కూడా గొప్ప అర్ఘ్యం అర్పించిన దినం మరొకటుంది. అది రాజాధిరాజు అశోకుడు పాప పరితాపంతో శిలాశాసనాల ద్వారా అహింసా ధర్మ మహిమనుద్ఘోషించి అనంతకాల ప్రాంగణంలో తన ప్రణామాలను అర్పించిన దినం.

ప్రపంచం ఇంత పెద్ద చక్రవర్తిని మరొకరిని ఎక్కడైనా చూసిందా? ఏ గురూత్తముని వలన ఈ చక్రవర్తికి మహాత్మ్యం చేకూరిందో, ఆ గురూత్తముని అవతరణను ఆహ్వానించవలసిన అవసరం ఇప్పుడున్నంతగా ఆయన జన్మించిన కాలంలో కూడా లేదు. వివిధ వర్ణాల మధ్య, జాతుల మధ్య పెరిగిన ద్వేషభావం, ధర్మం పేరుతో వ్యాపించిన అపవిత్రమైన భేద బుద్ధియొక్క మూఢత్వం, క్రూరత్వం భూమిని రక్తసిక్తం చేస్తున్నాయి. హింస, విధ్వంసకరమైన ద్వేషం మానవుణ్ణి అడుగడుగునా అవమాన పరుస్తున్నాయి. భాతృద్వేషంతో కలుషితమైన ఈ దుర్భాగ్య దేశంలో అన్ని ప్రాణుల పట్ల మైత్రి యొక్క ముక్తిపథాన్ని చూపిన మహానుభావుణ్ణి ఈ రోజు మనం ఉత్కంఠ భరితులమై గుర్తు చేసుకుంటున్నాము. ఆయన వాణినే మనం ఈనాడు వినాలని కోరుకుంటున్నాం. మానవుని శ్రేష్ఠతను ఉద్ధరించడానికి ఆ మానవశ్రేష్ఠుడు మన పూజా వేదిక పైన ఆవిర్భవించాడు. అన్నింటినీ మించిన దానం శ్రద్ధా దానం. బుద్ధుడు ఈ దానం ఇవ్వకుండా ఎవరినీ విడిచిపెట్ట లేదు. ఏ దయనైతే, ఏ దానాన్నైతే ఆయన ధర్మం అని అన్నాడో, అది దూరం నుంచి అంటకుండా ముట్టకుండా ఇచ్చే



సిద్ధార్థుని విలువిద్యా నైపుణ్యం

ధనదానం కాదు. అది ఆత్మదానం. స్వయంగా తననే అర్పించుకొనే దానం. ఆ దానాన్ని గురించి ధర్మం ఇలా చెబుతుంది : "శ్రద్ధయా దేయమ్" అంటే శ్రద్ధాపూర్వకంగా దానం చెయ్యి! మన శ్రేష్ఠత్వానికి, పుణ్యానికి, ధనానికి సంబంధించిన అహంకారం వల్ల మనమిచ్చే దానం కలుషితమవుతుందేమో, అధర్మంగా పరిణమిస్తుందేమో అనే భయం ఉంటుంది. అందువల్లనే ఉపనిషత్తు "భియా దేయమ్- భయ పడుతూ దానం ఇవ్వు", అని అంటుంది. ఎవరి భయం? ధర్మ-కర్మల ద్వారా మానవుని పట్ల శ్రద్ధ పోగొట్టుకొనే అవకాశమేదైతే ఉందో, దానితో మనం భయ పడాలి. నేడు భారత దేశంలో ధర్మకర్మల నిర్వహణలో మనుషుల పట్ల అశ్రద్ధ చూపే పద్ధతి నలు వైపులా వ్యాపించి ఉంది. దీని వల్ల కేవలం ఆధ్యాత్మికతకే కాక, దేశ విముక్తి సాధనకు కూడా ఎంతో హాని జరిగింది. ఈ విషయాన్ని ఈ రోజు మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం. రాజనీతి ద్వారా కానీ, లేదా మరో బాహ్యోపాయం ద్వారా గానీ ఈ సమస్య ఎప్పుడైనా పరిష్కరింపబడగలదా?

ఒకనాడు బుద్ధ భగవానుడు రాజ్య సంపత్తిని త్యజించి తపస్సు చేయడం కోసం కూర్చున్నాడు. ఆ తపస్సు వెనుక సమస్త మానవజాతికి దుఃఖ విముక్తి కలిగించే సంకల్పం ఉండింది. ఆ తపస్సులో లోకుల విషయంలో అధికార భేదమేమైనా ఉండిందా? ఆయన దృష్టిలో ఎవరైనా మ్లేచ్ఛుడుగా ఉండినాడా? ఎవరైనా అనార్యుడుగా ఉండినాడా? ఆయన తన సర్వస్వాన్నీ త్యాగం చేసింది అతి దీనుల కోసం, అతి మూఢుల కోసం కూడా. ఆయన తపస్సులో అన్ని దేశాల పట్ల, అందరు ప్రజల పట్ల శ్రద్ధాభావం ఉండింది. ఆయన చేసిన పరమోత్కృష్టమైన తపస్సు ప్రభావం ఈనాడు భారత దేశం లోంచి అదృశ్యమై పోవలసిందేనా?

నేనడిగే ప్రశ్న ఇది: మనిషికి మనిషికి మధ్య గోడలు లేవనెత్తి చివరకు మనం ఏ వస్తువును రక్షించ గలిగాం? ఒకానొక రోజు మన వద్ద నిండైన ధనాగారం ఉండేది. మరి బయటి నుంచి వచ్చి పడిన దెబ్బతో అది కూలి పోలేదా? దానిలో ఏమైనా ఇప్పుడు మిగిలి ఉందా? ఈ రోజు ఒకదాని తర్వాత మరొకటిగా గోడలు నిర్మించి మనం మానవుల పరస్పర ఆత్మీయతాభావానికి అవరోధం కలిగించాం. దైవాధికారాన్నే బంధించి దేవ మందిర ద్వారం వద్ద పహరా ఏర్పాటు చేశాం. దానం ద్వారా, వ్యయం ద్వారా వెళ్ళి పోయిన ధనాన్ని మనం కాపాడుకోలేక

పోయాం. కానీ దానం ద్వారా, వ్యయం ద్వారా ఏ ధనమైతే తరిగి పోదో, వృద్ధే చెందుతుందో, ఆ ధనాన్ని- మానవుని పట్ల శ్రద్ధను - మనం కులతత్వం, మత తత్వం అనే భోషాణంలో తాళం వేసి ఉంచేశాం. అందువల్ల పుణ్య సంబంధమైన భాండాగారం మనకు విషయ సంబంధమైన భాండాగారంగా మారిపోయింది. ఒకనాడు ఏ భారత దేశమైతే మానవుని పట్ల తాను చూపిన శ్రద్ధాభావం ద్వారా సమస్త ప్రపంచంలో తన మానవత్వాన్ని ప్రకాశింప చేసిందో, ఆ దేశమే ఇప్పుడు అతి సంకుచిత రూపంలో అందరి ముందు నిలుస్తొంది. మానవుని పట్ల అశ్రద్ధ కనపరచడం వల్లనే అది స్వయంగా మానవుని అశ్రద్ధకు గురి అయింది. ఈనాడు మానవునికి, మానవునికి మధ్య విరోధం ఏర్పడింది. ఎందుకంటే మానవుడు సత్యభ్రష్టుడై పోయాడు కాబట్టి, అతని మానవత్వం మరుగున పడి పోయింది కాబట్టి. అందువల్లనే ఈ రోజు ప్రపంచ మంతటా ఒకరి పట్ల ఒకరికి ఇంత అనుమానం, ఇంత భీతి, భయం, ఇంత ఆక్రోశం నెలకొని ఉన్నాయి. ఇప్పుడు ఆ మహా మానవుణ్ణి పిలిచి "నీ ప్రకాశం ద్వారా మరో సారి నీవు మానవునికి వెలుగు ప్రసాదించు" అని ప్రార్థించ వలసిన తరుణం వచ్చింది.

బుద్ధ భగవానుడు "అక్రోధం ద్వారా క్రోధాన్ని జయించు" అని అన్నాడు. కొన్ని సంవత్సరాల క్రితం ఒక మహాయుద్ధం జరిగింది. అందులో ఒక పక్షం విజయం పొందింది. ఆ విజయం బాహుబలంతో సాధించిన విజయం. కానీ బాహుబలం మానవుని పరమ బలం, చరమ బలం కాదు. అందువల్ల మానవ చరిత్ర దృష్టిలో ఆ విజయం నిష్ఫలమైందే. అది కేవలం క్రొత్త యుద్ధానికి బీజాలు నాటడమే చేసింది. మనిషిలో 'పశువు' ఇంకా జీవించే ఉంది. మానవుని అసలు శక్తి అక్రోధంలో ఉంది, క్షమాగుణంలో ఉంది అనే సత్యాన్ని ఆ పశువే తెలుసుకో నివ్వదు. కనుకనే మానవునిలోని సత్యం పట్ల శ్రద్ధ వహించిన మానవ గురూత్తముడు ఇలా అన్నాడు- "నీ క్రోధాన్ని, ఇతరుల క్రోధాన్ని అక్రోధంతో జయించు!" ఆ విధంగానే అతడు మనిషి అని అనిపించుకొంటాడు. అలా జరగనప్పుడు మనిషి వ్యర్థమైపోతాడు. బాహుబలంతో గనక క్రోధాన్ని, ప్రతిహింసను బలపరిస్తే మనకు శాంతి లభించదు. క్షమాగుణం లోనే శాంతి ఉంది. ఈ విషయాన్ని మనిషి ఎంత వరకైతే తన రాజనీతిలో, సమాజనీతిలో ఆచరించడో, అంత వరకు అపరాధి అపరాధం పెరుగుతూనే ఉంటుంది. దేశాల మధ్య విరోధాగ్ని చల్లారదు. కారాగృహంలోని అమానుష క్రూరత్వం వల్ల, శస్త్రాస్త్రాలతో కూడిన సైన్య శిబిరాల భృకుటీ విక్షేపం వల్ల భూతలానికి కలిగే మర్మాంతక వేదన క్రమక్రమంగా సహించరానిదిగా మారి పోతుంది. దాని అంతం ఎక్కడా కనిపించదు. పశుత్వ సహాయంతో సిద్ధి పొందాలనే దురాశ మనిషిలో ఉంది. ఈ దురాశ నుంచి మనిషిని విముక్తుణ్ణి చేయాలని సంకల్పించిన బుద్ధ భగవానుని మాటలు ఇవి: "అనోధేన జినేత్ కోధః" ప్రపంచమంతటా మనుష్యత్వం కించపడిపోతున్న ఈ యుగంలో ఆ మహామానవుణ్ణి స్మరించి "బుద్ధం శరణం గచ్ఛామి" అని ప్రణమిల్ల వలసిన సమయం వచ్చింది. ఎవరైతే తనలో మానవత్వాన్ని ప్రకాశమానమొనర్చుకున్నాడో, ఆయనకు మనం శరణాగతులం కావలసి ఉంది. ఆయన ఏ ముక్తిని గురించి చెప్పాడో, ఆ ముక్తి సకారాత్మకమైందే గాని నకారాత్మక మైంది కాదు. ఆ ముక్తి కర్మత్యాగం వల్ల లభించదు. సాధుకర్మల ద్వారా చేసే ఆత్మత్యాగం వల్ల లభిస్తుంది. ఆ ముక్తికి ఆధారం కేవలం రాగద్వేష విసర్జనంలో లేదు. సర్వ ప్రాణుల పట్ల అపరిమితమైన మైత్రిని సాధన చేయడంలో ఉంది. నలువైపులా మనం స్వార్థ క్షుధతో కూడిన గుడ్డి వైశ్యవృత్తిని చూస్తున్న ఈనాడు తన అంతర్యంలో విశ్వ మానవుని సత్యస్వరూపమును ప్రకాశమాన మొనర్చుకొని ఆవిర్భవించిన ఆ బుద్ధదేవుని శరణు నేను కోరుతున్నాను. మి

---

హిందీ నుంచి అనువాదం : జనపన లక్ష్మిరెడ్డి,
విశ్రాంత ఆచార్యులు, న్యూ ఢిల్లీ.
ఫోన్ : 09811589430



సిద్ధార్థుని అద్భుతమైన గుర్రపు స్వారీ

# సామాజిక భేదాలను కూల్చి వేసేదే సద్ధర్మం

- బి.ఆర్. అంబేద్కర్

మనిషికి, మనిషికిమధ్య అవరోధాలను ఛేదించగల ధర్మమే సద్ధర్మము.

ఆదర్శ సమాజమనగానేమి? ఆదర్శ సమాజమనగా వేదాలలో చెప్పబడినదేననీ, వేదాలు దోషరహితమైనవిగనుక వాటిలో చెప్పబడినదే ఆదర్శ సమాజానికి అర్థమని బ్రాహ్మణులంటారు. దానినే విధిగా అంగీకరించాలని వారంటారు.

చాతుర్వర్ణ విధానమే ఆదర్శ సమాజమని వేదాలలో చెప్పబడియున్నది.

ఈ వేదాలలో చెప్పబడిన ఆదర్శ సమాజ స్వరూపం మూడు నియమాలను అనుసరించి ఏర్పడాలి.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలతో అది రూపొందాలి.

ఈ నాలుగు వర్ణాలమధ్య సంబంధాలు ఆరోహణా క్రమంలో అసమానతలతో కూడి వుంటాయి. దాన్నింకా విడమరచి చెప్పాలంటే ఒక కులానికంటే మరోకులం ఉన్నత స్థాయిలో వుంటుంది. హక్కులూ, సౌకర్యాల విషయంలో వీటిమధ్య సమానత్వానికి ఏమాత్రం ఆస్కారం లేకుండా వుంటాయి.

బ్రాహ్మణులు అగ్రభాగాన వుంటారు. క్షత్రియులు బ్రాహ్మణులకు అధోస్థాయిలోనూ వైశ్యులకు పైస్థాయిలోనూ వుంటారు. క్షత్రియులకు అధోస్థానంలోను, శూద్రులకు పైస్థాయిలోను వైశ్యులుంటారు. అట్టడుగు స్థాయిలో శూద్రులుంటారు.



సిద్ధార్థ యశోధరల కళ్యాణ వేడుక

ఏ వర్ణానికి ఏ వృత్తి నిర్ణయింపబడినదో దానినే ఆ వర్ణంవారు చేయాలి అన్నది మూడవ నియమము, జ్ఞాన సముపార్జన, బోధన, మతవిధుల నిర్వహణ బ్రాహ్మణుల వృత్తి. ఆయుధాలను ధరించి యుద్ధాలు చేయడం క్షత్రియుల వృత్తి. వ్యాపారం, వాణిజ్యం వైశ్యుల వృత్తి. పై మూడు కులాలవారికి సేవ చేయడం శూద్రుల వృత్తి.

ఏ పరిస్థితిల్లోనూ ఈ వర్ణాలవారు ఈ నియమాన్ని కాదని ఒక వర్ణంవారి వృత్తి మరో వర్ణంవారు చేపట్టరాదు.

ఆదర్శ సమాజమన్న పేరుతో ఏర్పాటైన ఈ వ్యవస్థను చాలా ఉత్తమమైనదిగా బ్రాహ్మణులు సమర్థించారు. ప్రజలంతా దీనిని తప్పక పాటించాలంటూ ప్రచారం చేశారు.

అసమానతా విధానమే దీని ఆంతర్యమని అర్థం చేసుకోవచ్చు. ఈ సాంఘిక అసమానత చారిత్రక కారణాలవలన ఏర్పడింది కాదు. అసమానత అనేది బ్రాహ్మణుల అధికారికమైన సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని ఆద్యంతం వ్యతిరేకించాడు బుద్ధుడు.

ఈ కుల వ్యవస్థను తీవ్రంగా వ్యతిరేకిస్తూ సమానత్వాన్ని గట్టిగా బలపరచింది బుద్ధుడే.

కులాన్ని, అసమానతను సమర్థిస్తూ తేబడిన వాదాలన్నింటినీ నవాలు చేస్తూ తాను చేయని ప్రతివాదమంటూ లేదు.

ఈ విషయంపై చాలామంది బ్రాహ్మణులు బుద్ధుణ్ణి వ్యతిరేకించారు. కాని బుద్ధుడు తన వాదనా కుశలత్వంతో వారందరినీ సమాధానం లేకుండా చేయగలిగాడు.

దీనికి సంబంధించిన ఒక సంవాదం మనకు అశ్వలాయన సూత్రంలో కనిపిస్తుంది. కొందరు బ్రాహ్మణులు అశ్వలాయణుడను వేదపండితుని కలసి కులాన్ని, అసమానతా విధానాన్ని సమర్థిస్తూ బుద్ధునితో వాదానికి దిగవలసిందిగా ప్రోత్సహించారు.

అశ్వలాయనుడు బుద్ధుని దర్శించి బ్రాహ్మణులు జన్మతః ఉన్నతులని వాదించాడు.

"ఓ గౌతమా! జన్మతః ఉన్నతులమన్నది బ్రాహ్మణుల వాదము. శ్వేతవర్ణులైన బ్రాహ్మణులు ఉన్నతులైనట్లే నీలవర్ణులైన తక్కిన మూడు కులాలవారు హీనస్థాయికి చెందినవారు. బ్రహ్మ నోటినుండి పుట్టినవారుగనుక బ్రాహ్మణులు పవిత్రులు. బ్రహ్మచే సృష్టింపబడినవారుగనుక

ఈ బ్రాహ్మణులు అతనికి పుత్రులు. బ్రహ్మకు వారసులు. ఈ విషయమై మీరేమంటారు?" అంటు ప్రశ్నించాడు అశ్వలాయనుడు.

ఈ ప్రశ్నకు బుద్ధుడిచ్చిన సమాధానంతో అశ్వలాయనుడు అవాక్కయి మారు మాటాడలేదు.

"ఓ అశ్వలాయనా! తక్కిన కులాలలోని స్త్రీలవలెనే బ్రాహ్మణ స్త్రీలు కూడా రజస్వల అయిన అనంతరం గర్భం దాల్చి పిల్లల్ని కంటున్నారుగదా. అలాంటప్పుడు తక్కిన స్త్రీలకు పుట్టినట్లే ఈ బ్రాహ్మణులు పుట్టలేదని నీవెలా చెప్పగలవు?"

బుద్ధుని ప్రతివాదనకు అశ్వలాయనుడు ఏ జవాబు చెప్పలేకపోయాడు.

బుద్ధుడింకా తన ప్రతివాదాన్ని కొనసాగిస్తూ అశ్వలాయనుని ఇలా ప్రశ్నించాడు.

"అశ్వలాయనా! రాజవంశానికి చెందిన ఒక యువకుడు బ్రాహ్మణ స్త్రీని సంభోగించాడనుకొందాం. ఆ బ్రాహ్మణ స్త్రీ మానవుణ్ణే కంటుందా లేక మృగాన్ని కంటుందా?"

ఈ ప్రశ్నకు అశ్వలాయనుడు ఎలాంటి సమాధానము చెప్పలేకపోయాడు.

"ఇక నైతికపరంగా ఆలోచించినట్లయితే ఈ దేశంలో ఒక్క బ్రాహ్మణుడు మాత్రమే ఎలాంటి ద్వేషభావాన్ని ద్రోహచింతను కలిగి యుండక తన హృదయాన్ని ప్రేమమయంగా ఉంచుకోగలుగుతున్నాడనీ, తక్కిన మూడు కులాలవారికి అది సాధ్యంకాదనీ చెప్పగలవా?"

"ఎలా చెప్పగలను? అన్ని కులాలవారు అలా ఉండ గలగడం సాధ్యమే" అన్నాడు అశ్వలాయనుడు.

"అశ్వలాయనా! హూణ, కాంభోజ దేశాలలో యజమానులు, బానిసలు అనే రెండు వర్ణాలు మాత్రమే వున్నాయనీ అయితే యజమానులు బానిసలుగా మారవచ్చునీ, బానిసలు యజమానులు కాగలుగుతారనీ నీవెరుగుదువా?"

"అవును ఆ దేశాలలో అలాంటి విధానమే వున్నట్లు విన్నాను" అన్నాడు అశ్వలాయనుడు.

"మీరు ఆచరించే చాతుర్వర్ణ వ్యవస్థ ఆదర్శ ప్రాయమైనది అయినట్లయితే అది యావత్ప్రపంచానికి ఎందుకు వర్తించలేదు?"

బుద్ధుడు అడిగిన ప్రశ్నల్లో ఏ ఒక్కదానికి అశ్వలాయనుడు సరియైన సమాధానం చెప్పలేకపోయాడు. ఆఖరుకు ఆ బ్రాహ్మణ పండితుడు బుద్ధునికి శిష్యుడయ్యాడు.

వశిష్ఠుడనే బ్రాహ్మణుడు బౌద్ధధర్మాన్ని స్వీకరించిన కారణంగా సాటి బ్రాహ్మణులు అతన్ని ఆక్షేపిస్తూ నిందిస్తూండేవాడు.

ఒకరోజున వశిష్ఠుడు బుద్ధుని దర్శించి తనపై బ్రాహ్మణులు సాగిస్తున్న దూషణగూర్చి తెలిపాడు.

"ఓ భగవాన్! బ్రాహ్మణులు సమాజంలో అత్యున్నతమైన స్థాయి బ్రాహ్మణులదే అంటారు. వారి దృష్టిలో తక్కువ కులాలవారు అధములు. బ్రాహ్మణ వర్ణమే స్వచ్ఛమైనదనీ తక్కిన వర్ణాలు మలినమైనవనీ వారి వాదన. ఎలాంటి సంకరం లేనిది ఒక్క బ్రాహ్మణులలో మాత్రమేననీ వారి వాదన. బ్రహ్మ నోటినుండి పుట్టినందుకు బ్రాహ్మణులు మాత్రమే పుత్రులనీ, వారే బ్రహ్మకు అసలైన సంతానమనీ వారే బ్రహ్మకు వారసులనీ వారు వాదిస్తారు."

"నీవు ఉన్నత వర్ణంలో పుట్టి హీనవర్ణస్తులతో కలిసిపోయి, కేశముండనం చేసికొని, సన్యాసివై కడకు బ్రహ్మ కాళ్లనుండి పుట్టినవారితో సమానమైపోయావంటు నిందిస్తున్నారు. నీవు చేసిన కార్యమెంత మాత్రము మంచిదికాదనీ, ఉన్నతవర్ణంనుండి విడిపోయి అధోవర్ణాల వారితో కలవడం, శ్వేతవర్ణుడవైవుండీ మలిన వర్ణస్తులతో చేరడం తప్పనీ అంటున్నారు.

"భగవాన్! ఆ విధంగా వారు నన్ను విమర్శిస్తూ, దూషిస్తూ, అవమానిస్తున్నారు" అని వశిష్ఠుడన్నాడు.

ఆ మాటలకు బుద్ధుడు ఇలా అన్నాడు: ఓ వశిష్ఠా! ఆవిధంగా నిన్ను బాధకు గురిచేస్తున్న బ్రాహ్మణులు వాస్తవాన్ని విస్మరిస్తున్నావన్నమాట. తక్కిన కులాలవలెనే బ్రాహ్మణ స్త్రీలు సైతం పిల్లల్ని కనడం నీవు చూస్తున్నావుకదా. అలాంటప్పుడు వారు బ్రహ్మ నోటినుండి ఉద్భవించారనడం, ఆ కారణంగా వారు బ్రహ్మ సంతానమని చెప్పడం, బ్రహ్మకు వారసులమని వాదించడం ప్రకృతి విరుద్ధమైన విషయంగదా!"

ఒకప్పుడు విశ్వకారి అనే బ్రాహ్మణుడు బుద్ధుని



సిద్ధార్థుని గృహ త్యాగం

వద్దకువచ్చి మూడు ప్రశ్నలపై వాదం మొదలు పెట్టాడు."

వృత్తులను శాశ్వతంగా స్థిరీకరించడం మొదటిది. ఈ ప్రశ్నపై తన వాదం ప్రారంభిస్తూ "మిమ్మల్ని" ఒక ప్రశ్న అడగదలచాను. బ్రాహ్మణులు అన్ని కులాలకంటె అగ్రభాగాన వుంటున్నారు గనుక వారు మరెవ్వరికీ సేవ చేయడానికి వీల్లేదని మా బ్రాహ్మణుల వాదన. అంతేగాక మిగతా వారందరు బ్రాహ్మణులకు సేవచేయడానికే పుట్టారు.

"గౌతమా! ఈ సేవ నాల్గు విధాలు, బ్రాహ్మణులు చేసే సేవ, రాజులు చేసే సేవ, మధ్యతరగతి వారు చేసే సేవ, శూద్రులు చేసే సేవ. ఇందులో శూద్రునికి మాత్రమే మరొక శూద్రుడే సేవచేయాలి. శూద్రునికి ఇంకెవరు సేవచేస్తారు? ఈ విషయమై పూజ్యులైన గౌతముని అభిప్రాయమేమిటి?

బ్రాహ్మణుడు అడిగిన ప్రశ్నకు బుద్ధుడు ఎదురు ప్రశ్నతో సమాధానమిచ్చాడు. "బ్రాహ్మణులు చెప్తున్న నాలుగు విధాల సేవా విధానమే యావత్ ప్రపంచంలోనూ వున్నదా?"

"నేను చెప్పదలచినదల్లా అన్నివిధాల సేవలు చేయరాదు లేక అన్నివిధాల సేవలు చేసేందుకు నిరాకరించరాదు అన్న విషయం మాత్రమే. ఏ సేవచేయడం ఉచితమో అది చేయాలి. ఏది చేసినందువల్ల కీడు వాటిల్లుతుందో అది చేయరాదు.

బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని తాము చేసేదానివలన తమ వ్యక్తిత్వానికి లోపమేర్పడేటట్లయితే వారు ఆ పని చేయరాదు. ఏపని చేసినందువలన అది వ్యక్తి ఔన్నత్యాన్ని పెంచుతుందో ఆ పనే చేయాలి.

"వంశపారంపర్యంగా ఒక వ్యక్తియొక్క స్థాయిని నిర్ణయించడంలోగల దోషమేమిటి?" ఇది బ్రాహ్మణుడైన విశ్వకారి రెండవ ప్రశ్న.



మహాభినిష్క్రమణం

ఆ ప్రశ్నకు బుద్ధుడిలా సమాధానమిచ్చాడు: "ఇందులో తాను ఫలానా వంశంలో పుట్టానని గర్వించదగినదేమీ లేదు. కొయ్య కాల్చి నిప్పు చెయ్యవచ్చు. గడ్డిగాల్చి నిప్పుచేయవచ్చు. పేడకాల్చి నిప్పుచేయవచ్చు. ఏ వస్తువును ఉపయోగించి కాల్చితే నిప్పును ఆ వస్తువు పేరుతో పిలిచినట్లు బ్రాహ్మణులుగానీ, క్షత్రియులుగానీ, వైశ్యులుగానీ, శూద్రులుగానీ అవి వారు పుట్టిన వంశంద్వారా వచ్చే పేర్లుమాత్రమే. అంతమాత్రాన్నే వాటిద్వారా వ్యక్తియొక్క ఔన్నత్యాన్ని నిర్ణయించేందుకు వీలుగాదు.

"ఒకడు పుట్టిన వంశాన్నిబట్టి మంచివాడుగాని లేక చెడ్డవాడుగాని కాజాలడు. పుట్టుకనుబట్టి ఔన్నత్యాన్ని నిర్ణయించలేము. ఉన్నత కులంలో పుట్టినవాడు హంతకుడు కావచ్చు, దొంగకావచ్చు, వంచకుడు కావచ్చు, అబద్ధాలాడువాడు కావచ్చు, వదరుబోతు, ఆశబోతు కావచ్చు. దురభిప్రాయాలు గలవాడు కావచ్చు. అందుచేత ఉన్నత వంశంలో పుట్టినంత మాత్రాన్నే ఉత్తము డనుకోజాలం. ఉన్నత కులంలో పుట్టినవాడిలో పై చెడు లక్షణాలేవీ వుండకపోవచ్చు. ఆ కారణంగా పరంపరాను గతంగా వ్యక్తి స్థాయిని నిర్ణయించి మంచివాడని గాని లేక చెడ్డవాడనిగాని చెప్పజాలము."

ఏ కులంవారు ఆ కులానికై నిర్దేశింపబడిన వృత్తినే చేయాలన్నది బ్రాహ్మణుడైన విశ్వకారి మూడవ ప్రశ్న.

తాను భగవానున్ని ఇలా ప్రశ్నించాడు: "బ్రాహ్మణులు యాచనద్వారా, క్షత్రియులు ఆయుధాలద్వారా, వైశ్యులు పశుపోషణ మరియు వ్యాపారంద్వారా, శూద్రులు ధాన్యాన్ని మోయటంద్వారా, ఇలా ఏ కులంవారు ఆ కులవృత్తినే చేపట్టాలనీ, ఒక కులంవారు మరో కులంవారి వృత్తిని చేయరాదని ప్రధాన వృత్తి విధానం. ఈ విషయమై గౌరవనీయులైన గౌతములవారి అభిప్రాయమేమిటి?

అయితే ఈ వృత్తి నిర్ణయవిధానం యావత్ ప్రపంచంలోనూ అమలులో వున్నదా?" అని బుద్ధుడు ఎదురు ప్రశ్న వేయగా.

"లేద"ని విశ్వకారి జవాబిచ్చాడు.

"ఉన్నతమైన ఆదర్శాలు ముఖ్యం, అంతేకాని ఉన్నత వంశంలో పుట్టుకకాదు" అని భగవానుడు చెప్పాడు.

"కులం వద్దు. అసమానత వద్దు. ఉచ్ఛనీచాలుండరాదు. మానవులందరూ సమానమే.

"నేనెంతో నీవూ అంతేనన్న ధోరణిలో నీవు నీ పొరుగువారితో కలసిపోవాలి." అని బుద్ధుడు చెప్పాడు.

• • • •

**పుట్టుకనుబట్టిగాక వ్యక్తి విశిష్టతనుబట్టే విలువను నిర్ణయించాలని బోధించు ధర్మమే సద్ధర్మము :**

బ్రాహ్మణులు బోధించే చాతుర్వర్ణ సిద్ధాంతాలలో పుట్టుకకే ప్రాధాన్యత యివ్వబడింది.

బ్రాహ్మణ దంపతులకు పుట్టాడు కనుక తాను బ్రాహ్మణుడు. ఒకడు క్షత్రియుడిగ గుర్తింపబడడానికి కారణం తన తల్లిదండ్రులు క్షత్రియులు కావడమే. తల్లిదండ్రులు వైశ్యులైతే వారి సంతానం వైశ్యులే. ఒకని తల్లిదండ్రులు శూద్రులు కాబట్టి తానుకూడ శూద్రుడు.

బ్రాహ్మణులు నమ్మే ఈ సిద్ధాంతం ప్రకారం పుట్టుకకేగాని మరేదానికి ప్రాధాన్యత లేదు.

చాతుర్వర్ణ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినట్లే ఈ విధానాన్నిసైతం తీవ్రంగా వ్యతిరేకించాడు బుద్ధుడు.

బుద్ధుడు బోధించిన సిద్ధాంతం బ్రాహ్మణ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకితమైనది. ఒక వ్యక్తియొక్క స్థాయికి తన గుణమే కొలబద్దగాని, తన కులం కాదన్నది బుద్ధుని సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని బుద్ధుడు బోధించిన సన్నివేశం చాలా ఆసక్తికరమైనది.

ఒకప్పుడు బుద్ధుడు అనాథపిండకుని విహారంలో నివసిస్తుండేవాడు. ఒకనాడు బుద్ధుడు ఉదయాన్నే లేచి తన భిక్షాపాత్రతో భిక్షాటనకై శ్రావస్తి పట్టణంలోకి ప్రవేశించాడు.

భగవానుడు ఇంటింటికివెళ్ళి భిక్షాటనచేస్తూ అగ్నికుడను బ్రాహ్మణుని ఇంటివద్దకు వచ్చాడు. అప్పుడు యజ్ఞగుండంలో సమిధలువేసి మండిస్తూ ఆ యజ్ఞానికి కావలసిన యితర సామగ్రిని ప్రోగుచేయడం జరుగుతున్నది.

పావనచరితుడు యింటివైపు రావడం దూరాన్నుండే గమనించిన బ్రాహ్మణుడు ఆగ్రహించి "ఓ బోడిగుండు భిక్షకుడా! అక్కడే ఆగు. దౌర్భాగ్యుడా, కులహీనుడా, ముందుకు రాకు" అంటూ తిట్టసాగాడు.

ఆ మాటలువిన్న భగవానుడు "ఓ బ్రాహ్మణా! కులహీనుడు అనగా ఎవ్వరో నీవెరుగుదువా? ఒకడు ఏ పరిస్థితుల్లో కులహీనుడౌతాడో నీవెరుగుదువా?" అని ప్రశ్నించగా.

"ఓ గౌతమా! కులహీనుడనగా ఎవ్వరో నాకు తెలియదు. ఒకడు ఏ పరిస్థితుల్లో కులహీనుడౌతాడో కూడ వాస్తవంగా నాకు తెలియదు" అన్నాడు ఆ బ్రాహ్మణుడు.

అయితే కులహీనుడు అనగా ఎవ్వరో తెలుసుకొన్నందువలన ఆ బ్రాహ్మణుడు కోల్పోయేదేదీ వుండబోదని భగవానుడు చెప్పగా "అయితే తెలుసుకోవలసిందిగా నీవు చెప్తున్నావుగనక అదేదో వివరించమ"ని బ్రాహ్మణుడు చెప్పాడు.

తెలిసికొనేందుకై బ్రాహ్మణుడు సంసిద్ధత తెలియ బరచడంతో తథాగతుడు యిలా చెప్పాడు:

"ఎవ్వరైతే ఆగ్రహించి అసభ్యంగా ప్రవర్తిస్తారో, ఎవ్వరైతే దుర్బుద్ధితో సాటివారిని హీనంగా చూస్తారో, ఎవ్వరైతే తప్పుడు దృష్టికోణం కలిగి వుంటాడో అలాంటివాడే కులహీనుడు (వృషలుడు).

దయారహితుడై జీవులను (ఏకజ, ద్విజ ప్రాణులను) హింసిస్తే అలాంటివాడు కులహీనుడు.

"ఎవ్వడైతే యితరుల్ని బాధించి, వారి గ్రామాలను, వాడలను నాశనం చేస్తాడో వాడు కులహీనుడు.

గ్రామంలోగాని, వనప్రాంతంలోగాని ఎవడైతే దొంగతనానికి పాల్పడతాడో, తనకివ్వబడని దానిని గ్రహింపచూస్తాడో వాడు కులహీనుడు.

"ఎవ్వడైతే ఋణం తీసుకొని పారిపోతాడో, నా ఋణం చెల్లించమంటే నేను నీకు బాకీలేనని బుకాయిస్తాడో అలాంటివాడు కులహీనుడు.

"ఎవ్వడైతే స్వార్థబుద్ధితో దారినబోతున్నవాడిని దోచుకుంటాడో వాడు కులహీనుడు.

"ఎవ్వడైతే తన స్వార్థంకోసంగాని లేక యితరుల ప్రయోజనంకోసమైగాని లేక ధనాశతోగాని అబద్ధపు సాక్ష్యం చెబుతాడో వాడు కులహీనుడు.

"ఎవ్వడైతే ప్రేరణవలనగాని లేక అభీష్టం ప్రకారంగాని యితరుల, లేక హితుల సతులతో అక్రమసంబంధం పెంచుకుంటాడో అలాంటివాడు కులహీనుడు.

"ఎవ్వడైతే వార్థక్యంలో వున్న తన తల్లిదండ్రులను డబ్బు ఉండికూడ ఆదుకొనడో వాడు కులహీనుడు.

"హితవుగోరి వచ్చినవాడికి ఎవడైతే చెడు బోధన చేస్తాడో వాడు కులహీనుడు.

"పుట్టుకతో ఎవ్వడూ కులహీనుడు కాడు. పుట్టుకతో ఎవ్వడూ బ్రాహ్మణుడు కాడు."

ఆ మాటలు విన్న అగ్నికుడు తాను తొందరపాటుగా బుద్ధుణ్ణి దూషించినందుకు సిగ్గుతో తలవంచాడు.

మనిషికి మనిషికిమధ్య సమానత్వాన్ని బోధించు ధర్మమే సద్ధర్మము. ®

---

అనువాదం: కళాప్రపూర్ణ, డాక్టర్ యెండ్లూరి,
ఎడిటర్, ప్రజాబంధు
206, సూర్యసరోజ్ అపార్ట్‌మెంట్స్
సరూర్‌నగర్, హైదరాబాద్ - 35.

# పిటకేతర సాహిత్యం

- ఎమ్. రాజగోపాలరావు

పాళీసాహిత్య పరిణామాన్ని పరిశీలిస్తే త్రిపిటకాలు ఒకానొక కాలంలో సంగ్రహించిన మైలురాళ్లే కాని బుద్ధ వచనాన్ని ప్రప్రథమంగా సంగ్రహించిన ప్రయత్నంగా కనిపించదు. సుత్తపిటకంలోనే అంతకు ముందు జరిగిన బుద్ధవచన క్రోడీకరణ ప్రయత్నాలు ప్రస్తావనకు వస్తాయి. అటువంటి ప్రయత్నాలు రెండు అంతకుముందే జరిగాయని అర్థమవుతుంది. బుద్ధశాసనాన్ని (సాసనాన్ని – పాళీ భాషలో మెలిక'శ' ఉండదు) నవాంగాలుగా వర్గీకరించటం మొదటి ప్రయత్నం: సుత్తం, గేయ్యం, వెయ్యాకరణం, గాథా, ఉదానం, ఇతివుత్తకం, జాతకం, అబ్భుతధమ్మం, వేదల్లం. థేరబాణకులు ఆయావర్గాలను కంఠతాపట్టి అవసరమయి నప్పుడు వల్లెవేస్తుండేవారు. ఆ బాణకుల ద్వారానే బుద్ధశాసనం కొనసాగింది. అదెప్పుడు ప్రారంభమయిందో ఇదమిత్థంగా నిర్ధారించే అవకాశం కనిపించటం లేదు. ఆ నవాంగాలను పంచనికాయాలుగా (పచనేకాయిక) వర్గీకరించటం రెండోదశ. వీటిలో అత్యధిక భాగం ఇప్పుడు ఖుద్దకనికాయంలో అంతర్భాగాలుగా ఉన్నాయి. నవాంగా లలో కానీ పంచనికాయాలలో కానీ వినయ ప్రసక్తి కనిపించదు. బుద్ధుని మహాపరినిర్వాణం (మహాపరి నిబ్బానం) తరవాత అక్కడున్న వారితో వృద్ధభిక్షువు సుభద్ర



ఆచార్య ఆలార కాలామ

(బుద్ధుని అనుమతితో చివరిలో సంఘప్రవేశం పొందినవాడు) "శాస్తగతించాడు, ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు బుద్ధవచనాన్ని గ్రహించుకోవచ్చు" అని వ్యాఖ్యానించటంతో బుద్ధశాసనాల్ని వెంటనే సంగ్రహించటం ఉత్తమమని భావించిన థేరులలో 500 మంది (పంచసతి) రాజగృహలో సమావేశమయి ప్రథమ సంగీతిలో (పరమ సజ్గీతి) బుద్ధవచనాల సంగ్రహణం చేపట్టారు. దాని పేరే "పంచసతికా ధమ్మనవినయసజ్గీతి." దానిలో ధమ్మ సంగ్రహణకు ఆనంద, వినయ సంగ్రహణకు ఉపాలి సారథ్యం వహించారు. వారు ఆయా సుత్తాలను పెద్దగా వల్లెవేస్తుంటే వింటున్న థేరులు వాటికి సవరణలు ప్రతిపాదించటం అధిక సంఖ్యాకుల ఆమోదంతో వాటిని ప్రామాణికాలుగా నిర్ణయించటం 'సజ్గీతి' ప్రధాన లక్షణాలు. అది మూడు నెలలకుపైగా సాగింది. ఇక్కడ గమనించవలసిన అంశమేమంటే ధమ్మ సుత్తాల సంగ్రహణం, వినయ సుత్తాల సంగ్రహణం వేరువేరుగా జరగలేదు. అన్నిటినీ ధర్మవినయంగానే సంగ్రహించటం జరిగింది. అప్పటికి సుత్తాల ప్రస్తావనే కాని "సుత్తపిటక," "వినయపిటక" ప్రస్తావన లేదు. అందువల్ల వాటిలో ఏదిముందు అనే చర్చకు అవకాశం లేదు. ప్రస్తుత కాలంలో థేరుల ఆధిపత్యంలో సాగుతున్న ధర్మప్రచారంలో వినయపికటను మొదట, సుత్తపిటకను తరవాత, ఆ తరవాత అభిధమ్మపిటికను ప్రస్తావిస్తున్నారు, గ్రంథాలలో రాస్తున్నారు. పాతగ్రంథాలన్నిటిలో సుత్తపిటక, వినయ పిటక, అభిధమ్మపిటక అనే క్రమమేగోచరిస్తుంది. నిజానికి ప్రథమ సంగీతి జరిగిన కాలానికి పిటికమనే పదమేలేదు, సుత్త–వినయ విభాగమూ లేదు.

అటు తరువాత 100 సంవత్సరాలలో "బౌద్ధ సంఘం"లో గృహస్థుల స్థానం గురించిన చర్చసాగింది. బౌద్ధసంఘమంటే భిక్షు సంఘమని భావించిన సనాతన థేరులు (ఇప్పటికీ పాళీభాషా పండితులలో ఆ భావమే

కొనసాగుతున్నది) బౌద్ధ సంఘంలో గృహస్థుల స్థానాన్ని గుర్తించటానికి నిరాకరించటం, గృహస్థులు అందిస్తున్న చీవర, పిండపాత, సేనాసన, భేసజ్జాల ఆధారంగానే బుద్ధశాసనం అందరికీ అందించగలుగుతున్నామనే వాస్తవాన్ని గుర్తించిన ఉదారథేరులు-వజ్జపుత్తుల వంటివారు - సనాతనులకు భిన్నంగా గృహస్థులతో కలసి ప్రచారంలో సాగటం గమనించిన సనాతనులు వారిని "పాపభిక్షువుల"గా పరిగణిస్తూ బుద్ధవచనాన్ని పునః ప్రతిష్ఠించవలసిన అవసరమున్నదని భావించి వైశాలిలో 700 మంది థేరులతో ద్వితీయ సంగీతిని నిర్వహించారు. అది చాలాకాలం సాగింది. దానిలో సనాతన, ఉదారథేరుల మధ్య చాలా తీవ్రమయిన చర్చోపచర్చలు జరిగాయి. చివరికి ఉదారథేరులను బహిష్కరించి సనాతన థేరులే ధర్మాన్ని సంగ్రహించటం జరిగింది. ఉదారథేరులు గృహస్థులతో కలసి 1000 మంది వేరేచోట (స్పష్టత లేదు) మహాసఙ్గీతి జరుపుకొన్నారు. దానినుంచి మహాసంఘిక శాఖ ఏర్పడటం, అటు తరవాత మహాయానం అభివృద్ధి చెందటం వగయిరా పరిణామాలు సంభవించాయి. 700 మంది సనాతన థేరులు నిర్వహించిన సంగీతి "సత్తసతికా సఙ్గీతి"గా ప్రసిద్ధి చెందింది. దానిలో గూడ ధమ్మవినయ స్థిరీకరణమే జరిగింది. అందుకే బుద్ధఘోష అదిగూడా 'ధమ్మవినయ సఙ్గీతే'నన్నాడు.

ఇట్లా సంగ్రహించిన ధమ్మవినయంలో గృహస్థులకు చెందిన సుత్తాలు, భిక్షువులకు చెందిన సుత్తాలు-రెండూ ఉన్నాయి. అప్పటికి ధమ్మంవేరు, వినయంవేరు - ధమ్మమంటే సుత్తపిటకం, వినయమంటే వినయపిటకంగా పరిగణించిన పరిస్థితి కనిపించదు.

పాళీ సాహిత్యంలో అత్యంత పురాతన గ్రంథంగా పండితలోకమంగీకరిస్తున్న *సుత్తనిపాత* లో రెండూ కనిపిస్తాయి. దానిలోని 7 సుత్తాలు అశోకుని శిలా శాసనాలలో స్థానం పొందాయి. అవి భిక్షువులకు చెందిన ఉపదేశాలా, గృహస్థులకు చెందిన ఉపదేశాలా తేల్చలేక ఇప్పటికీ చర్చోప చర్చలు సాగుతున్నాయి. అవి బౌద్ధ సుత్తాలే కాదు అని తీర్మానించిన పండితులు గూడా ఉన్నారు. అవి అందరికీ చెందినవి కావటమే దీనికి కారణం. పిటకాలలో వందలాది సందర్భాలలో "ధమ్మవినయ" ప్రస్తావన వస్తుంది. బుద్ధుడు అనేక సందర్భాలలో తాను భిక్షువులకు, భిక్షుణిలకు, ఉపాసకులకు, శ్రమణ బ్రాహ్మణులకే కాక "పుథుజ్జను"లకు గూడా సర్వహితం కోసం, సర్వసుఖం కోసం, సర్వలోక కల్యాణం కోసం ఉపదేశిస్తున్నానని వివరించాడు. అది విన్నవారందరూ శ్రావకులే. (సావకులే) అందుకే బుద్ధుడు నా శ్రావకులలో అన్ని రకాలవారున్నారు అన్నాడు. వారిలో భిక్షు, భిక్షుణిలుగూడా భాగమే. ఆ విధంగా బుద్ధశాసనంలో మౌలికంగా భిక్షు, ఉపాసక విభజనలేదని స్పష్టమవుతుంది. భిక్షువులకు సంబంధించిన ప్రత్యేక శిక్షణ (సిక్ఖాపదాని), వాటిని అతిక్రమిస్తే భిక్షు సంఘం విధించే శిక్షలు వగయిరాల వివరాలు సుత్తపిటకలోనే స్థానం పొందటం దానికి తార్కాణం.

సుత్తపిటకం, అంగుత్తరనికాయం, తికనిపాతం 'సమణవగ్గ'లో బుద్ధుడు భిక్షువులకు అధిశీల (అధిసీల), అధిచిత్త, అధిపఞ్ఞా (ప్రజ్ఞా) శిక్షణకు విధించిన 150 శిక్షణాపదాలు (సిక్ఖాపదాని) నిర్దేశించాడని వజ్జిపుత్తసుత్తం పఠమ, దుతియ, తతియ 'సిక్ఖావద సుత్తాలు' పేర్కొంటున్నాయి. వాటిని అతిక్రమిస్తే థేరసంఘం విధించే శిక్షలు, ప్రత్యేక నియమాలు అంగుత్తరనికాయం, దుకనిపాతం, "వినయపెయ్యాల" అందిస్తున్నది. భిక్షువుల వర్షావాసాలు మూడు/నాలుగు నెలలు (రెండిటి ప్రస్తావన వినయ పిటకంలో కనిపిస్తుంది) ముగిసేరోజున జరుపుకొనే "పవారణ" కార్యక్రమ నేపథ్యంలో వీటిని అందించటంవల్ల అప్పటికే భిక్షు సంఘాలు విస్తరించాయని, పవారణ కార్యక్రమాలు నిర్వహించేవని స్పష్టమవుతుంది. వర్షాలు పడే కాలంలో భిక్షువులు సంచరిస్తూ జీవమూలాలను, మొలకలెత్తే మొక్కలను (భూతగామ, బీజగామ) కాళ్లతో



ఉద్ధక రామపుత్ర

తొక్కి హానిచేస్తారనే ఉద్దేశంతో బుద్ధుడు భిక్షువులకు వర్షావాసం (వస్సావాస) విధించాడు. తానూ స్వయంగా దానిని అనుసరించాడు. ఆ సమయంలో ఒక ప్రాంతంలో ఉండే భిక్షువులు ఒక అనుకూలమయిన ప్రదేశం ఎంచుకొని అక్కడి ప్రజల ఆదరణతో స్థిరంగా ఒకచోట నివసిస్తారు. ఆ కాలంలో ధమ్మవినయం పునశ్చరణ చేసుకొంటారు. చివరి రోజున తాము చేసిన తప్పులను నిజాయతీగా సంఘానికి నివేదిస్తారు. నియమాలను అతిక్రమిస్తూ గూడా వాటిని దాచుకోవటానికి ప్రయత్నించేవారి ప్రయత్నాలను ఇతర భిక్షువులు సంఘ సమావేశంలో ప్రస్తావిస్తారు. కొందరు తప్పు ఒప్పుకొంటారు. కొందరు ఒప్పుకోరు. అప్పుడు ముఖాముఖి వారిని ప్రశ్నించి నిజాన్ని నిగ్గుతేల్చి అవసరమయిన శిక్షలు సంఘం విధిస్తుంది. ఇదంతా జరిగే వర్షావాస చివరిరోజు "పవారణ"కు భిక్షు సంఘంలో ఎంతో ప్రత్యేకత ఉంది. వారు తీర్మానించే శిక్షల వివరాలు సుత్తపిటకలో ఉండటం ఆనాటి ధమ్మవినయ సంగ్రహణ పరిస్థితికి అద్దంబడుతుంది. ఆ తరువాత మహావగ్గ, చుల్లవగ్గలలో చోటుజేసుకొన్న బుద్ధుని ఆధ్యాత్మిక పురోగమనం, సంఘ నిర్మాణం, సమయ సందర్భాలను బట్టి నియమాలను నిర్దేశించటం వగయిరాలను సంఘటించి, మహావగ్గ, చుల్లవగ్గలను వినయ పిటకలో ప్రథమ, ద్వితీయ గ్రంథాలు గావించి భిక్షు, భిక్షుణీ నియమాలను (ఖందకాలు) జోడించి "వినయపిటకం" అభివృద్ధి చేశారని అర్థమవుతంది.

వినయపెయ్యాలమందించిన 23 భిక్షుసంఘ తీర్మానాలివి: 1) పాటిమొక్ఖుద్దేస - ప్రాతిమోక్ష పునశ్చరణ పాటిమొక్ఖపఠనం-అవసరమయితే ఆ కార్యక్రమం రద్దు



దుష్కర తపశ్చర్య

చేయుటం 2) పవారణ - వర్షావాసం ఆఖరిరోజు, భిక్షుసంఘం జరుపుకొనే కార్యక్రమం 3) ఠపనీయకమ్మ - దానిని రద్దుచేయటం 4) తజ్జనీయకమ్మ - సంఘ మందలింపు కార్యక్రమం 5) నిస్సయకమ్మ - మరో థేరుని వద్ద శిక్షణ పొందమనటం 6) పబ్బాజనీయకమ్మ - కొంత కాలం తొలగించటం 7) పటిసారణియకమ్మ - మళ్ళీ సర్దుబాటు చేయటం 8) ఉక్ఖేపనియకమ్మ - మోఘ భిక్షువును తాత్కాలికంగా సంఘం నుంచి బహిష్కరించటం 9) పరీవాసదాన-మరొకరి నిర్దేశంలో మసలుకోవటం 10) మూలాయ పటికస్సనం-పరీవాసం తొలగించటం 11) మానత్తదానం-పెనాల్టీ వేయటం 12) అబ్భాసవాసకనియం - దానిని తొలగించటం 13) వొస్సారనియం - భిక్షువును సంఘం నుంచి వెలివేయటం 14) వొస్సారనియ కమ్మ - భిక్షువును మళ్లీ సంఘంలోకి అనుమతించటం 15) ఉప సంపదా కమ్మ - భిక్షు దీక్షనిచ్చే కార్యక్రమం 16) ఇత్తి - తీర్మానం వోటింగుకు నిర్ణయం 17) సమ్ముఖావినయో - ఇద్దరు భిక్షువుల మధ్య తలెత్తిన వివాదాన్ని వారిద్దరి ఎదుటనే ప్రశ్నించటం 18) సతివినయ - స్మృతి విధాన నిర్దేశం 19) అమూఢ వినయం - మతిభ్రమించిన భిక్షువును పరీక్షించి సంఘంలో చేర్చుకోవటం 20) పటిఞ్ఞాతకరణం - భిక్షువు నేరాంగీకారం గురించిన నిర్ణయం 21) యేభుయ్యసికా - అధిక సంఖ్యాక భిక్షువులను బట్టి నిర్ణయించు కోవటం 22) తస్సపాపియ్యసికా - దోషవర్గ అభిశంసన తీర్మానం 23) తిణవత్థారకా - ఒక విషయం మీద అంతిమ నిర్ణయం.

ఇదీ వాటి సంక్షిప్తరూపం. వాటి సమగ్ర వివరణ వినయ పిటకలో ఉంది. తీరికా ఓపికాలేని వారు నా "గౌతమబుద్ధుని సాంఘిక విప్లవం"లో పరిశీలించవచ్చు. భిక్షు సంఘ అభివృద్ధికీ, పరిరక్షణకూ నిర్దేశించిన ఈ నియమాలు సుత్తపిటకంలోనే ఉండటం విశేషం. ఇక్కడ ప్రస్తావించిన 150 నియమాలను మరింతగా విస్తరించి 227కి పెంచి పాటిమొక్ఖ నియమాలుగా వినయపిటకంలో జోడించారు. ఆ తరువాత భిక్షుణిల పాటిమొక్ఖను 260కి పైగా పెంచి జోడించారు. ఈ పాటిమొక్ఖ నియమాలన్నీ భిక్షుసంఘంలో నివసించే వారికీ, వారు సామాన్య జనుల సంఘంతో సత్సంబంధాలు ఏర్పరచుకొని వారి ఆదరం పొందటానికీ పరిమితమవుతాయి. భిక్షు సంఘమే బౌద్ధ

సంఘమనటం అసంబంద్ధం. భిక్షు, భిక్షుణి, ఉపాసక, ఉపాసికల చతుర్విధ సంఘం బౌద్ధ సంఘం. ఆ విధంగా వినయపిటకంలో మహావగ్గను, చుల్లవగ్గను, నియమాల విస్తరణ, స్థానం పొందటం దానిని తరవాతి కాలపు నిర్మాణంగా నిరూపిస్తుంది. పూర్వపు పంచనికాయాలు దీఘ, మజ్ఝిమ, సంయుత్త, అంగుత్తర, ఖుద్దకనికాయాలు సుత్తపిటకంలో స్థానం పొందాయి.

అయితే వాటి కలయికతో సుత్తపిటకం ఎప్పుడు తయారయిందో మహావగ్గ, చుల్లవగ్గ, భిక్షునియమాల సంకలనంగా వినయపిటకమెప్పుడు తయారయిందో ఇదమిత్థంగా నిర్ణయించటం కష్టం. అంతకంటె ప్రధాన అంశమేమిటంటే అశోకుని కాలంలో జరిగిందంటున్న తృతీయ సంగీతి (తతియ సజ్గీతి) ప్రస్తావన, అభిధమ్మ పిటక నిర్మాణ సమాచారం గానీ భారతీయ సాహిత్యంలో కనిపించదు. ఆ సమాచారం క్రీ.శ. నాలుగో శతాబ్దంలో శ్రీలంకలో తయారయిన "దీపవంస"లో, దానిని సమగ్రంగా స్పష్టంగా తీర్చిదిద్దిన ఆరో శతాబ్ది "మహావంస"లో కనిపిస్తుంది. దాని ద్వారానే అశోకుని చారిత్రకత, 'తతియసజ్గీతి' వివరాలు, అభిధమ్మపిటక సంకలన తీరుతెన్నులు మనకు లభిస్తున్నాయి.

అప్పటి వరకూ భాణకుల ద్వారా మౌఖికంగా కొనసాగుతున్న బుద్ధవచనం - బుద్ధ శాసనం - క్రీ.పూ. మూడో శతాబ్దంలో మహేంద్ర (మహింద), సంఘమిత్ర (సంఘమిత్త)లతో పాటు భాణకుల ద్వారా శ్రీలంక చేరింది. బుద్ధుని మహాపరి నిర్వాణం తరువాత 433 సంవత్సరాలకు 12 సంవత్సరాలు లంకాద్వీపాన్ని పాలించిన వట్టగామణి అభయ కాలంలో - దాదాపుగా క్రీ.పూ. 50-39 సంవత్సరాల మధ్య (కొందరు 80వ సంవత్సరం అన్నారు) దమ్మాల తైలంతో సంస్కరించిన 'ఓళ' పత్రాల మీద గంటాలతో ఆనాటి భాష "ఎలు"లో ప్రప్రథమంగా ధమ్మవినయాన్ని గ్రంథస్థంజేశారు. దానిని పంచమ సంగీతి అంటూ ఆ సంగ్రహణను ధమ్మవినయ సంగ్రహణమన్నది 'సద్ధమ్మసజ్గహ' - అంటే అప్పటికి గూడా పిటకాల విభజన లేదని అర్థమవుతుంది. జంబూద్వీపం నుండి లంకాద్వీపం జేరిన బుద్ధవచనాన్ని "మూల భాషంటూ" దానిమీద వారు వ్యాఖ్యానాలు - అట్ఠకథలు - తయారుజేసుకొన్నారు. ఆ విధంగా లంకాద్వీపంలో తయారయిన మూలభాషా పత్రాల కట్టలు, అట్ఠకథల పత్రాల కట్టలు జాగ్రత్తగా భద్రపరచుకొన్నారు. ఈ పరిస్థితి క్రీ.శ. అయిదో శతాబ్దం వరకు కొనసాగింది.

ఆ లోపల భారతదేశంలో అనేక భాషలలో బుద్ధవచనం కొనసాగటంతోపాటు చీనీ భాషలో గూడ విస్తరించింది. అందుకే బుద్ధఘోష బుద్ధవచనం సంస్కృతం లోనే కాక పైశాచీ అపభ్రంశలలో గూడా ఉన్నదన్నాడు. ఈనాడు మనకు అందుబాటులో ఉన్న సమాచారాన్ని బట్టి ఆనాటి 18 బౌద్ధశాఖలవారూ పిటకాలను అభివృద్ధి చేసుకొన్నట్లు అర్థమవుతున్నది. అయితే మహాసంఘిక, మహాయాన విజృంభణంతో మిశ్రమ సంస్కృత, సంస్కృత సూత్రాలకు ఆదరణ పెరిగింది. థేరవాదులు పరమ పవిత్రంగా పరిగణించే భాషలో బుద్ధవచనం-అలభ్యమయిపోయింది. అది లంకాద్వీపంలో సురక్షితంగా ఉందని థేరుల రాకపోకలవల్ల గ్రహించుకొని ఇక్కడ థేరులు - ముఖ్యంగా దక్షిణాది కాంచీపుర విహారంలో నివసిస్తున్నవారు - దానిని పునరుద్ధరించుకొనే ప్రయత్నంలో పడ్డారు. వారిలో సుప్రసిద్ధులయిన థేరులు - బుద్ధదత్త, బుద్ధఘోషల చరిత్రలు మనకు అందుబాటు లోకి వచ్చాయి. వారిద్దరిలో బుద్ధవచన పునరుద్ధరణలో బుద్ధఘోషునిది అగ్రస్థానం.

బుద్ధఘోష కాంచీపురం నుంచి క్రీ.శ. అయిదో శతాబ్దంలో - 420 ప్రాంతంలో - లంకా ద్వీపం చేరాడు. అక్కడ వారి 'ఎలు' భాషలో సమగ్రంగా సంరక్షించిన ఓళ పత్రాల కట్టలను చూశాడు. వారి భాషమీద సాధికారం సంపాదించి వాటి పునరుద్ధరణకు పూనుకొన్నాడు. వారు గంపలలో, పెట్టెలలో భద్రపరచిన బుద్ధవచనాన్ని



సుజాత పాయసాన్ని భక్తితో సమర్పించుట

'పిటక'మన్నాడు. వారు గ్రహించిన 'మూలభాషను' 'పాళీ' అన్నాడు. ఓళ పత్రాలమీద వరసలు వరసలుగా చక్కగా తీర్చిదిద్దిన లేఖనలే పాళీ. ఒక క్రమం, వరస అనే అర్థంలో బుద్ధఘోష అట్ఠకథలలో ఆ పదాన్ని అనేకసార్లు ప్రయోగించాడు.

సంస్కృత భాషా ప్రభావంతో బుద్ధవచనాన్ని విశ్లేషించి వివరించటానికి ప్రయత్నించినవారు 'పాళీ' పదాన్ని 'పా' అనే సంస్కృత ధాతువు నుంచి పాళీపదం వచ్చినట్లు వివరించటం ప్రారంభించారు. 'పా' అంటే రక్షణ కనక బుద్ధవచన అర్థాన్ని రక్షించేది పాళీ 'సద్దత్థంపాలేతీతి' అని అర్థం చెప్పారు. అంతేకాదు బాగా అర్థం అందించేది - అత్థకుసలో, ధర్మం బాగా అందించేది, - ధమ్మకుసలో, స్పష్టమయినది - నిరుత్తికుసలో ఉపదేశానికి అనుకూలించేది - దేవననాకుసలో అన్నిటికంటే అందమయినది - అతిసుందరం వగయిరా పదాలతో వర్ణించారు. బుద్ధఘోష ఆ పదం వినియోగించిన అర్థంలో - ఒక క్రమం, వరస అనే అర్థంలో - తెలుగులో చాలాపదాలు తటస్థపడతాయి - కలంపాళి, పంచపాళి, వైకుంఠపాళి, కర్ణపాళి, ఖడ్గపాళి, ఆమ్రపాళి వంటి అనేక పదాలు తటస్థపడతాయి.

ఈ విధంగా పరిశీలించినప్పుడు బుద్ధవచనం అనేక భాషలలో భాణకుల ద్వారా అన్ని శతాబ్దాలపాటు కొనసాగినా "పిటక", "పాళీ" పదాలు బుద్ధఘోషుని కాలం వరకు అభివృద్ధి చెందలేదేమోననిపిస్తుంది.

అందువల్ల ప్రథమ సంగీతిలో సుత్తపిటకను సంగ్రహించటం జరిగిందనీ, ద్వితీయ సంగీతిలో వినయ పిటకను సంగ్రహించటం జరిగిందనీ, తృతీయ సంగీతిలో



మారసేన పరాజయం

అభిధమ్మ పిటకను సంగ్రహించటం జరిగిందనే వివరణ సామాన్యులు అర్థంజేసుకోవటానికి ఉపకరిస్తుంది కాని సమర్థనీయంగా కనిపించదు. అవన్నీ సుదీర్ఘకాలం భాణకుల ద్వారానే కొనసాగాయి. వాటిని మౌఖికంగానే - మానసికంగానే - సంగ్రహించటం జరిగింది. ఆనాటి భాణకుల వర్గాలను "మిళింద పఞ్హా", బుద్ధఘోష, కొంత వరకు అందించారు. దీఘభాణక, మజ్ఝిమ, భాణక, సంయుక్త భాణక, అంగుత్తర భాణక, ఖుద్దక భాణక, జాతక భాణకులు అదర్శవంతమయిన "ధమ్మనగర" పౌరులలో ఉన్నారన్నది మిళిందపఞ్హా." బుద్ధఘోషుని "అత్థసాలినీ" - దమ్మసఙ్గణి అట్ఠకథ - ధమ్మపద భాణకులకు ప్రస్తావిస్తున్నది. భారహుత్, సాంచీ బౌద్ధ ఉపాసకుల శాసనాల్లో భాణకులను ఎంతో భక్తి పూర్వకంగా ప్రస్తావించటం కనిపిస్తుంది. ఇదంతా బుద్ధవచనాలు పిటకాల రూపం పొందటానికి పూర్వ పరిస్థితినందిస్తుంది.

శ్రీలంక "దీపవంస", "మహావంస"లు లేకపోతే ఒక్క అభిధమ్మపిటక వ్యవహారమే కాదు అశోకుని చరిత్ర అందుబాటులోకి వచ్చేది కాదు. "మిళిందపఞ్హా" లేకపోతే భాణకుల సమాచారం సాధికారికంగా లభించేది కాదు. "మహానిద్దేస అట్ఠకథ" నవంగాలు, పంచనికాయాలు సుత్తపిటకలో లీనమయ్యాయనే సమాచారం అందించకపోతే అది నిర్ధారించే పరిస్థితి ఏర్పడేది కాదు. బుద్ధదత్త బుద్ధఘోషలు చారిత్రకమయిన కృషిచేసి పాళీ సాహిత్యాన్ని పునరుద్ధరించక పోతే మనకది అందని చందమామలా ఉండిపోయేది. బుద్ధఘోష 'కథావత్థు అట్ఠకథ' లేకపోతే బౌద్ధ ధర్మంలో ఆంధ్రుల కృషి - విశేషించి అంధకశాఖల పరిజ్ఞానం లభించేది కాదు. ఈ విధంగా పిటకేతర పాళీ సాహిత్యం బుద్ధుని ధర్మ అవగాహనకు, చారిత్రక పరిస్థితి వివరణకు ఎంతగానో ఉపకరిస్తుంది. దానిలో ఒక్క మిళిందపఞ్హానే శ్రీలంక, థాయిలాండ్ దేశాలు ఖుద్దక నికాయంలో అంతర్భాగంగా గ్రహిస్తున్నాయి. ఇవేకాదు మరెన్నో పాళీ గ్రంథాలు బుద్ధుని ధర్మాన్ని సంక్షిప్తంగా వివరించేవి, మరింత వివరంగా అందిచేవి, అర్థంగాని పదాలను విశ్లేషించి, వ్యాఖ్యానించి, నిర్వచించేవి ఉన్నాయి. ఉదాహరణకు "తథాగత" అంటే స్పష్టమయిన వివరణలేదని భారత పాశ్చాత్య విద్వాంసులందరూ తీర్మానించారు. దానిని తథ + ఆగతగా విడదీసి "అక్కడికి చేరిన వాడు" అని చెప్ప గలిగారే కాని ఎక్కడికి చేరాడో ఇతమిత్థంగా

నిర్ణయించలేక పోయారు. నిజానికి తథ + ఆగత అనే విశ్లేషణ గూడా ప్రప్రథమంగా అందించిన వాడు బుద్ధఘోషుడే. అంతేకాదు దీఘనికాయ అట్ఠకథ "సుమంగళవిలాసినీ'లో దానికి ఎనిమిది హేతువులు లేదా నిర్వచనాలు ఇచ్చాడు. నికాయాలలో లభించే కొద్ది నిర్వచనాలకవి పరిపూరకాలవుతున్నాయి. ఇటువంటి ప్రయోజనాలెన్నో పిటకేతర పాళీ సాహిత్యం ద్వారా లభిస్తున్నాయి. నాకు తెలిసినంతలో వాటిలో మిళిందపఞ్హా, కథావత్థు అట్ఠకథ, అత్థసాలినీ వంటి వాటికి తప్ప మిగతా వాటికి ఆంగ్లానువాదాలు గూడా రాలేదు. వాటిని గ్రహించుకోవటానికి తగిన కృషి చేయవలసి ఉంది.

బుద్ధుని వచనాలు ఒక్క పాళీ పిటకాలలోనే కాదు మిశ్రమ సంస్కృతం, చీనీ, తిబ్బతి భాషలలో గూడా ఉన్నాయి. మనకందుతున్న సమాచారాన్ని బట్టి ప్రతి ప్రధాన బౌద్ధశాఖకూ పిటకాలున్నాయి. బుద్ధుడిచ్చిన స్వేచ్ఛతో బుద్ధవచనాలు అనేక భాషలలో అభివ్యక్తమయాయి. సంస్కృతంతోపాటు పైశాచీ, అపభ్రంశలలో గూడా ఉదేశాలు నమోదయ్యాయన్నాడు బుద్ధఘోష. ఒక్క పాళీభాషే బుద్ధవచనాన్ని సంరక్షిస్తున్నదనటం సమంజసంగా కనిపించదు. అన్ని రకాల సాహిత్యాలూ బుద్ధహృదయాన్ని ఆవిష్కరించే ప్రయత్నాలు చేశాయని పండితు లంగీకరిస్తున్నారు. అన్నిటిలోనూ అదే మౌలిక ధర్మం అభివ్యక్తమవుతుందని వివరిస్తున్నారు. అయితే అన్నిటికంటే మొదట బుద్ధవచనాన్ని సమగ్రంగా అందించిన విశిష్టత పాళీసాహిత్యానిదేనని అంగీకరించవలసిందే. ఆ మౌలిక ధర్మాన్ని అందించిన బుద్ధుని భాషేమిటి అనే సమస్య తలెత్తుతుంది.

బుద్ధుని భాష పాళీ అనటానికి ఆస్కారమే కనిపించదు. బుద్ధుడు శాక్యజనపదంలో జన్మించాడు. అది అచిరకాలం లోనే కోసల రాష్ట్రంలో లీనమయిపోయింది. కోసలగూడా తరవాత మగధరాజ్యంలో లీనమయిపోయింది. అందువల్ల బుద్ధుని ఉపదేశాలు మాగధి లేక అర్ధమాగదిలో సాగాయంటున్నారు. దానినంగీకరించినా మాగధి పాళీ కాదు. భాషను గురించిన చర్చ బుద్ధుని జీవితకాలంలోనే తలెత్తింది. ఇద్దరు భిక్షువులు బుద్ధుని సమీపించి భగవాన్, బుద్ధవచనాన్ని వైదిక ఛందస్సులో పరివర్తింపజేస్తే దానిని పరిరక్షించుకోవచ్చు, అనేక విధాలుగా అర్థంచేసుకోవటాన్ని నివారించవచ్చు గదా అన్నారనీ దానికి బుద్ధుడు "నభిక్ఖవే బుద్ధవచనం ఛందసో ఆరోపేతబ్బం, యో ఆరోపెయ్య ఆపత్తి దుక్కటస్స, అనుజానామి భిక్ఖవే సకాయనిరుత్తియా బుద్ధ వచనం పరియాపుణితుంతి" అని నిర్దేశించాడని వినయపిటక, చుల్లవగ్గ సాక్ష్యం చెబుతున్నది. (బుద్ధ వచనాన్ని ఛందసాలోకి అనువదించగూడదు. అట్లాచేయటం తీవ్రనేరం. బుద్ధ వచనాన్ని సకాయనిరుత్తిలో అందించటానికి అనుమతిస్తున్నాను). సకాయనిరుత్తి – స్వీయభాష అంటే బుద్ధుని భాషా, ఉపదేశించే థేరుల భాషా, ప్రజల భాషా అనే సమస్య తలెత్తింది. ఛందసా అంటే వైదిక భాష అని బుద్ధఘోష స్పష్టంజేశాడు–"వేదంవియ సంస్కృతభాసాయ వచనామగ్గం." "ఎత్థ సకాయనిరుత్తింనామ జనపద నిరుత్తిం నాభినివేసేయ్య" అని మజ్ఝిమ నికాయ, అరణవిభంగసుత్త వివరించింది. దానిని ప్రజల భాషగా భావించగూడదు అని గూడా అంటూ సకాయ నిరుత్తి అంటే జనపదనిరుత్తి – జానపదుల భాష కాదు అంటూ దానికి కారణాలు గూడా వివరిస్తున్నది. ప్రజలు అనేక ప్రాంతాలలో అనేక భాషలను ఉపయోగిస్తుంటారు. ఒక్కొక్క భాషలో పదాలు ఒక్కొక అర్థాన్ని ఇస్తుంటాయి. ఎవరికి వారు మాదే నిర్దుష్టమయిన భాషగా ఇతరులది తప్పు (ఇధమేవసచ్చం, మోఘమఞ్ఞంతి) అంటుంటారు. అందువల్ల దానిని ఉపదేశ భాషగా గ్రహించగూడదు. అంటే థేరుల ఉపదేశాలు ప్రజల భాషలో సాగలేదని స్పష్టమవుతుంది (సాగాయని చాలామంది రాశారు). అప్పుడు థేరులు వారి స్వభాషలో అంటే పాళీ భాష అంటున్నదానిలో ఉపదేశించారనటం సమంజసంగా కనిపిస్తుంది. అయితే అది ప్రజల భాషల – ప్రాకృత భాషల ద్వారా లభించింది కాదు. అయితే ఈ కృతక పాళీ భాష ఎక్కడ నుంచి ఊడిపడింది? అది థేరుల భాషగా –



నమ్మక్ సంబోధి

స్వభాషగా ఎలా స్థిరపడిపోయింది? అనే సమస్య ఎదురవుతుంది.

దీనికి తగిన సమాధానం పిటకాలలో కాని పిటకేతర గ్రంథాలలో గాని కనిపించదు. దానిని గురించి చర్చించిన ఆధునిక పాళీభాషా పండితులు ఒక మార్గాంతరం సూచిస్తున్నారు. బుద్ధుడు గ్రామ, నిగమ, పట్టణాలలో పర్యటించనప్పుడు ఇతర ప్రదేశాలలో వర్షావాసం చేయనప్పుడు శ్రావస్తిలో (సావత్థి) అనాథ పిండక నిర్మించి ఇచ్చిన జేతవనారామంలోనే నివసించేవాడు. అక్కడ భిక్షుణిల కోసం విశాఖ నిర్మించిన పుబ్బారామ (తూర్పున ఉండే ఆరామం) గూడా ఉండేది. అవి చాలా విశాలంగా ఉండి అనేకమంది భిక్షు, భిక్షుణిల నివాసాలకు అనుకూలంగా ఉండేవి. బుద్ధుని ముఖతః ధమ్మం వినాలని ఆశించే థేరులు, తమలో తలెత్తిన సందేహాలను నివారించుకోగోరే థేరులు శ్రావస్తి చేరుతుండేవారు. అనేక ప్రాంతాలనించి వచ్చే ఆ థేరులలో అనేక భాషల వారుండేవారు. వారి దైనందిన వ్యవహారాల్లో, చర్చల్లో స్థానిక మాగధితో కలిసిపోయిన అనేక పదాల సముదాయంగా ఒక కొత్త భాష అభివృద్ధి చెందింది. దానినే పాళీ భాష అంటున్నాం. ఆ విధంగా పాళీ సర్వభాషా సంకలనంగా తయారయిన భాష. బ్రిటీష్ పాలనా కాలంలో ఢిల్లీ చుట్టుప్రక్కల ఉండే సైనిక గుడారాలలో నివసించిన వారి అనేక భాషలు అరబ్బీ భాషతో కలసిపోయి, ఉర్దూ భాష తయారయిన విధానం ఆ అవగాహనకు ప్రేరణ. అదే సమంజసమని చాలామంది అంగీకరిస్తున్నారు. అందువల్లనే పాళీభాషలో అనేక భాషావదాలు చోటుజేసుకొన్నాయి. ఎవరికి వారు తమ ప్రాంత భాషే దాని మూలమంటున్నారు. హెచ్. కెరన్ పాళీభాషకు ఆంధ్ర, కళింగ (గోదావరి ఆవతలి గట్టునుంచి కోస్తా వరకు) కేంద్రమన్నాడు. దానిలో దక్షిణాది భాషాపదాలనేకమున్నాయి. చాలా తెలుగు పదాలుండటంతో ధర్మానంద కోశాంబి పాళీ భాషకిదే ప్రధాన కేంద్రమని భావించి "విసుద్ధిమగ్గ"లో అనేక తెలుగుపదాలు కనిపించటంవల్ల, బుద్ధఘోష "మొరండ ఖేతకవ వతభ్బేన్" అనటం వల్ల బుద్ధఘోషుడు ఆంధ్రుడు కావచ్చునని, పాళీభాషకు ఆంధ్ర, కళింగ దేశాలు మూలంగావచ్చుననీ భావించాడు. దాదాపు 80% సంస్కృత పద భూయిష్ఠమయిన ఆంధ్రభాషకు అలవాటుపడిన వారికి పాళీభాషను గ్రహించుకోవటం మరీ కష్టతరం కాబోదు.

ఈనాడు అందుబాటులో ఉన్న భాషాపరిజ్ఞానాల నేపథ్యంలో, విజ్ఞానాల నేపథ్యంలో 2600 సంవత్సరాల నాటి సామాజిక సాంస్కృతిక పరిస్థితుల్లో అభివృద్ధి చెందిన బుద్ధవచనాన్ని - శాసనాన్ని - అర్థం జేసుకోవటానికి ప్రయత్నించటం కంటే ఆనాడే దానిని పరిగ్రహించి, మౌఖికంగా పరిరక్షించి కాలాంతరాలలో గ్రంథస్థం గావించి అక్షరతః సంరక్షించుకోంటూ వచ్చిన భాషను ప్రమాణంగా గ్రహించుకోవటం అనుకూలంగా ఉంటుంది. దానిలో పాళీభాషదే ప్రథమస్థానం. తరతరాలుగా దానిని జాగ్రత్తగా పరిరక్షించుకొంటూ వచ్చిన వైనాన్ని అందిస్తుంది. ప్రథమ సంగీతి ముగిసే నాటికే ఇవన్నీ ఉన్నాయంటుంది. త్రిపిటకాలు, సుత్తపిటకలో దీఘ నికాయంలో 34 సుత్తంతాలు మజ్జిమ నికాయంలో 152 సుత్తాలు సంయుక్త నికాయంలో 54 సంయుత్తాలు, 7762 సుత్తాలు అంగుత్తర నికాయంలో 11 నిపాతాలు, 9557 సుత్తాలు సుత్త పిటకమంతటిలో 21000 విభాగాలు వినయ పిటకంలో 21000 విభాగాలు, అభిధమ్మ పిటకంలో 42000 విభాగాలు మూడు పిటకాల్లో మొత్తం 40 కోట్ల 72 అక్షరాలున్నాయిని లెక్కగడుతుంది. ఇంకా ఇతర వివరాలెన్నో దానిలో లభిస్తాయి. ఆనాటి థేరులు ఎంత శ్రమజేసి అక్షరతః బుద్ధశాసనాన్ని సంరక్షించటానికి ప్రయత్నించారో దీని ద్వారా అర్థమవుతుంది. ఆ విధంగా మనకు అందివచ్చిన అమూల్యమయిన సాహిత్యాన్ని సక్రమంగా అర్థం జేసుకోవటానికి, ఆనాటి సామాజిక, సాంస్కృతిక నేపథ్యాన్ని కొంతవరకయినా ఆవిష్కరించు కోవటానికి ఆ దరిదాపుల్లో - ఒక వేయి సంవత్సరాలలోపు - తయారయిన పిటకేతర పాళీ సాహిత్యం సహకరిస్తుంది. దాని స్వరూప స్వభావాలను సంక్షిప్తంగా అందించే చిరు ప్రయత్నమిది. ఆసక్తి ఉన్నవారు తమకవసరమయిన గ్రంథాన్ని పరిశీలించుకొని, సమాచారం సేకరించు కోగలుతారనే ఆశయమే ఈ ప్రయత్నానికి ఆధారం.

*ఇంకావుంది...*

ఎమ్. రాజగోపాలరావు, బౌద్ధ సాహితి,
బ్రాడీపేట, గుంటూరు - 522 002
సెల్ : 9866944186

# బౌద్ధ సాహిత్యంలో స్త్రీలు

**- కృష్ణకుమారి**

అత్యున్నతమైన సత్యాలని నలుగురికి అందజేయాలన్న సత్సంకల్పంతో, తామెటు వెళుతున్నామో, తమ గమ్యమేమిటో తమకే తెలియని ప్రజలకు ఒక దిశానిర్దేశం చేయాలన్న సదుద్దేశంతో, ఆ ప్రజల కొరకు ప్రజల భాషలో ధర్మోపదేశం చేసి, వారిని సన్మార్గంలో నడిపించిన మహనీయుడు గౌతమ బుద్ధుడు. సులభంగా తరుణోపాయాన్ని అందచేసిన బుద్ధుని బోధనలకు ఆకర్షింపబడి, అనేక వేల మంది బుద్ధుని మార్గాన్ని అనుసరించారు. అందరిని సమభావంతో చూడగల ఉదార స్వభావుడు బుద్ధ భగవానుడు. అందుకే తన శిష్యగణంలో స్త్రీలకు సముచిత స్థానం కల్పించాడు. ఎంతోమంది కులీనులైన స్త్రీలు భిక్షుణిలుగా మారారు. తమలో మానసికంగా, ఆధ్యాత్మికంగా వచ్చిన మార్పులను కవితాత్మకంగా ఆవిష్కరించారు వీరు. నాటి ప్రజా భాష పాలీలో తమ అనుభవసారాన్ని రసరమ్యంగా చెప్పిన భిక్షుణిలు ఎందరో ఉన్నారు. వారిలో కాయకష్టం చేసుకొని జీవించే స్త్రీల దగ్గర్నించి కులీన స్త్రీల వరకు కన్పిస్తున్నారు. ఆసక్తి కలిగించే విషయం ఏమిటంటే ఈ బోధనలు కేవలం మానవ జాతికే పరిమితం కాలేదు. అలౌకిక శక్తులుగల దేవతలు, పిశాచ వర్గంకూడా ప్రభావితమైనట్లు ఎన్నో జాతక కథలు చెబుతున్నాయి. బుద్ధుని బోధనల ఫలితంగా జీవన విధానంలో మార్పు తెచ్చుకొన్న కొందరు స్త్రీల కవితాత్మకమైన అభిప్రాయాలు ఈ వ్యాసంలో విపులీకరింప బడ్డాయి.

నాటి స్త్రీల మానసిక, బౌద్ధిక స్థాయిని వీరి కవితలు విశదీకరిస్తున్నాయి చూడండి:

**విశాఖ:** అంగ దేశానికి చెందిన ధనమయుడు అనే వ్యక్తి కుమార్తె విశాఖ. ఈమె తల్లి సుమన. విశాఖకు ఏడేళ్ళ వయసున్నప్పుడు మొదటిసారిగా బుద్ధుని దర్శించింది. బుద్ధుని వదనంలోని ప్రసన్నత, కళ్ళలోని తేజస్సు విశాఖను చాలా ఆకర్షించాయి. బోధనలను పూర్తిగా అర్థం చేసుకొనే వయస్సు కాదది. కాలక్రమేణా బుద్ధుని బోధనలు కూడా విశాఖను ఆకర్షించాయి; ప్రభావితం చేశాయి. మానసికంగా విశాఖ బుద్ధుని శిష్యురాలయ్యింది. యుక్త వయస్సులో విశాఖ శ్రావస్తిలోని అత్యంత ధనవంతుడైన మిగార శ్రేష్ఠి కుమారుడైన పుణ్యవర్ధనుని వివాహమాడింది. అయితే మిగారశ్రేష్ఠి గురువు ఇంకొక సంప్రదాయానికి చెందిన వాడు. బుద్ధ ధర్మానికి అక్కడ స్థానం లేదు. నమ్మకాలలోని తేడాలు మొదట్లో విశాఖను కష్టాలకు గురిచేసాయి. క్రమంగా మిగార శ్రేష్ఠి కుటుంబం విశాఖ ఆరాధించే బుద్ధునికి శిష్యులుగా మారారు. మిగారునిలో వచ్చిన ఈ మార్పుకు విశాఖయే కారణం కాబట్టి, తర్వాతి కాలంలో విశాఖను మిగారమాత అని వ్యవహరించారు. శ్రావస్తికి పూర్వదిశలో ఒక విశాలమైన ఆరామాన్ని కట్టించి విశాఖ ధన్యురాలైంది. బుద్ధ ధర్మ ఉపాసికలలో విశాఖకు ఉన్నత స్థానం ఉంది. స్వయంగా బుద్ధుడే ఇలా అన్నాడు:

**"ఏత దగ్గం, భిక్ఖవే, మమ సావికానాం, ఉపాసికానాం దాయికానాం యదివం విసాఖా మిగారమాతా."**

(ఓ భిక్షూ! నా ఉపాసిక, శ్రావికలలో, దాయికలలో విశాఖ, మిగారమాత అగ్రస్థానీయురాలు.)

**చాపా:** ఈమె ఒక వేటగాని కుమార్తె. ఆజీవక ఉపకుడనే అగ్రవర్ణ కులస్థుడు, ఈమె అందం చూసి మోహించి వివాహమాడాడు. వారికొక కుమారుడు కలిగాడు. పుత్ర వాత్సల్యంతో ఆజీవకుడు మిగిలిన విషయాలను కొంత నిర్లక్ష్యం చేశాడు. అది గమనించిన చాపా కాంత వ్యాకుల పడింది. ఒకనాడు కొడుకు విపరీతంగా ఏడుస్తూంటే ఆ



మారుని పుత్రికల ప్రయత్నం విఫలమగుట

బాలుని సముదాయించలేక ఆజీవకుడు చింతించాడు. బిడ్డను లాలించటంలో విఫలమైన భర్తను చూసి చాపా వేళాకోళమాడింది. భార్య ఉపయోగించిన ఎత్తిపొడుపు మాటలు విని జ్ఞానోదయం చెందిన ఉపకుడు సన్యాసం గ్రహించటానికి సిద్ధపడ్డాడు. ఆ నిర్ణయానికి చాపా దుఃఖించలేదు సరికదా భక్తిలో కలిగిన మార్పుకు ఎంతో సంతోషించింది. ఆ సందర్భంలో చాపా పలికిన పలుకులు ఇవి:

**వన్దనం దాని చజ్జాసి । లోకనాథం అనుత్తరం ।**
**పదక్ఖిణంచ కత్వాన । ఆది సెయ్యాసి దక్ఖిణం ॥**

*(థేరగాథలు 308 చాపాథేరిసుత్త)*

నీవు మహాత్ముడైన లోకనాథుడైన బుద్ధునికి నా వందనాలు సమర్పించు. నీ ప్రదక్షిణ ప్రణామాల తర్వాత నా తరపు నుంచి కూడా ప్రదక్షిణ ప్రణామాలు చేయి - అని అర్థం. భర్తను ఉత్తమ గతివైపు నడిపించిన ధన్యజీవిగా చాపా మనకు కన్పిస్తోంది.

**జనపద కల్యాణి:** లిచ్ఛవీ రాజ్యానికి చెందిన మహా సౌందర్య శాలి అంబాపాలీ. ఆమెకు జనపద కల్యాణి అని బిరుదు. రాజన్యులందరూ అంబాపాలీ అందానికి దాసోహ మన్నారు. వృత్తిపరంగా చాలా పేరు సంపాయించింది. కాని చివరి రోజులలో తన జీవితంపట్ల ఆమెకు విరక్తి కలిగింది. ఇన్నాళ్ళ తన జీవితానికి అర్థమేమిటి అని తనని తాను ప్రశ్నించుకుంది. క్రమంగా బుద్ధుని బోధనల పట్ల ఆకర్షితురాలైంది. బింబిసార మహారాజు వలన ఆమెకు ఒక కొడుకు జన్మించాడు. అతని పేరు విమల కౌండిణ్యుడు. యుక్త వయస్సు రాగానే విమలుడు తల్లిని వదిలి బుద్ధ ధర్మం వైపుకు వెళ్ళిపోయాడు. కొడుకు గడుపుతున్న ప్రశాంత



తపస్సు - భల్లికల భిక్ష

జీవనం అంబాపాలిని ఆకట్టుకుంది. అప్పటికే ఆమెకు తన గత జీవితం పట్ల విసుగుదల పెరిగింది. కొడుకు జీవితం ఇచ్చిన ప్రేరణతో అంబాపాలి విపశ్యన మార్గాన్ని ఎన్నుకొంది; సాధన చేసింది; నిర్వాణాన్ని పొందింది. శరీర ధర్మాలను గురించి ఆమె తన అనుభవాల గురించి వెల్లడించిన అభిప్రాయాలు నిత్యసత్యాలు. శరీర లావణ్యం చూసుకొని మిడిసిపడేవారికవి కనువిప్పు కలిగిస్తాయి.

**"కఞ్చనస్స ఫలకంప సమ్మట్ఠం,**
**సోభతే సుకాయోపురే మమ"**

ఈ నా శరీరం బంగారు పుటం పెట్టిన మెరుపు వంటిది. ఎంతో శోభాయమానమైనది.

**"సో వవేహి సుఖుమాహి ఓతతో"**

ఇప్పుడు ముసలి తనంతో ముడుతలు పడి జుగుప్సను కలిగిస్తున్నది.

**"సచ్చవాది వచనం అనఞ్ఞథా"**

సత్యవాదియైన బుద్ధుని మాట అసత్యం కాదు.

*(థేరగాథలు 266 అంబాపాలీ థేరిగాథ)*

**పద్మావతి:** ఉజ్జయినిలో ప్రసిద్ధి చెందిన గణికలలో పద్మావతి ఒకతి. ఈమెకు కూడా బింబిసారుని వలన అభయుడనే కుమారుడు ఉన్నాడు. అభయుడు కూడా చిన్నప్పుడే తల్లిని వదిలి బుద్ధుని ఆశ్రయించాడు. తర్వాతి కాలంలో తన వృత్తిపట్ల ఉదాసీనంగా మారిన పద్మావతికి కొడుకు చూపిన మార్గమే శ్రేష్ఠమనిపించింది. కుమారుడు చేస్తున్న కఠోర సాధనపట్ల పద్మావతి కూడా ఆసక్తి చూపించింది. ఈ సందర్భంలో పద్మావతి ఈ విధంగా అన్నది:

**"ఏవం విహారమనాయ సబ్బోరాగో సమూహతో"**

అందరిని అలరించిన ఇన్నాళ్ళ నా అనురాగమంతా, విహారమంతా సమసిపోయింది.

**"పరిళాహో సముచ్ఛిన్నో సీతి భూతామ్హి నిబ్బుతా"**

నాలోని కోరికల జ్వాలలన్నీ నశించాయి. నిర్వాణ దశ నాకు చల్లదనాన్ని అనుగ్రహించింది. తనంత తానుగా నిర్వాణాన్ని కోరుకొని, సాధనచేసి, అందుకున్న స్త్రీ పద్మావతి.

*(థేరగాథలు 34, అభయమాత థేరగాథ)*

**విమల:** వైశాలిలోని ఒక వేశ్య ఈ విమల. మహా మొగ్గల్లానుని ధర్మోపదేశం విని ఆమెలోని సాత్త్విక, ఆధ్యాత్మిక ప్రవృత్తి మేల్కొంది. ఇన్నాళ్ళు తను గడిపిన జీవితాన్ని

ఏవగించుకుంది. కఠోరమైన సాధనద్వారా ముక్తిని పొందింది. గతంలో తాను గడిపిన జీవితాన్ని మరచిపోయి, ప్రస్తుత స్థితిపట్ల ఆనందాన్ని, తృప్తిని ప్రకటించింది. ఇది తనకు పునర్జన్మ అని సమాధాన పడింది. ఈమె అభిప్రాయాలు వినండి:

**"అట్టాసిం వేసి ద్వారామి । లుద్ధో పాసమివోడ్డియ"**

వేశ్యా గృహంలో ద్వారం వద్ద కూర్చుని వేటగానిలాగా వలను పరిచేదాన్ని

**"అకాసిం వివిధం మాయం, ఉజ్జగ్ఘన్తీ బహుం జనం"**

ఆకర్షణీయంగా నవ్వుతూ లోకులను వలలో వేసుకోవటానికి రకరకాలుగా మాయలు పన్నేదాన్ని

**"సాజ్జ పిణ్డం చరిత్వాన, ముణ్డా సఙ్ఘటి పారుతా'**

ఇప్పుడు తల గొరిగించుకొని, చీవరం కట్టుకొని, భిక్షాటన చేస్తాను.

**"నిసిన్నా రుక్ఖామూలమ్హి, అవితక్కస్స లాభినీ"**

చెట్టుకింద కూర్చుని అవితర్కర ధ్యాన లాభాన్ని పొందుతాను.

**"ఖెప్పత్వా ఆసవా సబ్బే"**

వికారాలన్నీ దూరం చేసుకున్నాను.

**"సీతి భూతమ్హి నిబ్బుతా'**

నేను నిర్వాణాన్ని పొందాను. పరమ శాంతంగా ఉన్నాను. *(థేరగాథలు 73-76, విమల థేరిగాథ)*

**శుభా:** రాజగృహ నివాసియైన కంసాలి కూతురు శుభ. ఈమె ఒకసారి అనుకోకుండా బుద్ధుని బోధనలు విని ప్రభావితురాలైంది. క్రమంగా మానసికంగా సన్యాసిని అయ్యింది. భిక్షుణి కావాలని కోరుకుంది. కాని వయస్సు వచ్చిన ఆమెకు పెళ్ళి చేయాలని ఇంటివాళ్ళు ప్రయత్నాలు మొదలుపెట్టారు. పెద్దల నిర్ణయాన్ని విన్న శుభ బాధపడింది. తనకి వివాహ జీవితం ఇష్టంలేదని, ప్రశాంతమైన సన్యాసినిగా జీవితం గడపాలని ఉందని చెప్పింది.

చూడండి ఎంత దృఢంగా, విశ్వాసంతో పలికిందో:

**"తం మం ఞాతీ అమిత్తావ, కిం వో కామేసు యుఞ్జథ"**

మీరందరు నన్ను ఎందుకు శతృభావంతో చూస్తున్నారు. నన్నెందుకు కామ భోగాలలో తోసేయాలని ప్రయత్నిస్తున్నారు.

**"జానథ మం పబ్బజితం, కామేసు భయదస్సినిం"**

ఈ కామంలోగల నష్టాలని చూసే నేను సన్యాసిని కాదలచుకున్నాను.

**"రణం కరిత్వా కామానం, సీతి భావాభికఙ్ఖినీ"**

కామ భోగాలతో పోరాడి, పరమ శాంతిని పొందదలచుకున్నాను.

*(థేరగాథలు 339, 348, 362, సుభా కమ్మార ధీతు థేరగాథ)*

ఈ విధంగా స్వర్ణకారుని కుమార్తె తన జీవితాన్ని నిజంగానే స్వర్ణమయం చేసుకుంది సరైన నిర్ణయం తీసుకొని.

ఇదే విధంగా గణికా అడ్డకాసీ, సుమంగల మాతా, పూర్ణా, దాసి ఖుజ్జుత్తర వంటి ఎంతోమంది స్త్రీలు తమ అనుభవాలని అక్షరబద్ధం చేసారు. నిర్వాణం గురించి, ప్రవ్రజ్యం గురించి, సాధన సమయంలో వారికి గల్గిన అనుభూతుల గురించి ఎంతో చక్కగా వివరించారు.

సామాన్య మానవులేగాక యక్షులు మొదలైన అలౌకికులు కూడా గౌతముని బోధనలు వినడానికి వచ్చేవారని జాతక కథలు చెబుతున్నాయి. ఒకసారి గౌతముడు శ్రావస్తిలోని జేతవన విహారంలో ధర్మబోధనలు చేస్తున్నాడు.

ఆ సమయంలో ఒక యక్షిణి తన పిల్లలతో సహా ఆకాశ మార్గాన వెళుతున్నది. బుద్ధుని బోధన ఆమె చెవులలో పడింది. ఎంతో శ్రావ్యంగా, మనసుకు హత్తుకునేట్లు ప్రవచనం చేస్తున్న ఆ బోధనలు ఆమెను క్షణంసేపు అక్కడే నిలబెట్టాయి. నెమ్మదిగా భూమిమీదకు దిగి ఒక ప్రక్కన కూర్చుని మొత్తం ప్రవచనం చాలా శ్రద్ధగా విన్నది. తక్షణమే ఆ ప్రభావం ఆమె మీద గాఢంగా పడింది. తన పిల్లలని చూసి ఇట్లా అంది:

**"అజ్జా హమ్హి సముగ్గతా"**



బుద్ధుడు - ఆజీవ ఉపకుడు

నేడు నాకు దివ్యచక్షువులు తెరుచుకున్నాయి.

**"దిట్ఠాని అరియ సచ్చాని"**

అత్యున్నత సత్యం అవగాహన అయ్యింది.

**"పునబ్బసు సుఖీ హెూతు"**

నాయనా! పునర్వసు! నీవు కూడా ఇది అర్థం చేసుకొని సుఖపడు.

**"ఉత్తరాపి సుణాతుమే"**

ఉత్తరా! నీవు కూడా నా మాట విని ఇదే మార్గాన్ని ఎన్నుకో.

పునర్వసు, ఉత్తర ఆ యక్షిణి కుమారుడు, కుమార్తె.

ఇదేవిధంగా పిశాచంగా మారి దుఃఖిస్తున్న ఒక అభాగ్య జీవి గౌతముని బోధనలు విని ప్రభావితమై, తనకి పిశాచత్వం నుండి విముక్తం చేయగలవి బుద్ధ బోధనలే అని గాఢంగా నమ్మాడు. పిశాచం పల్కులు వినండి:

**"అపి ముచ్చేమ పిసచ యోనియో"**

ఈ పిశాచ యోని నుండి విముక్తులయ్యేందుకు తగిన మార్గం.

ఈ విధంగా బుద్ధదేవుని కాలంలో ఎందరో స్త్రీలు తమతమ అనుభవాలని అక్షరబద్ధం చేశారు. ఒకకాలంలో పాలీ భాష ప్రజా భాష. కాలక్రమేణా భాషలలో అనేకమైన మార్పులు జరిగాయి. సుందరమైన అనుభూతులుగల ఈ కవితలు, గేయాలు కొంత మరుగునపడ్డాయి. ఇప్పటివారికి వీటి సౌందర్యం, స్వాభిమానం, విశ్వాసం మొదలైనవి కొంత పరిచయం చేద్దామన్న ఉద్దేశ్యంతో ఒక విహంగ వీక్షణ చేసాను. ఇది చదివిన తర్వాత మిగిలిన కవితలు పాఠకులే స్వయంగా చదువుకోవాలని నా కోరిక.

**డా॥ కృష్ణకుమారి, తెలుగు శాఖాధ్యక్షులు,**
**వివేక వర్ధిని కళాశాల, హైదరాబాద్.**



ధర్మచక్ర ప్రవర్తనము

# జీవిత మర్మం - బౌద్ధ ధర్మం

- డి. చంద్రశేఖర్

మనిషి తన అనుభవం, పరిశీలన ద్వారా జీవితం గురించి కొన్ని మౌలికమైన అభిప్రాయాలు ఏర్పర్చు కుంటాడు. ఆ అభిప్రాయాల ఆధారంగా సాపేక్షంగా నిలకడగల 'తనదైన' ఒక జీవిత నమూనా, పంథా లేక మార్గం రూపొందించుకుంటాడు. ఆ నమూనా లేక పంథాను అనుసరించి జీవించాలని తన శక్తిమేరకు ప్రయత్నిస్తుంటాడు. ఇది 'సాపేక్షం' అని ఎందుకంటున్నామంటే, అది ఎల్లప్పుడు ఒకేరకంగా, ఒకే రీతిలో స్థిరంగా కొనసాగదు కనుక, తను పొందుతున్న అనుభవంలో, తానున్న స్థల కాల పరిస్థితుల్లో వస్తున్న మార్పుల్ని అనుసరించి తన జీవన పంథా లేక నమూనాలో సర్దుబాట్లు మార్పులు చేసుకొంటూ మనిషి ముందుకు సాగుతాడు. ఈ మార్పులు, సర్దుబాట్లు కొన్నిసార్లు అకస్మాత్తుగా, తీవ్రంగా వుండటంతో వాటిని మనం సులభంగా గ్రహించ గలుగుతాం. కాగా, తరచూ స్వల్ప పరిమాణంలో, నెమ్మదిగా చోటుచేసుకునే మార్పుల్ని మనం గమనించలేం.

ప్రపంచంలో చాలా మంది, తామొక జీవిత నమూనాను అనుసరిస్తున్నామని, దానిలో సర్దుబాట్లు మార్పులు చేసుకుంటున్నామనే ఎరుక లేకుండానే జీవిస్తుంటారు. కాని, కొందరు తమ జీవిత గమనం, అందుకు మార్గనిర్దేశం చేసే నమూనా లేక పంథా గురించి తమతమ స్థాయిల్లో ఎరుక కలిగి జీవిస్తుంటారు. కొద్దిపాటి పరిశీలనతో ఎవరైనా యీ విషయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోవచ్చు.

మనిషి తన జీవన మార్గాన్ని లేక నమూనాను రూపొందించుకోవటం, దానితో మార్పులు చేర్పులు చెయ్యటంలో వివిధ అంశాలు ప్రభావం చూపుతాయి. మనిషి అనుభవాన్ని ప్రభావితం చెయ్యగల వివిధ అంశాలను బౌద్ధగ్రంథాలు వర్గీకరించాయి. అవి: భౌతిక పరిసరాలు (రుతు నియమ), పుట్టుకతో వచ్చే సహజాత గుణాలు (బీజ నియమ), మానసిక ప్రవృత్తి, బౌద్ధిక పరిసరాలు (చిత్త నియమ), మనిషి వ్యక్తిగా సామూహికంగా చేసే చర్యలు లేక కార్యకలాపాలు (కమ్మనియమ). వీటిలో మొదటి రెండు అంశాలు మన అదుపులో ఉండేవి కావు, కాని, చివరి రెండింటిని మనం సంకల్పంతో, ప్రయత్నంతో మార్చవచ్చు.

సంకల్పం, ప్రయత్నంతో మానవుడు తన జీవితాన్ని మలుచుకోగలడు అనే అభిప్రాయం, చోదకశక్తి మనిషి వుద్దేశ పూర్వకంగా చేసే చర్యలన్నిటికీ, మనిషి సంకల్పంతో చేసే ప్రయత్నాన్ని పూర్తిగా నిరాకరించేవారు మనుగడ సాగించడం బహుశా అసాధ్యం. 'చరాచర జగత్తు సమస్తం దైవకృతం' అని నమ్మేవారు సయితం మనిషి సంకల్ప పూర్వకంగా చెయ్యవలసిన ప్రయత్నాన్ని పూర్తిగా నిరాకరించలేరు. 'ప్రయత్నం ఫలితాన్నిస్తుంది, కనుక, ప్రయత్నంతో మెరుగైన జీవితం పొందవచ్చు' అనేది వాస్తవికతపై ఆధారపడిన విశ్వాసం; తగిన కృషితో మనిషి పరిపూర్ణ మానవుడిగా ఎదగవచ్చు అనే విశ్వాసం దీని కొనసాగింపే.

అయితే, మనిషి చేసే ప్రయత్నం సరయిన ఫలితాన్ని - మెరుగైన జీవితం, పరిపూర్ణ వికాసం - అందించాలంటే, ఆ ప్రయత్నం జీవిత వాస్తవికత గురించి సరయిన జ్ఞానం, అవగాహన పునాదిగా కలిగి ఉండాలి. దీన్ని బౌద్ధ పరిభాషలో 'యథాభూత జ్ఞానం' (ఉన్నది ఉన్నట్లు



మగధకి పునరాగమనం

తెలుసుకోవటం) అని అన్నారు. మనం దేనినైతే మార్చాలనుకుంటున్నామో దాని గురించి వాస్తవ పరిజ్ఞానం పొందటం అత్యవసరం. లేదంటే ఆశించిన ఫలితం పొందలేం సరికదా, మన ప్రయత్నం దారి తప్పి, వికటించి ప్రతికూల ఫలితాలు ఎదురయ్యే ప్రమాదం వుంటుంది.

ప్రకృతి లేదా జీవితం, దేన్నుండయినా ప్రయోజనం పొందాలంటే వాటిలో యిమిడి ఉన్న సత్యం లేదా అవి అనుసరించే నియమాలు, సూత్రాలు గురించి సరయిన అవగాహన కలిగి ఉండటం అవసరం. వీటిని ఆయా వస్తువుల ధర్మాలు అని కూడా అంటారు (ఉదా: లోహాల భౌతిక ధర్మాలు, రసాయనిక ధర్మాలు). దేన్నుండయినా అత్యున్నత ప్రయోజనం లేదా ఫలితం పొందాలంటే, దాన్ని గురించి పైపై జ్ఞానం లేదా పాక్షిక జ్ఞానం సరిపోదు; దాని అంతరాళంలో దాగివున్న 'రహస్యం' లేదా 'మర్మం' తెలుసుకోవాలి. అంటే వాటి గురించి లోతైన, సమగ్రమైన వాస్తవ పరిజ్ఞానం అవసరం. ఈ విషయాన్ని ఒక వుదాహరణతో మరింత విపులంగా చూద్దాం.

నీటికి కొన్ని ధర్మాలు వున్నాయి. సాధారణంగా అది ఎత్తైన ప్రదేశం నుండి పల్లానికి ప్రవహిస్తుంది. యిది నీటికున్న ఒక ధర్మం. దీని గురించి తెలుసుకోవడానికి కొద్దిపాటి అనుభవం, పరిశీలన చాలు కనుక, ఇది అందరికీ తెలిసిన నీటి ధర్మం. నీటికి మరో ధర్మం వుంది. అది ఎక్కువ పీడనం వున్నచోట నుండి తక్కువ పీడనం వున్నవైపు ప్రవహిస్తుంది. ఈ నీటి 'మర్మం' తెలుసుకోవాలంటే కొంచెం లోతైన పరిశీలన అవసరం. మనం నీటిలోని యీ మర్మాన్ని తెలుసుకుంటే, నీటిని ఎత్తైన ప్రదేశానికి, అంటే కిందినుండి పైకి వెళ్ళేట్లు చెయ్యవచ్చు.



ఖేమ రూపగర్వ భంగం

పైన చెప్పుకున్న మొదటి నీటి ధర్మాన్ని తెలుసుకుని, అందుకనుగుణంగా మనం కొన్ని పనులు చేస్తే, నీటిని మనకు అనువైన చోటుకు తరలించి వంటలు పండించుకోవచ్చు. యింకా అనేక ప్రయోజనాలు పొందవచ్చు. నీటికున్న రెండవ ధర్మం లేదా దాని 'మర్మం' తెలుసుకుని అందుకనుగుణంగా కొన్ని పనులు చేస్తే, నీటిని మిద్దెపైనున్న తొట్టెలోకి లేదా పెద్ద టాంకులోకి ఎక్కించి నిలువ చెయ్యవచ్చు. అలా నిలువ చేసిన నీటిని, మళ్ళీ మొదటి ధర్మం అనుసరించి, పైపుల ద్వారా అవసరమైన చోటకు తెచ్చుకుని ఉపయోగించుకోవచ్చు. అంతేకాదు, పైనుండి క్రిందికి ప్రవహించే నీటికి గతి శక్తి ఉంటుందనే మరో మర్మాన్ని తెలుసుకుంటే, నీటి ప్రవాహం నుండి విద్యుత్తు తయారు చేయవచ్చు. ఇవి యీనాడు అందరికీ తెలిసిన నీటి ధర్మాలు. నీటికి యింకా అనేక ధర్మాలు వున్నా, వాటన్నిటిని చర్చించడం మన వుద్దేశం కాదు.

పై ఉదాహరణ నుండి మనకు ఏం తెలుస్తుంది? నీరు అనే పదార్థాన్ని సమర్థవంతంగా వుపయోగించి, దాన్నుండి ప్రయోజనం పొందాలంటే, మొదట దాని ధర్మాలను లోతుగా అధ్యయనం చెయ్యాలి. తరువాత ఆ ధర్మాలకు అనుగుణంగా తగిన కృషి చేయాలి. నీటి ధర్మాలు తెలియనివారు, తెలిసినా అవసరమైన కృషి చేయనివారు దాని నుండి ప్రయోజనం పొందలేరు. ఇదే సూత్రం ప్రకృతి మరియు జీవితంలోని అన్ని విషయాలకూ వర్తిస్తుంది. అంతేకాదు ప్రకృతి ధర్మమైనా లేక జీవిత మర్మమైనా, తెలిసిగాని తెలియకగాని, దానికి విరుద్ధంగా నడుచుకుంటే ప్రతికూల ఫలితాలను అనుభవించక తప్పదు.

పైన చెప్పుకున్న విధంగా, ప్రకృతి లేక జీవితంలో వస్తుగతంగా వున్న ధర్మాలను - నియమాలు, సూత్రాలు, సత్యాలను - అనుసరించే జీవన మార్గాన్ని ఆధునిక పరిభాషలో వాస్తవిక దృష్టి లేక శాస్త్రీయ వైఖరి అని అంటున్నాం. నిజానికి సంస్కృతంలో 'ధర్మ' అనే పదానికున్న మూలార్థం ఇదే. బుద్ధుడు బోధించిన ధర్మం సరిగ్గా యిటువంటి వైఖరినే కలిగి వుంటుంది. అందుకే, మానవుని వాస్తవిక అనుభవంపై ఆధారపడి శాస్త్రీయమైందిగా నిర్ధారించలేనిది ఏదీ సత్యంగా స్వీకరించదగింది కాదని బౌద్ధం ప్రకటిస్తుంది.

సాధారణంగా, శాస్త్రీయ వైఖరిని సమర్థించే వారు చాలామంది బుద్ధునివట్ల, ఆయన బోధనలవట్ల సానుకూలత, గౌరవ భావం కలిగి వుంటారు. ఇటువంటి

వారికి బౌద్ధం గురించి తీవ్రమైన అభ్యంతరాలు కూడా గూడుకట్టుకుని వుండటంతో, వారు బుద్ధుని బోధనల్ని లోతుగా అధ్యయనం చేయటం, బౌద్ధాన్ని ఒక జీవన విధానంగా అనుసరించటలో పెద్దగా ఆసక్తి కనపర్చరు. 'బుద్ధుని బోధనలు ప్రాచీన కాలానికి చెందినవి కనుక వాటిని యీనాటి ఆధునిక జీవితానికి అన్వయించటం కుదరదు, అది అనివార్యంగా ఒక కాలం చెల్లినవాదం. ఈనాటి ప్రపంచానికి అవసరమైన జ్ఞానం మొత్తం ఆధునిక విజ్ఞానశాస్త్రం, టెక్నాలజి నుండి లభిస్తుంది, భవిష్యత్తులో రాబోయే సమస్యలను సయితం నూతన ఆవిష్కరణ ద్వారా అవి పరిష్కరించ గలవు. కనుక ప్రత్యేకించి బౌద్ధంనుండి నేర్చుకోవలసిన అవసరం ఏముంటుంది?" -యిటువంటి అభిప్రాయాలను అక్కడక్కడా వింటుంటాం.

నిజానికి బౌద్ధంతో భావసారూప్యత గలవారు, బౌద్ధం గురించి యిటువంటి అభిప్రాయాలు కలిగి ఉండటం ఒకింత ఆశ్చర్యం కలిగిస్తుంది. కాని యిందుకు దారి తీసిన అనేక కారణాలు వున్నాయి. వాటిలో ప్రధానమైనవి: అన్నిటికంటే ముఖ్యంగా, కొన్ని శతాబ్దాలుగా బౌద్ధం యీ నేలపై కనుమరుగవటంతో, దాన్ని ఒక సజీవ స్రవంతిగా, సన్నిహితంగా పరిశీలించే అవకాశాన్ని మనం కోల్పోయాం. బౌద్ధ ప్రస్థానంలో చోటు చేసుకున్న సుదీర్ఘమైన యీ "విరామం" వల్ల బౌద్ధ సాహిత్యం కూడా మనకు అందకుండా పోయింది. గత కొంత కాలంగా మళ్ళీ చిగురిస్తున్న బౌద్ధ సాహిత్యం, బుద్ధుని బోధనల వాస్తవిక స్ఫూర్తిని అందించటంలో యింకా తగినంత సమగ్రతను, గంభీరతను సంతరించుకోలేదు. వీటితోపాటు, బుద్ధుని బోధనల్ని ఆధునిక జీవితానికి అన్వయించి వివరించే (తెలుగు) సాహిత్యం చాలా అరుదుగా వుండడం కూడా, పై పేరాలో చెప్పుకున్న అభిప్రాయాలకు ఒక బలమైన కారణం.

బౌద్ధ ప్రాచీన కాలంనాటి లేక ఒక నిర్దిష్ట పరిస్థితులకు మాత్రమే వర్తించే బోధన కాదని, అది సార్వకాలిక సార్వజనీన మానవ జీవిత వాస్తవికతను ప్రతిబింబిస్తుందనే విషయాన్ని వివరించటం యీ వ్యాసం ప్రధాన ఉద్దేశ్యం. దీన్ని అనుసరించి, బౌద్ధం నేటి ప్రపంచానికి ఎలా వర్తిస్తుంది? ప్రత్యేకించి బౌద్ధం నుండి నేర్చుకోవలసిన అవశ్యకత ఏమిటి? అనే విషయాలను కూడా క్లుప్తంగా తెలుసుకుందాం.

మనిషి తన జీవన గమనాన్ని నిర్దేశించే కొన్ని మౌలికమైన అభిప్రాయాలు కలిగి వుంటాడని వ్యాసం మొదట్లో చెప్పుకున్నాం. దీని ప్రకారం, మనిషి తనకు ఎదురయ్యే కొన్ని భావాలను సరైనవని స్వీకరించి, మరి కొన్నిటిని నిరాకరిస్తాడని తెలుస్తుంది. అంతేకాదు సంకల్పం, ప్రయత్నంతో మార్పు సాధ్యం అనే మానవ విశ్వాసానికి పైన చెప్పిన 'భావాల ఎంపిక' ఒక ప్రబల నిదర్శనం. దీన్ని స్థూలంగా క్రియావాదం అని అంటారు. ఇందుకు విరుద్ధంగా 'సమస్త ప్రపంచం, అందులో భాగమైన మానవ జీవితం, మానవాతీత శక్తి అదుపులో (దైవ నియతివాదం) లేదా ప్రకృతి శక్తుల అధీనంలో (ప్రకృతి నియతివాదం) నడుస్తాయి, కనుక వీటిలో మానవ సంకల్పం, ప్రయత్నంవల్ల మార్పు అసాధ్యం' అని చెప్పటాన్ని అక్రియావాదం అంటారు. బౌద్ధం అక్రియావాదాన్ని అన్ని రూపాల్లో నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తుంది. ఇది బౌద్ధాన్ని ఆధునిక విజ్ఞానం సరసన నిలిపే ఒకే ప్రాథమికమైన అంశం. ఈ విషయంలో బౌద్ధం మరో అడుగు ముందుకేసి, సంకల్ప శుద్ధి తగిన కృషితో జీవితంలో గుణాత్మకమైన, సమగ్రమైన పరివర్తన సాధ్యమని చెప్పటమేగాక, పరిపూర్ణ మానవతను అందుకోగల అవకాశం మనిషికి అందుబాటులో వుందని బౌద్ధం నిరూపించింది.

**సత్యాన్వేషణలో అత్యంత మౌలికమైన ప్రశ్న :**

తాత్విక రంగంలో "తప్పని సరిగా సమాధానాలు కనుగొని తీరవలసిన"వని భావించబడే కొన్ని ప్రశ్నలు దీర్ఘకాలంగా చెలామణిలో ఉన్నాయి. ప్రత్యేకించి బుద్ధుని కాలంనాటి భారతదేశంలో సత్యాన్వేషకులైన శ్రమణులు, బ్రాహ్మణులు యిటువంటి ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించటాన్ని ఒక సవాలుగా స్వీకరించినట్లు తెలుస్తుంది. వాటిలో కొన్ని:

1. లోకం అనంతమా లేక పరిమితమా?



కపిలవస్తుకు యేతెంచుట

2. లోకం శాశ్వతమా లేక అశాశ్వతమా?

3. జీవం, శరీరం ఒక్కటేనా లేక అవి భిన్నమైనవా?

4. మనిషి మరణానంతరం అస్థిత్వంలో ఉంటాడా లేక వుండడా?

ఇవి, ఇటువంటి మరికొన్ని ప్రశ్నలు తాత్విక చింతనలో అత్యంత మౌలికమైనవిగా పరిగణించబడ్డాయి. ఈ ధోరణి నేటికీ కొనసాగుతుండటం మనం చూడవచ్చు. బుద్ధుడు, సహజంగానే, యిటువంటి ప్రశ్నలను తరచూ ఎదుర్కొన్నాడు. వీటికి సమాధానం చెప్పి తీరాలని ఆయనను ఒత్తిడి చేసినవారు కూడా వున్నారు. అయితే పైకి యివి ఎంత గంభీరంగా కనిపిస్తున్నా, బుద్ధుడు యీ ప్రశ్నల ఉచ్చులో చిక్కుకోలేదు. వీటికంటే మౌలికమైన, వీటన్నిటి కంటే ముందు పరిష్కరించవలసిన మరో ప్రశ్న వుందని ఆయన చెప్పాడు. 'మనం అన్వేషిస్తున్న ప్రశ్నలు, వాటికి లభించే సమాధానాలు, మనిషిని పట్టి పీడిస్తున్న అస్థిత్వపు సమస్యలను పరిష్కరించటానికి, పరిపూర్ణ మానవ వికాసానికి దోహదం చెయ్యగలవా?' అనేది ఆ ప్రశ్న. పైన వుటంకించిన అధిభౌతిక ప్రశ్నలు నిరుపయోగమైనవి మాత్రమే గాక, అవి నిజమైన సత్యాన్వేషణను పక్కదోవ పట్టించి కుంటుపరుస్తాయని పదేపదే హెచ్చరించాడు (చూళ మాలుంక్య సుత్తం చూడండి). పైకి చాలా సాధారణమైందిగా కనిపించే యీ బోధన మానవ తత్వచింతనా, చరిత్రలోనే ఎన్నదగిన గొప్ప మలుపు. మనిషి దృష్టి నిలపవలసిన జ్ఞానరంగం, కార్యక్షేత్రాల పరిధిని యిది విస్పష్టంగా నిర్వచించింది. నేల విడిచి సాము చేస్తున్న సత్యాన్వేషణను తిరిగి నేలపై నిలబెట్టినట్లయింది.

**బౌద్ధ జ్ఞాన సిద్ధాంతం :**

సాధారణంగా తాత్విక చింతనలన్నీ బహిర్గతంగా లేదా అంతర్లీనంగా తమదైన ఒక జ్ఞాన సిద్ధాంతం కలిగి వుంటాయి. 'జ్ఞానం లేదా ప్రమాణం' అంటుంది వైదిక మతం; 'ప్రభువునందు కలుగు భయము జ్ఞానానికి తొలి అడుగు' అంటుంది క్రైస్తవం, 'అస్తిత్వం చైతన్యాన్ని నిర్ణయిస్తుంది' అంటాడు కార్ల్‌మార్క్స్. ఇవి ఆ తాత్విక చింతనల జ్ఞాన సిద్ధాంతాన్ని తెలియజేసే సూచికలు. ఇదేవిధంగా, బుద్ధుని బోధనల్లో ఒక స్పష్టమైన, గంభీరమైన జ్ఞాన సిద్ధాంతం గోచరిస్తుంది. అనుభవం, అన్వేషణ, పరిశీలన, ప్రయోగం, విశ్లేషణ, వీటిపై ఆధారపడిన స్వయం నిర్ణయం అనే వాటిని బౌద్ధ జ్ఞాన సిద్ధాంతానికి భూమికగా చెప్పవచ్చు. ఈ అంశాల్లో బౌద్ధం, విజ్ఞాన శాస్త్రాల మధ్య చాలా సారూప్యత కనిపిస్తుంది. అయితే బౌద్ధం వీటికి మరో ముఖ్యమైన అంశాన్ని జోడించింది: సుశిక్షితమైన, మలిన రహితమైన మనసు మాత్రమే అత్యున్నత సామర్థ్యంతో యథాభూత జ్ఞానాన్ని గ్రహించగలుగుతుంది. బౌద్ధం ప్రకారం – మనసుకు సరయిన శిక్షణనివ్వటం, దానికి అంటివున్న మలినాలను రుగ్మతలను బలహీనతలను తొలగించటం లేదా అధిగమించటం అనేవి పరస్పరం విడదీయరాని అంశాలు. సుశిక్షితమైన, మలిన రహితమైన మనసు పాత అలవాట్లు ధోరణులను అధిగమించి మృదువుగా, పనికి అనువుగా, చురుకుగా, తేజస్సుతో వుండి తన పూర్తి సామర్థ్యాన్ని పొందుతుందని బౌద్ధం చెబుతుంది.

సంక్లిష్టమైన మానవ సమాజంలో పరస్పరం భిన్నమైన విరుద్ధమైన రకరకాల వాదాలు, తత్వాలు, సిద్ధాంతాలు తలెత్తటం సహజం. వీటిలో ఏది సరైంది, ఏది కాదు అని తేల్చుకోవటం సామాన్యులేగాక పండితులుకూడా ఎదుర్కొనే ఒక జటిల సమస్య. ఇటువంటి పరిస్థితులలో ఏ వాదం లేదా ప్రతిపాదననైనా 'యిది చాలా కాలంగా వింటున్నది; యిది సాంప్రదాయంగా వస్తున్నది, యిది పవిత్ర గ్రంథాల్లో చెప్పింది, యిది తర్కబద్ధంగా వుంది, యిది ఆకర్షణీయంగా వుంది, యిది సమర్థుడైన గురువు చెప్పింది, "యిది 'మన' గురువు చెప్పింది అనే కారణంతో సత్యంగా స్వీకరించవద్దు. అంగీకరించి ఆచరించినప్పుడు కీడు చేస్తాయని మీకు మీరుగా తెలుసుకున్న వాటిని నిరాకరించి, విడనాడండి, అంగీకరించి ఆచరించినప్పుడు మేలు చేస్తాయని మీకు మీరుగా తెలుసుకున్న వాటిని స్వీకరించి ఆచరించండి" అని బుద్ధుడు బోధించాడు (కాలామ సుత్తం చూడండి). సంక్షిప్తమైన, సరళమైన యీ బోధనలో అత్యంత గంభీరమైన రెండు విషయాలు యిమిడి ఉన్నాయి. ఒకటి మానవ



యశోధర రాహులునికి తన తండ్రిని చూపించుట

శ్రేయస్సే సత్యానికి గీటురాయి. రెండు జ్ఞాన సముపార్జనలో స్వయం నిర్ణయాన్ని ప్రకటించటం, వ్యక్తికి స్వేచ్ఛతోపాటు బాధ్యతకూడా వుంటుందని స్పష్టమవుతుంది.

ఇంతవరకూ చెప్పుకున్న విషయాలు సత్యశోధనలో బౌద్ధం అనుసరించే వైఖరిని, జ్ఞానానికి బౌద్ధం సూచించిన ఆచరణాత్మకమైన ప్రాథమిక ప్రాతిపదికను తెలియజేస్తాయి. ఇది బుద్ధుని కాలానికి మాత్రమే పరిమితమైనవి కావని, యివి సార్వకాలిక మానవ జీవిత సత్యాలని ప్రత్యేకించి నొక్కి చెప్పాల్సిన అవసరం లేదు. ఈ సత్యాల పునాదిపై ఆధారపడి బౌద్ధం ఆవిష్కరించిన జీవిత ధర్మం ఏమిటి? అనే విషయాన్ని చూద్దాం.

**యథాభూత జ్ఞానం :**

బుద్ధుని బోధనల్లో అత్యంత ప్రాముఖ్యతగల విషయం ''యథాభూత జ్ఞానం'' లేక ''వున్నది వున్నట్లు తెలుసుకోవటం.'' సాధారణంగా మనిషి తాను పరిశోధిస్తున్న విషయాన్ని, దానిపట్ల తాను అప్పటికే ఏర్పర్చుకున్న ముద్రలు, అభిప్రాయాలు, యిష్టాయిష్టాలు అనే 'రంగుటద్దాల్లో' నుండి చూస్తాడు; తనకు ప్రయోజనకరంగా మలచుకోవాలనే కోణంలోనే దాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు, దీనితో ఆ విషయంలో దాగి వున్న అనేక కోణాలు మరుగున పడిపోతాయి, కనిపించినవి కూడా పాక్షికంగా, వాస్తవ విరుద్ధంగా కూడా కనిపించే అవకాశం వుంటుంది. వీటన్నిటి ఫలితంగా పరిశీలకుడు "వున్నది వున్నట్లు"గాక, తాను దాన్ని 'ఎలా వుండాలని కోరుకుంటాడో' అలాగే చూడగలుగుతాడు. ఇందుకు భిన్నంగా, మానవ జ్ఞానేంద్రియాలకున్న బలహీనతల్ని, పరిమితుల్ని అధిగమించి అస్తిత్వపు లోతుల్లోకి చొచ్చుకుపోయి దాని నిజస్వరూపాన్ని వున్నది వున్నట్లు ఆసాంతం దర్శించటమే యథాభూత జ్ఞానం.

ఇటువంటి యథాభూత దర్శనలోనే అస్తిత్వపు మౌలిక లక్షణాలు ఆవిష్కృతం అవుతాయని బౌద్ధం చెబుతుంది. అలాంటి అస్తిత్వపు మౌలిక లక్షణాలలో అత్యంత ముఖ్యమైనదాన్ని "యద్ కించి సముదయ ధమ్మం సబ్బం తమ్ నిరోధ ధమ్మం" అనే పాళీ వాక్యం చక్కగా వివరిస్తుంది. "రూపొందిన ప్రతిదీ అంతమవుతుంది" లేదా "సంఘటిత ధర్మం కలిగిన ప్రతిదీ విఘటిత ధర్మం కలిగి వుంటుంది" అని దీని అర్థం. దీన్ని సూక్ష్మంగా "అనిత్య" ధర్మం అని కూడా అంటారు. దీని ప్రకారం అసంఖతమైనవని చెప్పబడే ఆకాశం, నిర్వాణం తప్ప లోకంలో స్థిరమైంది, మార్పులేనిది, శాశ్వతమైంది ఏదీ లేదు. ప్రకృతిలోని యీ ధర్మాన్ని తప్పని నిరూపించ వీలు లేని పరమార్థ సత్యంగా బౌద్ధం పరిగణిస్తుంది.

ప్రాచీన భౌతికవాదులు మొదలు నిన్నమొన్నటి ఆధునిక శాస్త్రవేత్తల వరకు ప్రపంచం స్థిరమైన, శాశ్వతమైన అత్యంత సూక్ష్మధాతువులతో నిర్మితమై వుందని విశ్వసిస్తూ వచ్చారు. ఇరవైయవ శతాబ్ది ప్రారంభంలో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ పరమాణు విచ్ఛేదం సాధ్యమని నిరూపించటంతో యీ విశ్వాసం పటాపంచలయింది.

మనిషిలో యితర జీవుల్లో కూడా మార్పు చెందని స్థిరమైన శాశ్వతమైన ధాతువు వుంటుందని, ఆత్మ (soul) అనే యీ ధాతువు అనేక జన్మల పర్యంతం పరిశుద్ధి పొంది అంతిమంగా పరమాత్మలో లీనమవుతుందని ఆత్మవాదం చెబుతుంది. ప్రపంచ వ్యాపితంగా వున్న రకరకాల ఆత్మవాదాల్లో ఎన్నో తేడాలు వున్నప్పటికీ, వాటి సారాంశం యిలాగే వుంటుంది. ఆత్మవాదం – అది ఏరకమైందయినా వాస్తవికతతో సంబంధం లేని వూహాజనితమైన తప్పుడు విశ్వాసం అని బుద్ధుడు నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. మనిషిని ఎంత లోతుగా విశ్లేషించి చూసినా అతనిలో శాశ్వతమైనదని చెప్పబడే ఆత్మగాని, ఆత్మకు సంబంధించిన మరేదైనాగాని కనిపించదని ఆయన చెప్పాడు. అంతేకాదు, మనిషిలో తలెత్తే రాగం, ద్వేషం, అహం, స్వార్థం, పగ, యీర్ష్య, అసూయ మొదలైన రుగ్మతలకు యీ ఆత్మభావనే మూలమని కూడా చెప్పాడు. బౌద్ధంలో "అనాత్మ" అని పిలవబడే యీ ఆవిష్కరణ, నిజానికి పైన చెప్పుకున్న "అనిత్య" సూత్రం నుండి వుత్పాదించబడిందేనని చెబుతారు. కాబట్టి ఆత్మ వుందని నిరూపించదలచినవారు, అంతకంటే ముందు "అనిత్యత" తప్పని నిరూపించాల్సి వుంటుంది.



యశోధర బుద్ధుని పాదాలకు వందనం చేయుట

**ఎందుకీ సత్యాన్వేషణ? :**

బుద్ధుడు అంతుచిక్కని విశ్వరహస్యాలను ఛేదించాలనే జిజ్ఞాసతో లేక పాండిత్యాన్ని ప్రదర్శించాలనే తపనతో అస్తిత్వపు లక్షణాలను శోధించలేదు. పుట్టిన ప్రతి మనిషిని అనివార్యంగా పట్టి పీడిస్తున్న "దుఃఖం" అనే సమస్యను, దాని కారణాలను శోధించి, అంతిమంగా దుఃఖాన్ని నిరోధించే మార్గాన్ని కనుగొనటమే బుద్ధుని అన్వేషణలోని అసలు ఉద్దేశ్యం. అందుకే "నేను బోధించే విషయం ఒక్కటే, అది దుఃఖం, దుఃఖ నివారణ" అని ఆయన పదేపదే నొక్కి చెప్పాడు. మరో విధంగా చెప్పాలంటే, మానవ జీవితంలోని దుఃఖాన్ని నివారించటం గురించి తప్ప మరేదీ ఆయన బోధనల్లో లేదు. దుఃఖాన్ని వుత్పన్నం చేస్తున్న అస్తిత్వపు మూలాలను ఛేదించటంలో భాగంగానే బుద్ధుడు "అనిత్యం" "అనాత్మ" సూత్రాలను కనుగొన్నాడు.

దుఃఖం- యీ మాట వినగానే, చాలా మందికి, యిది తమ జీవితంతో సంబంధంలేని ఏదో 'తాత్త్విక' విషయంలా అనిపిస్తుంది. ఎందుకంటే, మనం మాట్లాడే రోజువారి భాష నుండి యీ పదం దాదాపు కనుమరుగయింది. నిజానికి "దుఃఖం" అనే పదం వ్యక్తం చేసే అనుభవాలను పొందకుండా, అటువంటి అనుభవాలవల్ల మనలో కలిగే స్పందనల్ని వ్యక్తం చేసే రకరకాల పదాలను వుపయోగించకుండా మన జీవితంలో ఒక్కరోజు కూడా గడవదు. స్థూలమైన లేదా సూక్ష్మమైన ప్రతికూల స్పందనలను వ్యక్తం చేసే పదాలు - బాధ, అసంతృప్తి, వేదన, నిరాశ, అలజడి, ఆందోళన, భయం, వెలితి, విసుగు, దిగులు, అనాసక్తి, విచారం, అవమానం, కలవరం, చికాకు, క్షోభ, రోదన, వెగటు, నిస్సహాయత, అసౌకర్యం మొ॥ పదాలు - మనం ప్రతిరోజూ ఏదో ఒక సందర్భంలో వుపయోగించటం



రాహులుడు తండ్రిని తన సంపదనివ్వమని కోరుట

వినటం జరుగుతుంది. వీటన్నిటిని వ్యక్తం చేసే విస్తృతార్థం కలిగిన "దుఃఖం." ఈ అర్థంతో చూసినప్పుడు, మనిషి ఎదుర్కొంటున్న దుఃఖాన్ని చర్చించని మతంగాని, వాదంగాని లేదు. మనిషి జీవితాన్ని సులభతరం, సుఖమయం చెయ్యటమే లక్ష్యంగాగల ఆధునిక విజ్ఞాన శాస్త్రం కూడా పరోక్షంగా మానవుని దుఃఖంతోనే వ్యవహరిస్తుంది. చివరకు 'అందిన మేరకు అన్ని సుఖాలను అనుభవించటమే జీవిత పరమార్థం' అని చెప్పే జల్సావాదం (hedonism) కూడా దుఃఖపూరితమైన అనుభవాల నుండి తప్పించి మనిషికి వూరట కల్పించే వుద్దేశ్యంతో పుట్టిందే.

జీవితంలో అనివార్యంగా సంభవిస్తున్న దుఃఖం గురించి చర్చించటం మనలో తెలియని ఆందోళన కలిగిస్తుంది. కనుక సాధ్యమైనంత వరకు యీ విషయాలకు దూరంగా వుండాలని మన మనసు కోరుకుంటుంది. అందుకే మనం దుఃఖంతో సూటిగా తలపడకుండా, ఎప్పటికప్పుడు దానినుండి తప్పించుకోవటానికి, దూరంగా పారిపోవటానికి మార్గాలు వెతుకుతుంటాం. మనం సృష్టించుకునే వేడుకలు, వినోదాలు, కాలక్షేపాలు, చివరకు ఎప్పుడూ ఏదో ఒకటి మాట్లాడుతూ వుండటం, ఏదో ఒక వ్యాపకంతో మనల్ని మనం బిజీగా వుంచుకోవాలని ప్రయత్నించటం కూడా దుఃఖం నుండి పారిపోవటానికి మనం చేసే పనుల్లో భాగమే. ఇవన్నీ దుఃఖాన్ని తాత్కాలికంగా అణచివేయ గలిగినా, తిరిగి అది మరింత శక్తిని పుంజుకుని మనమీద దాడిచేస్తూనే వుంటుంది. "దుఃఖం జీవితంలో అప్పుడప్పుడు వచ్చిపోయే పరిణామం కాదు, అది జీవితపు నలుమూలలా అల్లుకుని వుండి, నిరంతరం మనల్ని వేధిస్తుంటుంది, ఇటువంటి దుఃఖంతో సూటిగా తలపడకుండా దాన్ని వుత్పన్నం చేసే కారణాలను తెలుసుకుని వాటిని అంతమొందించకుండా దుఃఖంనుండి విముక్తి పొందటం అసాధ్యం" అని బుద్ధుడు ప్రకటించాడు.

దుఃఖం గురించి యిటువంటి వాస్తవికమైన, శాస్త్రీయమైన విశ్లేషణ చేయటం వల్లే బౌద్ధంలో అది గణనీయమైన స్థానం ఆక్రమించింది. సమస్య ఎంత తీవ్రమైందయితే దానికి అంత ప్రాధాన్యతనివ్వటం అనివార్యం. రోగాన్ని నయం చెయ్యాలనుకునే వైద్యుడు రోగంతోనే వ్యవహరించాలి, సరిగ్గా యిదే కోవలో, దుఃఖాన్ని నివారించాలని సంకల్పించిన బుద్ధుడు దుఃఖంతోనే వ్యవహరించాడు. ఫలితంగానే మానవజాతికి దుఃఖాన్ని సమూలంగా నివారించగలిగే మహోన్నతమైన అష్టాంగ

మార్గం అందించగలిగాడు.

పైన చెప్పుకున్న 'అనిత్య', 'అనాత్మ', 'దుఃఖం' – యీ మూడింటిని అస్థిత్వపు మౌలిక లక్షణాలని బౌద్ధం చెబుతుంది, అంటే యివి సార్వకాలీన సార్వజనీన మానవ జీవితపు సత్యాలు. ఈ సత్యాలను ఎవరికి వారు స్వయంగా పరిశీలించి ఒక నిర్ధారణకు రావచ్చు, కేవలం విశ్వాసంతో వీటిని స్వీకరించకూడదు. ఈ సత్యాలపై ఆధారపడి మానవ వికాసానికి, దుఃఖ నివారణకు బుద్ధుడు సూచించిన కార్యాచరణ ప్రణాళిక, అష్టాంగ మార్గం. దీన్ని అనుసరించటంలో అన్నిటికంటే ముందుగా చేయవలసింది మనం మన అంతరంగంవైపు మరలటం.

**బౌద్ధంలో అంతర్ముఖ దృష్టికున్న స్థానం:**

వస్తువుల స్థితి, వేగం అనేవి పరిశీలకుని స్థితితో నిమిత్తం లేని స్థిరమైన విలువలని శాస్త్రవేత్తలు ఎంతో కాలంగా విశ్వసిస్తూ వచ్చారు. 1905లో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ "వస్తువుల స్థితి, వేగం పరిశీలకుని స్థితి, వేగంపై ఆధారపడి వుంటాయి, వాటికి పరమమైన విలువ లేదు" అని ప్రకటించి విజ్ఞాన శాస్త్ర ప్రపంచాన్ని వులిక్కి పడేట్లు చేశాడు. విజ్ఞాన శాస్త్ర చరిత్రలోనే అత్యంత విప్లవాత్మక మైందిగా పరిగణించబడే యీ సాపేక్ష సిద్ధాంతం, శాస్త్రవేత్తలు తమ స్థితిని తాము నిర్వచించుకోవాల్సిన అవసరాన్ని ముందుకు తెచ్చింది. నిజానికి పరమాణు మూలాల ఛేదనలో, విశ్వరహస్యాల శోధనలో మునిగి వున్న విజ్ఞాన శాస్త్రరంగం ఒక్కసారిగా తనవైపు తాను దృష్టి సారించడం అనివార్యమైంది. సరిగ్గా యిదే తరహాలో, మానవ జీవిత మౌలిక సమస్యల పరిష్కారం కోసం జీవాత్మ, పరమాత్మల్లో వెదుకాడుతున్న ధార్మిక రంగాన్ని బుద్ధుడు మనిషిలోని అంతరంగ క్షేత్రం (మనసు)వైపు మరల్చాడు. దీని ఫలితంగా బౌద్ధం అందించిన మనోవిశ్లేషణ, మనో వికాసానికి సూచించిన ఆచరణాత్మకమైన సాధనా విధానం మానవ జాతికి లభించిన ఒక మహోన్నతమైన జ్ఞానసంపద అనటం అతిశయోక్తి కాదు.

బౌద్ధ మనో విశ్లేషణపై ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్రవేత్తల అభిప్రాయానికి అద్దం పట్టే సంఘటన ఒకటి జరిగింది. హార్వర్డ్ యూనివర్సిటీలో ఒకరోజు, అమెరికన్ సైకాలజీలో అగ్రగణ్యుడుగా భావించబడే ప్రొఫెసర్ విలియం జేమ్స్ విద్యార్థుల్ని వుద్దేశించి ప్రసంగించబోతున్నాడు. ఆయనకు ఎదురుగా విద్యార్థుల మధ్య కూర్చొని వున్న అనగారిక ధర్మపాల కనిపించాడు. పసుపు బట్టల్లో వున్న ధర్మపాలను గుర్తించిన ప్రొఫెసర్ జేమ్స్ "నా స్థానంలో మీరు కూర్చోండి, నేను విద్యార్థులతోపాటు కూర్చుంటాను. సైకాలజీ మీద మాట్లాడటానికి నాకంటే మీరే తగినవారు" అంటూ ధర్మపాలను వేదిక పైకి ఆహ్వానించాడు. అనగారిక ధర్మపాల బౌద్ధంపై క్లుప్తంగా ప్రసంగించిన అనంతరం "మరో పాతికేళ్ళ తరువాత అందరూ అధ్యయనం చెయ్యబోయే సైకాలజీ యిదే (బౌద్ధం)" అని ప్రొఫెసర్ జేమ్స్ తన విద్యార్థులకు చెప్పాడు. ఆయన 1904లో చెప్పిన యీ జోస్యం యథాతథంగా జరగకపోయినప్పటికీ, యీ సంఘటన జరిగిన దాదాపు 50 సంవత్సరాలకు, పాశ్చాత్య మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు చాలామంది బౌద్ధ మనోవిజ్ఞానాన్ని లోతుగా అధ్యయనం చెయ్యటం, అన్వయించటం ప్రారంభించారు.

మనం అత్యాధునిక శాస్త్రంగా పరిగణిస్తున్న మనోవిజ్ఞానం గురించి ఎప్పుడో 2,500 సం॥ల క్రితమే బుద్ధుడు చెప్పి ఉండటం మాత్రమే యీ ఆసక్తికి కారణం అనుకుంటే అది పొరపాటు. బౌద్ధ మనోవిజ్ఞానంలో పెరుగుతున్న ఆసక్తికి మరో ముఖ్యమైన కారణం వుంది. ఆధునిక మనోవిజ్ఞానం చాలా కాలంపాటు, ప్రధానంగా మానసిక రుగ్మతలను, బలహీనతలను నివారించటంపైనే దృష్టి సారించింది. బౌద్ధ మనో విజ్ఞానం యీ పరిధిని దాటి, అంతరంగ పరివర్తనతో మనిషి మూర్తిమత్వాన్ని పరిపూర్ణంగా వికసింపజేయటం గురించి చెబుతుంది. బుద్ధుని బోధనల్లో గల యీ మహోన్నత లక్ష్యం, యీ లక్ష్యాన్ని అందుకోవటానికి బౌద్ధం అందించిన సమగ్రమైన, ఆచరణాత్మకమైన విధానం ఆధునిక శాస్త్రవేత్తలను గాఢంగా ఆకట్టుకుంది. ఫలితంగా యీనాడు ప్రపంచ వ్యాప్తంగా



**అనాథ పిండకుడు బంగారు నాణేలను జేతవనంలో పరిచించుట**

జరుగుతున్న మనోవిజ్ఞాన పరిశోధనల్లో బౌద్ధం విడదీయ రాని భాగం అయింది.

పైన చెప్పిన విషయాలనుబట్టి చూస్తే, తాత్కాలిక అవసరాలను మాత్రమే దృష్టిలో వుంచుకొని బుద్ధుడు తన బోధనల్ని 'రూపొందించ' లేదని తెలుస్తుంది. తాను బోధించిన ధర్మం తనతో నిమిత్తం లేకుండా ప్రకృతిలో, జీవితంలో కొనసాగే అంతఃసూత్రాల సారం అని బుద్ధుడు స్వయంగా ప్రకటించినట్లు ధమ్మనియమ సుత్తం చెబుతుంది. కనుక బౌద్ధం పల్లానికి ప్రవహించే నీటి ధర్మంలా, పరావర్తనం చెందే కాంతి ధర్మంలా మానవ జీవితంలో వస్తుగతంగా వున్న ధర్మం. ఇది కాలాన్నిబట్టి మారిపోయేది కాదు. అందుకే దీన్ని "అకాలిక ధమ్మం" అని అన్నారు.

ఈ అకాలిక ధర్మాన్ని తెలుసుకుని, దాని వెలుగులో జీవించటంవల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? ధర్మాచరణం వల్ల కలిగే ప్రయోజనాలన్నింటిని యిక్కడ చర్చించటం కుదరదు. అయితే భిన్నస్థాయిల్లో కలిగే రెండు ప్రయోజనాలను మాత్రం తెలుసుకుందాం.

ఒకటి: బౌద్ధధర్మాన్ని ఆచరించే వ్యక్తి ఎరుక లేక సతితో జీవించగలుగుతాడు. అంటే పరిసరాలు పరిస్థితులు మనల్ని వెంట తరుముతున్నట్లు లేదా మనం వాటివెంట పరుగులు తీస్తున్నట్లుగాక, మనం మన జీవితంపట్ల పూర్తి ఎరుక, సమతతో అదుపు కలిగి జీవించటం. పైపైన చూసినప్పుడు యిది చాలా మామూలు విషయంగా కనిపించవచ్చు. కాని మనిషి జీవితంలో ఎరుక పోషించే పాత్ర చాలా విస్తృత ప్రభావం కలిగింది. నిత్య జీవితంలో మనం చేసే ప్రతి పనిలో ఎరుక మనకు తోడ్పడుతుంది. ఎటువంటి దురవస్థలోనైనా మనం దారి తప్పకుండా అదుపు తప్పి



శాక్య, కోలీయుల జల వివాద సమస్య పరిష్కారం

పడిపోకుండా నిలబడగలిగేటందుకు ఎరుక ఊతమిస్తుంది. చివరకు సంతోషంలో సంబరంలో కూడా వశం తప్పకుండా కంటికి రెప్పలా అది మనల్ని కాపాడుతుంది.

నిరంతరమైన ఎరుక, విస్పష్టమైన పరిశీలనకు బలమైన జ్ఞాపక శక్తికి దోహదం చేస్తుంది. ఇక్కడ "జ్ఞాపక శక్తి" అంటే సాధారణంగా చెప్పుకునే అర్థంలో పరస్పర సంబంధం లేని విషయాలను అధిక సంఖ్యలో గుర్తుంచుకోవటం వాటిని వల్లించడం కాదు. అవసరానికి అనువైన సమయంలో తగిన విషయాలు మనకు అందుబాటులోకి, అంటే జ్ఞప్తికి రావటం జ్ఞాపకశక్తి అత్యంత ముఖ్యమైన లక్షణం. దీన్ని పెంపొందించటంలో ఎరుక లేక సతి ఒక ప్రాథమికమైన భూమిక పోషిస్తుంది.

ఎరుకతో అత్యంత సన్నిహిత సంబంధంగల విషయం మరొకటుంది. దీన్ని బౌద్ధ గ్రంథాల్లో "యోనిసో మనసికార" లేక "పర్యాలోచన" అని అన్నారు. సాధారణంగా అదుపులేని మనసు గజిబిజిగా పరుగులు తీస్తుంటుంది, ఏ విషయం పై దృష్టి నిలపాలో దానిపై దృష్టి నిలపదు, దృష్టి నిలపతగని విషయాలపై అది అమితంగా దృష్టి సారిస్తుంది. దీని కారణంగా మానసిక శక్తులు శ్రద్ధ, వీర్య, సతి, సమాధి, ప్రజ్ఞలు – బలహీన పడటంతోపాటు, మనసును అస్తవ్యస్తం చేసే క్లేశాలు (మానసిక జాడ్యాలు) మరింత బలం పుంజుకుంటాయి. ఈ స్థితిని అధిగమించి మానసిక శక్తుల్ని పెంపొందించుకోవటం, వాటిని ప్రయోజనాత్మకంగా వుపయోగించటంలో పర్యాలోచన ముఖ్యపాత్ర వహిస్తుంది. మరోవిధంగా చెప్పాలంటే, ఆకర్షణీయంగా కనిపించే ప్రతి అనుభవం వెంట ఆలోచనారహితంగా పరుగులు తీయకుండా, హితకరమైన విషయాలపై దృష్టి నిలుపగల మానసిక సామర్థ్యమే యోనిసో మనసికార లేక పర్యాలోచన.

ఎరుక, పర్యాలోచన పెంపొందిన వ్యక్తి మానసికంగా, శారీరకంగా కూడా ఆరోగ్యంగా వున్నట్లు ఆధునిక పరిశోధనలు రుజువు చేస్తున్నాయి. అంతేగాక, అటువంటివారి మానవ సంబంధాల్లో కుటుంబ సభ్యులు, బంధువులు, మిత్రులు, సహచర వుద్యోగులు మొదలగు వారితో గల సంబంధాల్లో క్రమంగా సానుకూలమైన మార్పులు చోటుచేసుకుని, జీవితం నూతనోత్తేజాన్ని పొందుతుంది. ఇవి వ్యక్తిగత పరిధిలో కలిగే ప్రయోజనాలు.

రెండు: యిది వ్యక్తి స్థాయిలోగాక మానవజాతి నిజానికి సమస్త జీవరాశి మనుగడకు సంబంధించిన "పర్యావరణ పరిరక్షణ" సమస్య. భూమిపై వాతావరణ, జీవావరణ

సమతౌల్యం క్షీణించటంవల్ల మనం ఎదుర్కొంటున్న, భవిష్యత్తులో ఎదుర్కొనబోతున్న దురవస్థల గురించి యీనాడు ప్రపంచమంతటా పెద్దఎత్తున ప్రచారం జరుగుతున్న విషయం మనకు తెలుసు. పర్యావరణం దెబ్బతిన్న ఫలితంగా తలెత్తుతున్న సమస్యలు నానాటికీ తీవ్రమౌతున్న ఎండలు, ఒకవైపు అనావృష్టి కరవు కాటకాలు మరోవైపు వరదలు తుఫానులు, పెచ్చరిల్లుతున్న మరణాంతకమైన అంటువ్యాధులు, నేల నీరు గాలి ఆహార కాలుష్యం, అడుగంటుతున్న ప్రకృతి వనరులకోసం జరుగుతున్న ప్రత్యక్ష పరోక్ష యుద్ధాలు మొ॥ యిప్పటికీ మనం అనుభవ పూర్వకంగా చూస్తున్నాం. ఇవి ఏరకమైన పరిమితులు లేకుండా మొత్తం మానవజాతిని పట్టిపీడిస్తున్న సమస్యలు. పరిస్థితి యిలాగే కొనసాగితే, సమీప భవిష్యత్తులో మానవజాతి వూహలకందని విషమ పరిణామాలను ఎదుర్కొనక తప్పదని, అంతిమంగా భూమిపై మానవుడు అంతరించిపోయే ప్రమాదం పొంచి వుందని పర్యావరణ వేత్తలు ముక్తకంఠంతో హెచ్చరిస్తున్నారు.

మానవజాతి మనుగడనే ప్రశ్నిస్తున్న యీ సమస్యపై, గత 45 సం॥ల్లో జరిగిన వివిధ అంతర్జాతీయ సదస్సులు 'పర్యావరణ సమస్య మానవ చర్యల ఫలితమే'నని నిర్ద్వంద్వంగా ప్రకటించాయి. 1972 మొదలు నేటివరకూ ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాల ప్రభుత్వ - ప్రాతినిధ్యంతో జరిగిన పర్యావరణ సదస్సులలో, యీ సమస్యను నివారించటానికి చేసిన తీర్మానాలన్నీ చెప్పిన ప్రధానమైన విషయాన్ని మనం ప్రత్యేకించి గమనించాలి: "శృతి మించుతున్న వస్తుసేవల వుత్పత్తి, వినియోగాలను అదుపుచెయ్యండి." ఇక్కడ చెప్పిన "అదుపు", ఆయా ప్రభుత్వాలు తమ దేశాల్లోని వుత్పత్తి రంగంపై చెయ్యవలసిన నియంత్రణ అనేది స్పష్టం. ఈ సమస్యపై ప్రపంచ వ్యాప్తంగా పరిశోధించిన క్లబ్ ఆఫ్ రోమ్ 2వ రిపోర్టు (1974) వస్తు సేవల వినియోగంపై వ్యక్తిస్థాయిలో స్వచ్ఛందంగా జరగవలసిన అదుపు, యీ సమస్య పరిష్కారంలో చాలా ముఖ్యమైందని చెప్పింది. దీనితోపాటు, ఆ రిపోర్టు ప్రతిపాదించిన విశ్వమానవ నైతికతలో చెప్పిన విషయాలు (Mankind at The Turning Point, Page: 147) మనకు ప్రత్యేకించి ఆసక్తికరమైనవి: "మనిషి తన దేశ, జాతి, ప్రాంతీయ సరిహద్దులు దాటి విశ్వమానవ ప్రేమను పెంపొందించుకొనటం ఒక ఆదర్శంగా గాక అవసరంగా భావించాలి." ఇటువంటి విశ్వమానవ (యిందులో రాబోయే తరాలను కూడా చేర్చటం గమనించదగింది) ప్రేమ పెంపొందకుండా పర్యావరణ సమస్యను అర్థం చేసుకోవటం, దాని పరిష్కారంలో భాగస్వాములు కావటం దుర్లభం అని కూడా ఆ రిపోర్టు చెప్పింది.

ఇంతటి తీవ్రమైన, సంక్లిష్టమైన సమస్యను బౌద్ధం మాత్రమే పరిష్కరించగలదని చెప్పలేం. కాని యిందుకు అవసర, అనివార్యమైన మానసిక పరివర్తన - వస్తు వినియోగంలో సంయమనం, అవధులు లేని విశ్వమానవ సహానుభూతి - పెంపొందించటంలో బౌద్ధం నుండి అమూల్యమైన మార్గదర్శకత్వం లభిస్తుందని ఖచ్చితంగా చెప్పవచ్చు. మి

డి. చంద్రశేఖర్,
ఫోన్ : 9290091232



మాగంధియుడు తన కుమార్తెను వివాహం చేసుకోమని అభ్యర్థించుట

# థేర గాథలు – ఒక పరిశీలన

– తియ్యగూర సీతారామిరెడ్డి

థేరులు అనే పాలీ పదానికి పెద్దలు, అనుభవజ్ఞులు అని అర్థం. సంస్కృతంలో స్థవిరులని అంటారు బౌద్ధభిక్షువులు తమ తమ సీనియారిటీని బట్టి థేరులుగా పరిగణింప బడతారు. అర్హతులైన థేరులు ఉత్సాహంతో ఆనందంతో పలికిన పలుకులే థేరగాథలు, థేర పదాలు. గాథ అనేది శ్లోకానికి పూర్వ రూపం. గాథ నుండే శ్లోకం పుట్టింది. గాథ ప్రజల వాడుక భాషలో ఉన్న చిన్న చిన్న పాలీ కవితల రూపం. కనుక ఆది కవులు ఈ థేరులే యని తేట తెల్లమవుతుంది. వీటిని తిపిటకాల్లో ఖుద్దక నికాయంలో పొందు పరచారు. ఇవి భారతీయ చారిత్రిక కాల గర్భంలో దాగిన అమూల్య రత్నాలు. భారతీయ సాహిత్య సాంస్కృతిక సుందర వనంలో వాడని పారిజాతాలు. దర్శించిన వారికి తమ సౌరభాన్ని ఇప్పటికీ వెదజల్లుతూనే ఉన్నాయి.

మన ప్రాచీనులు పురాణాలకు ఇచ్చిన ప్రాధాన్యం, చారిత్రిక నేపథ్యానికి ఇవ్వకపోవడం ఎంతో దురదృష్టకరం. కానీ మన అదృష్టం కొలదీ బౌద్ధ సంస్కృతి వలన సాహిత్యంలో గానీ, ఆరామాల కట్టడాలలో గానీ, శిలా శాసనాలలో గానీ మనకు ఎన్నో చారిత్రక ఆధారాలు లభించాయి. దీని వల్ల అప్పటి సామాజిక,సాంస్కృతిక అభ్యుదయాన్ని అర్థం చేసుకో గలుగుతున్నాం. బౌద్ధం ఆవిర్భవించి యుండకపోతే ఈ కొద్ది సత్యాలు కూడా



మాగంధియ తన పరిచారకులచే
బుద్ధుని దూషింప జేయుట

మిగిలియుండేవికావు. థేరగాథలు కూడా మనకు మిగిలిన చారిత్రిక ఆణిముత్యాలు. సాంస్కృతిక సాలభంజికలు. సారస్వత రస గుళికలు.

2500 సంవత్సరాలకు ముందు బుద్ధ భగవానుని శిష్యులుగా, భిక్షువులుగా, ఔరసపుత్రులుగా, అరహంతలుగా తమ తమ జీవితాలను ధన్యం చేసుకొన్న థేరుల గుండెల లోతుల్లోంచి వెల్లువగా వెలువడ్డ మధుర మకరందాలు, మాట మాటకధిక మధురమైన అక్షర ద్రాక్ష రసాలు. ముఖ్యంగా పుక్కిట పురాణాల్లా ఊహించినవి కల్పించినవి కానటువంటి చారిత్రక రత్నాలు. ఇందులో సామాజిక ఆధ్యాత్మిక, విషయాలను కళాత్మకంగా కవితాత్మకంగా వివరించారు. వీరందరూ భగవానుని శాసనాన్ని పూర్తి చేసుకొని పరమ శాంతిని దర్శించినవారే! అందరూ తమ తమ చేతలనుండీ, హృదయాలనుండీ రాగద్వేషాల కాఠిన్యాన్ని త్యజించినవారే! వారిని స్పర్శించిన చేదునూ, తీపినీ సమతతో స్వీకరించిన వారే! ఉత్తియ స్థవిరుడు, తాలపుత్త స్థవిరుల పదాలను చూడండి!

**బాధల వెల్లువ తాకగ బోధిని విడువక సతియుత ప్రజ్ఞల తోడన్**
**సాధన జేసితి! సమతల నిధాన సన్నిధి నిరతము నా పెన్నిధియే!**

*... 30*

**చేరుకొంటి శాంతి చెదరనట్టి పదము, సమత నేర్వ చిత్త శాంతి గల్గె!**
**పొగడినంత మనసు పొంగి పోవుట లేదు, దూషణముల దుక్ఖ పడదు.**

*...1103*

అందరూ ఇంద్రియ విషయాలపై, స్త్రీ వాసనలపై విరక్తి భావం కలవారే! కానీ స్త్రీలపై వారికి ఎలాంటి హేయభావమూ లేదు. అందరూ స్త్రీల బలహీనతలపట్ల కరుణతో పరిష్కారమార్గాన్ని చూపించినవారే! ఖదిర వనీయథేరుడు చాలోభిక్షుణీ సోదరీమణులకిచ్చే సూచన–

**హరిణముల హరింప నురుకు హరీంద్రమువలెను తమోవిహారజన సం**
**హరణంబు సేయ నురుకును మారుదు; సతి సంపజన్యమొదలకనే! ఓ!**
**చాలో భిక్షుణిలారా!ఆలోకనము సేయుమా! సదా ధర్మంబున్!**

తొలగగ మారుని గాలము, నిలుపుము చిత్తము విపశ్యన ధ్యానములో!

లోకోభిన్న రుచి అనే సంగతి తెలిసిన జంబుగ్రాహక స్థవిరుడిలా చెప్పాడు.

ఒకనికి సొమ్ములు ఇష్టం ఒకనికి దుస్తులు ఒకనికి శీలపు గంధా

లొకనికి లోకపు రుచులును, మీ కష్టము తీరు యిష్టమొదులుట చేతన్!

... 28

**థేరుల ఆధ్యాత్మికత :**

భగవానుడు మానవజీవితాన్ని ఎంత లోతుగా అర్థం చేసుకొన్నాడో ఆయన పుత్రులు కూడా అంతలోతుగానే అర్థం చేసుకొన్నారని మాణవస్థవిరుని మాటల్లో తెలుస్తుంది.

దుక్ఖము పుట్టుట గిట్టుట దుక్ఖము రోగము, యనిత్య సుఖములు దుక్ఖం

దుక్ఖమొదల చేపట్టితి చక్కగ ప్రవ్రజ్య బుద్ధ శాసన మందున్!

... 73

ఒకసారి వీతశోకుడు క్షవరం చేయించుకొనే సమయంలో పొందిన ధర్మ సంవేగాన్ని గమనించండి.

మంగలి క్షవరము మంగళ మాయెను జుట్టు తెగిపడు పుట్టి పెరిగి;

పుట్టి పెరుగు మనిషి గిట్టుట కొరకేను జగతి సత్యమిది నిజమును గంటి...!

అంతరించిపోయె అజ్ఞానమంతయు కాయపశ్యనందు కర్మలొదలె

ఆస్రవమ్ము లొదలె భవ దుక్ఖము లొదలె పుట్టుగిట్టు ఉడుము పట్టు వదలె...! ...169, 170

భగవానుని సోదరుడైన నందుడు తన శరీర సౌందర్యం పట్ల, భార్య సుందరి పట్ల ఎంత ఆసక్తుడై ఉండేవాడో, తరువాత ఎంత ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించాడో ఆయన మాటల్లోనే చూడండి.

మేని మెరుగులందు మనసు మునిగిపోయి, కామరాగ మందు కాగిపోయె...!

చపలచిత్త మిప్పుడు ఆదిత్య బంధుని కుశల మార్గమందు కుదుట పడెను...!

... 157, 158

సమాజం లోని కీర్తి అపకీర్తి గురించి సిరిమా స్థవిరుని దృష్టికోణాన్ని గమనించండి!

పశ్యనంబులేక వశ్యమేల మనసు? యశము ఏల చిత్తవశము లేక...?

పశ్యనంబు తోడ వశ్య మనస్కుడు, నిందపడిన గాని కందిపోడు...!

... 159, 160

భిక్షువులందరూ సంస్కారాలను త్యజించినవారే, వాటి అనిత్యతను అనుభూతి చెందిన వారే! వారికి నిర్వాణ సుఖం మాత్రమే అత్యున్నత సుఖం. ధర్మ సేనాపతి ఆర్య సారిపుత్రుని ప్రజ్ఞా వచనాలను ఆలకిద్దాం.

భయమేల నాకు మరణము, ప్రియమేల కలుగును బతుకు పయనము నందున్,

కాయము పోవు వరకు నే నయముగ సతితో నిరీక్ష చేయుచునుంటిన్!

... 1001

బతుకుయందు తీపి మరులు గొనుట లేదు, మరణమన్న చిన్న భయము లేదు.

దేహమున్న వరకు మోహమన్నది లేదు, వేచియుంటి నేను వేలితి లేక!

బత్తెమునకు వేచి భృత్యుడున్నయటుల చివరి ఫలము కొరకు జూచు చుంటి!

... 1002

అర్హతులందరూ కామాన్ని జయించినవారు కనుక ఏ స్త్రీ యొక్క ముగ్ధమనోహర రూపం కూడా వారిని ప్రలోభపెట్టలేక పోయింది. వంగీస స్థవిరుని ధృఢచిత్తాన్ని చూడండి.

వెలది కంటబడిన, వెంటబడిన గాని చలనమేల గలుగు చిత్తమందు!

ధర్మ సాధనందు దృఢముగా నుంటిని, కీడు గలుగదు గురు కీలు కుదిరె!

... 1220

ఒకసారి నాగసమాలుడు భిక్ష కోసం నగరానికి వెళ్ళాడు. వీధి కూడలి వద్ద ఒక దొమ్మరి ఆటగత్తె కనిపించింది. అప్పుడా స్థవిరుని అనుభూతిని చూడండి.

ఉల్లి పొరల జిలుగు వెలుగు చీరలు గట్టి, జాజిపూలచెండు జడల జుట్టి,

రాచవీధులందు రమ్య రమ్య గతుల ఆడి పాడుచుండె ఆటవెలది.

చూడ మృత్యువొచ్చి ఆడినట్లుగ తోచె, ధర్మరక్ష కోరిధన్యుడైతి!

చిత్త పశ్యనందు సుస్థిరమైయుంటి, స్థిత ప్రజ్ఞ గల్గి సుఖము గంటి!

... 267, 268

పారాపారయ స్థవిరుడు ఆడువారి వెంటపడి తిరిగేవారిని ఎలా హెచ్చరిస్తున్నాడో చూడండి.

చిన్నదాని చూపులయందు చిక్కినోడు,ఆడువారి మాటల మాయపడువాడు,

వెలది వాసనలొదలని వెర్రివాడు ధర్మ దూరుడగుచు చిక్కు దుక్ఖమందు!

... 738



చించా మాణవిక

భిక్షువులు ఆడువారి శరీరమందు నిస్సారాన్ని చూడటమే గాకుండా స్వయంగా తమ శరీరాన్ని పశ్యన చేస్తూ అదికూడా నిస్సారమైనదేనని, అనిత్యమైనదేనని భావనచెందారు. కుల్యస్థవిరుడు స్మశానంలోని కాయం పట్ల అశుభ భావన చెంది వైరాగ్యం చెందాడు. కోటి చుక్కల్లో చంద్ర బింబంలా వెలిగి పోయే వేశ్య సిరిమ. మరణించిన తరువాత ఆమె శవాన్ని కాటిలో కుక్కలు నక్కలు పీక్కుతినడం చూసి –

కాదునందు చెడిన పాడు శవము చూడు, పురుగు పుట్ర తినగ పుచ్చిపోయె!
కాయమందు కామి కదు మూర్ఖుడగు జూడ! మరులు గొనుటయేల మురికి చూడు!
దేహమందు నిత్య ధర్మమేది లేదు, ధర్మటద్ధమందు తరచిచూడ!
జ్ఞానదృష్టి గల్గి జూడ తుచ్ఛము గద కాయమంత లోన బయలు నందు!

*... 393, 394*

**బుద్ధసంఘంలో జాతి మత విభేదాల నాశనం :**

బ్రాహ్మణులైనా, క్షత్రియులైనా, వైశ్యులైనా, శూద్రులైనా, కడజాతి వారైనా, ఏ జాతివారైనా, ఏ దేశవాసులైనా, ఎవరైనా, భిక్షు దీక్ష తీసుకొని సంఘంలో చేరగానే ఏ భేదం లేకుండా ఆర్యులుగానే పరిగణింపబడేవారు. అష్టపుగ్గల మోక్షస్థితులను బట్టి తమలో తాము గౌరవించుకొనేవారు. బుద్ధ పుత్రులుగా మరల పుట్టగానే పూర్వపు కులగోత్రాలు వదలి వేయబడేవి. బ్రాహ్మణునిగా పుట్టి అగ్రకుల గర్వంతో విర్రవీగిన జేంత స్థవిరుడు తన గర్వం సర్వం ఖర్వమెలా అయిందో తెలుపు తున్నాడు చూడండి!

మద మత్తుడ జాతివలన, మదమత్తుడ భోగమందు, మత్తుడ ధన సం
పద బలిమిన; అందముచే మదమత్తుడనై తిరిగితి మదగజ భంగిన్!

*... 423, 424*

బుద్ధుని పుత్రుడైన తరువాత,

బుద్ధ ధర్మ దర్శనమాయె శుద్ధుడైతి, ఆత్మమదమంత చూడగ అంతమాయె!
రూపమదమంత నాలోన రూపు మాసె, భోగమదమంత యణగెను బిచ్చమెత్తి!

*... 425, 426*

దాటిపోయితిని యనాత్మ ధర్మమంత, పరము చేరితిని యనిత్య పశ్యనందు!

*... 427, 428*

రాజభోగాలు వదలి బోధి సుఖాలు పొందిన బద్దియ స్థవిరుడు తాను ధన్యమైన సంగతి తెలుపుతూ –

గజము దూరమేగ గజవాహనములుండె! సన్న బియ్యపు వరి వణ్ణముండె,
మంచి రచుల లేత మాసపు పులుసుతో! పట్టు వలువలుండె కట్టుకొనగ!
ఇన్ని ఉన్నా శాంతి లేదు. ఎంత కాపలా ఉన్నా భయం వదలలేదు.
ఖడ్గ ధరుల మధ్య, కోటగోడల మధ్య మదిలోని గొంకు వదలలేదు.
చిరుగు చీవరాలు జుట్టి భిక్షునైతి, గొంకు వదలె ధర్మ కాంతి సోకి!

*... 842, 852*

హీన కులంలో పుట్టి భిక్షువైన సునీతుని పలుకులను ఆలకిద్దాం!
పాకి పనులు చేసి పస్తులుంటిని చాల! వంగి వంగి చేస్తి వందనాలు!
కుంగి పోతి హీన కులజుడైనందుకు,ధర్మ శాస్త్ర దొరికి ధన్యుడైతి!
పశ్యనంబు నేర్చి పర్వత గుహకేగి తపము సేయ బుద్ధ తెరువలందు,
పరమ పదము దక్కె! బ్రహ్మదేవతలొచ్చి, ఇంద్రుడొచ్చి చేసె వందనాలు!

*... 620, 628*

ఈ విషయం భగవానునికి తెలిసి ఇలా ప్రవచించాడు–

ఊడ్చువాడు మది మకిల నూడ్చి ఊడ్చి, తపము చేసి ఆస్రవమ్ముల తగులు కొనక
దేవతల వందనమునకు తగినవాడు. పుట్టుకేదైన అసలైన భూసురుండు!

తన చిత్తాన్ని ఉద్దేశిస్తూ తాలపుత్త స్థవిరుడు పలికిన పలుకులు భిక్షువుల ఆంతరంగిక ఉన్నతికి అద్దం పడతాయి.

చిన్న ఫలము కోరి చెట్టు నరకనేల? పాడు చిత్తమింత పిచ్చిదేల?
తృష్ణ తీర్చు కొరకు తానె తగులబడు! దూరి చెడు యనిత్య ధర్మమందు!

*... 1124*

మనసు చెప్పు మాట ఒప్పుకొంటి నేను, పాడు మనసు ఇంత పిచ్చిదేల?
చెప్పినట్టు చేయ చాల జన్మలు గలిగె, కష్టపడుచు పుట్టి గిట్టు చుంటి!

*... 1129*

ఒకపరి సద్బ్రాహ్మణునిగ, ఒకపరి సుక్షత్రియునిగ, వైశ్య జనునిగా,
ఒకపరి అమరజనునిగా, ఒకపరి శూద్రునిగ జేస్తివి గదా! మనసా!

...1130

నరక కూపమందు నీవల్ల పడితిని, రాక్షసునిగ పుట్టి రగడ జేస్తి,
పశులయోనియందు పడితి నీ వల్లనే! ప్రేతమైతిని, పెనుభూతమైతిని!

...1131



సుందరి హత్య

**ఎంత వరకు పతనమొందింప చూసేవు, నాటకాలు చాలు నమ్మలేను!**

**నాగువలెను రెండు నాల్కలున్న మనసా, నీదు వశము నందు నిలువబోను!** ...1137

తన పుత్రుడు కూడా ధర్మ మార్గంలో పయనించి అర్హతుడైన సంగతి తెలిసి భరద్వాజ స్థవిరుడు సంతోషంతో–

**గుహల మారుమ్రోగు సింహ గర్జన వలె అర్హజనుల గళము గర్జ చేయు!**

**యోద్ధ గెలచి చేయు వీర నాదము వలె బోధి గళము విప్పు భయము లేక....!**

**బుద్ధ పూజ, ధర్మపూజ, సంఘపు పూజ చేయ ఆస్రవాలు చెరిగిపోవు!**

**ప్రజ్ఞలందు మది ప్రఫుల్లముగా నుండు మారసేన నంత మట్టుబెట్టి...!**

*...177, 178*

ఇందుకు భిన్నమైన మంచి సంఘటనను చూద్దాం... సానుథేరుని కోసం అతని తల్లి వెతుకుతూ వెతుకుతూ చివరకు ఎలాగో ఒక ఆరామంలో అతనిని కనుగొనడం జరిగింది.ఆమెకు దుఃఖం పొంగుకు వచ్చింది. సాను థేరుడు ఆమెను ఇలా ఓదార్చాడు...

**అమ్మా! నీ కన్నుల ఈ చెమ్మేలా? మృత్యుచిమ్మచీకటి వదలన్!**

**కమ్మగ నే బోధివెలుగు జిమ్ముచు యమృత పదమందు యిమ్ముగనుంటిన్**

**అమ్మా! యబోధిని గనిన అమ్మలు వగచును తమ తమ తనయులెమునికే**

**సొమ్మగుటచేత; బుద్ధునిసొమ్మును నేను, వగపేల? మామ్మగదమ్మా!**

*... 44*

తిష్య స్థవిరుడు మనసు మురికి వదలించుకొని పాడిన పదాలు చూడండి.

**తనువున విరిగిన అలుగును అనువుగ తొలగించు భంగి ప్రజ్ఞాబల సాధనమున తొలగించ వలెను మనమున నాటిన మలినపు ములుకులనెల్లన్!** *... 39*

## పర్వత గుహల్లో ధ్యానమగ్నులైన థేరులు :

చారిత్రక సత్యాలుగా నిలచి పోయిన బౌద్ధ గుహలు, చాలామంది భిక్షువులు గుహల్లోనే ధ్యానమాచరించారనడానికి సాక్ష్యాలు.

సంబుల థేరుడు ఒంటరిగా గుహల్లో ధ్యానం చేసే సమయంలో గల నిర్భయతాన్ని ఇలా తెలాపాడు.

**ప్రళయ మేఘ గర్జనల కుంభవర్షము కురిసె నింగినేల కలియునట్లు!**

**భయము గొల్పు గుహల, ఏకాంత తపమందు నిర్భయముగ నేను నిలిచి యుంటి....!** *... 189*

**విలయమందు కూడ నిలచియుండెను శాంతి! రోమ కోటి నిక్కబొడవ లేదు**

**కాయమందు జూడ కలత కుదుపు లేదు అంతరంగమందు భయము లేదు...!** ... 190

**కొండగుహల తపము నిండుగ చేసి నే నెప్పుడేగి సుగతు మెప్పు గొందు.**

**కనపడునదియంత కాదు నిత్యమనుచు పశ్యనెపుడు సేతు ప్రజ్ఞ తోడ!**

... 1094

## ప్రకృతి వర్ణనలు :

తమ దైనందిన సాధనలో స్థవిరులు ప్రకృతినెలా ఆస్వాదించారో ఈథేరుల గాథలను చూస్తే తెలుస్తుంది. గుంటుపల్లి, అజంతా, ఎల్లోరా గుహల చుట్టూ ఉన్న ప్రకృతి ఇప్పటికీ ఎంత మనోహరంగా ఉంటుందో చూసిన వారందరికీ తెలుసు. అప్పుడు కూడా వారు ప్రకృతిని నిరామిషంగా చూస్తూ తమ ధ్యానాలను ఎలా సఫలం చేసుకొన్నారో ఈ గాథల్లో తెలుస్తుంది.సర్పక థేరుని మాటలు వినండి.

**యేటి గట్టున అల నేరేడు చెట్లు,చూచు వారలకు ముచ్చట గొల్పుచుండె!**

**దూరమేగనేల తరులకు ఝరులకు ప్రకృతి ఒడిలోన పరము గాంచు!**

*... 309*

బౌద్ధం నిస్సారం అనేవారికి ఇది మంచి సమాధానం. థేరగాథల్లో ఎందరో స్థవిరులు ప్రకృతిని ఎంతో రమణీయంగా వర్ణించారు. అవి బౌద్ధ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. తిపిటక సాహిత్యవనంలో ఇవి వికసించిన విరులు. "ఇండియన్ లిటరేచర్" 106 వ పేజీలో వింటర్ నిట్జ వీటిని భారతీయ సాహిత్యంలోనే అమూల్య రత్నాలుగా వర్ణించాడు. పాలీ సాహిత్య వర్ణనలనే శీర్షికలో థేరగాథలకెంతో ప్రాముఖ్యాన్ని కల్పించాడు. భారతీయ పురాతన సాహిత్యంలో ప్రకృతి కోసం అన్వేషిస్తే ఒక్క వాల్మీకంలో తప్ప వీటికి ధీటుగా మరెక్కడా కన్పించదు.



ఆళవక యక్షుడు

వాల్మీకంలో కూడా వీటిలోని నిరామిషత్వం కనిపించదు. నిర్వాణం వైపుకు చేసే ప్రయాణంలో ప్రకృతినెలా ఉపయోగించు కోవాలో తెలపడం ఎక్కడా కనిపించదు. ఇంత సూక్ష్మదృష్టి ఎక్కడా కనిపించదు. ఇంత సరళతా ఉదాత్తతా ఎక్కడా లేదంటే అతిశయోక్తి గాదు.

భగవానుడు విశాలాకాశంలోనే అరణ్యంలోనే నిండు వెన్నెల్లోనే జన్మించాడు. నిండు పున్నమి లోనే బోధివృక్షపు నీడలోనే నిర్మలాకాశం క్రిందే బోధి పొందాడు. ఆయన పరి నిర్వాణం కూడా ప్రకృతి ఒడిలోనే జరిగింది. అలాగే ఆయన ఔరస పుత్రులెందరో ప్రకృతి ఒడిలోనే తపించి తమ జీవితాలను సార్థకం చేసుకొన్నారు.ప్రకృతిలోని వివిధ మార్పులు వైపరీత్యాలు, సానుకూలతలు వారి చిత్తంపై ఏ ఏ ప్రభావం చూపాయో, వారు ఎలా సమతలో ఉన్నారో మనకు ఇందులో అడుగడుగునా దర్శనమిస్తాయి.

కుంభవర్షం కురుస్తూ ఉంది. గిరిమానంద థేరుడు, సుభూతి భిక్షువు, ఎలా హర్షనాదం చేశారో చూడండి."వస్సతి దేవో యథా సుగీతం" వర్షం వాన దేవుని పాటలా ఉంది. ఎంత చక్కని అనుభూతి!

**వానదేవుని పాటలా వాన వచ్చె, ఇంటి కప్పు చెదరలేదు ఇంతకూడ!**
**వాసనల విషపు వానలు వెల్లువెత్త, చిల్లి బడని చిత్తములేల చెదరిపోవు!**
*... 325*

**చేదుకో! వానదేవుడా! చెదర బోదు గూడు పదిలమొనర్చితి ఓడులేదు!**
**బోధి ప్రజ్ఞలందు అప్రమత్తుండనైతి..! సుఖముగానుంటి ఆస్రవ ముక్తి తోడ...!**
*... 1*

చూడక, చిత్రక థేరులు నెమళ్ళను చూనస్తూ నిరామిషంగా లక్ష్యాన్ని ఎలా ఛేదించారో చూడండి.

**అల్లన వీచు సమీరుని చల్లదనమున పురివిప్పి యాడు మయూరాల్**



సుప్రియుని నింద-బ్రహ్మాదత్త మాణవుకుని ప్రశంస

**గల్లున గళమెత్తుచు కిల కిల్లాడ నిరామిషంబుగా గైకొందున్!** *... 22*
**ఇంతలేసి కళ్ళు అందమొలుకు శిఖ,మెరిసిపోవు మేలిమి మెడ**
**ముచ్చటైన పలు మయూరాలు పాడుచు అబ్బురముగనాడె మబ్బుకింద!**
**శాంతి పొంది ప్రకృతి శోభ గనుచు శుద్ధ ధర్మ మందు స్రోతనైతి!**
*... 211, 212*

సామిషంగా ఒక గృహస్థు ప్రకృతిలో పొందే ఆనందానికీ, ప్రళయంలోఅనుభూతికీ, ఒక థేరుడు నిరామిషంగా నిర్వాణ స్రోతగా పోందే ఆనందానికీ,సమతకూ ఎంత తేడా ఉందో ఈ గాథల్లో బాగా తెలుస్తుంది. సంబుల థేరుని, తాల పుత్రథేరుని అనుభూతి చూడండి.

**వనముల వసియించి వానల తడయుచు ఎప్పుడేగి సేతు తపము నేను.**

**ఋషులు మెట్టినట్టి ఋజు మార్గమిదియేను, వారు నడచు బాట వదలనేల?** *... 1104*

**విలయమందు కూడ నిలచియుండెను శాంతి! రోమ కోటి నిక్కబొడవ లేదు**

**కాయమందు జూడ కలత కుదుపు లేదు అంతరంగమందు భయము లేదు...!** *... 190*

**నదుల వర్ణన :** కాల్పనిక కావ్య ప్రపంచంలో వర్ణించ బడిన ప్రకృతి మొత్తం బుద్ధికుశలతో ఊహించి చెప్పినవే! కానీ థేరగాథల్లోని ప్రకృతి మొత్తం తాము చూస్తూ చూస్తూ అనుభూతి పొంది చెప్పినదే! సర్పక థేరుడు ప్రకృతికి అంకితమైన స్థితిని చూద్దాం!

**మెరుపులు మెరుస్తూ ఉరుములు ఉరుము చుండ కమ్ముకొచ్చెను కారు మేఘమ్ములెన్నో,**

**తెల్ల లెల్లని కొంగలు తెల్లబోయి వరదలెత్తు నదిని దాట ఎగురుచుండె!**
*... 307, 308*

**కొత్తనీట మునిగి కప్పలరచుచుండె, ఝురుల సవ్వడెంతొ సందడాయె.**
**దూరమేగనేల తరులకు ఝురులకు ప్రకృతి ఒడిలోన పరము గాంచు.**
*... 310*

**భూత స్థవిరుని అనుభూతి :**

**నింగి చిల్లి పడిన భంగి కురియ సాగె కుంభవృష్టి, ముజ్జగములు నిండ,**

**చెవులు చిల్లులు పడునట్లు మబ్బులురిమె, తపము వదలబోకు తరుణమిదియె!** *... 522*

**యేటి గట్టుమీద విరగ బూసెను చెట్లు, ఇతకన్న శోభ యెందు గనము**
**బోధి విద్యలెరిగి పశ్యనమ్ము తెలిసి తపము జేయ మంచి తరుణమిదియె!**
*... 523*

అర్ధరాత్రియందు గర్జించు మేఘాలు, కుండపోతగాను కురియసాగె
పొరుచుండె యేరు పొంగి పొంగి పొరలి తపము వదలబోకు తరుణ
మిదియె! ... 524

వర్వత శిఖవిల వర్ణన:

రాజ గృహానికి సమీపంలో ఉన్న గిరివ్రజ పర్వతారణ్యంలో విపశ్యన ధ్యానాభ్యాసం చేసి నిర్వాణ సుఖాన్ని అనుభూతి పొందిన ఏకవిహారి స్థవిరుని ప్రాకృతిక జీవనచిత్రాన్ని తిలకించండి!

బుద్ధుడు మెచ్చిన వనమిది, ఇందు ఒంటరినై విహరించెద నేను!
... 538

యోగుల తపనుకు యోగ్యమైనదట సుఖముగ నుందును
సతిప్రజ్ఞలందు! ... 539

మదగజములు తెగ మసలెడి చోటు, గంటిని అభయము ఒంటరిగానె!
... 540

పూత పిందెల తోడ శీత వనమ్ము శీతలముగ జేసె చిత్తమునెంతొ,
శీతలజలముల స్నానము జేసి ఒంటరినై విహరించెద నేను!
... 541

పూల తీగెలు ఫలవృక్షములు గనగ శీతలముగ మారె చిత్తమంత!
నిర్భయమ్ము గాను నిర్వాణము గనెద గిరి శిఖరమునెక్కి గురి చెదరక!
... 545

తాలపుత్త స్థవిరుని హృదయోల్లాసం చూద్దాం :

నెమలికూత వినుచు నే కొండ గుహల పశ్యనెప్పుడు సేతు
పదమందుకొనగ! ...1106

కోయిలమ్మ పాట,కేరింతల నెమలి కూత, చిరుత పులుల క్రూర రవము
విను నిరామిషముగా వనములందు మనసా! సామిషముగ వినగ
సారమేమి? ... 1116

వనములందు కొండ కోన తలములందు హరిణముల విహారము హాయి
గొల్ప
పశ్యనందు సమత పొందవేల మనసా! వర్షమున తపించి హర్షమొందు.
... 1138

నీలి మేలిమి మెడ, నల్లని కన్నులు చిత్ర వర్ణ గతుల శిఖలు గల్గి
ముచ్చటైన పింఛముల గుచ్ఛములు విప్పి నర్తనమ్ము జేసె నెమలి మూక
నీలి మేఘ గర్జనల తోడ గళమెత్తి పాడె నెమలి, చినుకు పడుచునుండ!
తడిసిన గిరులందు తపము సేయు మనసా! సంతసమ్ము పొందు సమత
తోడ! ... 1139

చాళ్ళు చాళ్ళుగాను సాలవృక్షంబులు సానుకూలమిచ్చె సాధనందు
ఏనుగు ఎలుగెత్తి చేయు ఘీంకారము సానుకూలమిచ్చె సాధనందు
... 1065

చల్లని సెలయేళ్ళ జలములుండెను త్రాగ సాను కూలమాయె సాధనంబు
నల్లమబ్బువచ్చి నీలగిరిని తాకె సానుకూలమాయె సాధనంబు
... 1066

గిరి శిఖరమునందు కరి సమూహము చేరె సానుకూలమాయె
సాధనంబు
కర్రి మబ్బుముంచె కరి సమూహమునెల్ల సానుకూలమాయె సాధనంబు
... 1067

మబ్బుపూల చినుకులాకాశము చిలికె, అవిసె పూలగంధమవని నిండె
కోయిలమ్మ పాడ కొండలెల్ల మురిసె సార్థకమ్ము మోక్షసాధనెల్ల
... 1069

ఋతు వర్ణన :

ప్రతి ఋతువులో వచ్చే సానుకూల ప్రతికూల పరిస్థితులను సమతతో అనుభూతి చెందుతూ సాధనలో లక్ష్యాన్ని చేరడం ఎలాగో ఈ థేరగాథలు మనకు మార్గ దర్శకమవుతాయి. వసంతంలో కుల ఉదాయి థేరుని అనుభూతి చూడండి."కాలో ఇతి పక్కాయ". కాలం పక్వమయింది, తపం చేయడానికి. చూడండి ఈ ధర్మ సంవేగాన్ని ...

లేతచిగురుల పూత పిందెల వృక్ష జాతులు మనసు దోచెను
రాగమోహపు కన్ను పడగా కోరి చెడిదెరు లోకులంతా
వెడలిపోదాం తపము సేయగ తరుణ కాలం తరుముకొచ్చెను!
... 528, 529

వనవత్స థేరుని నిరామిష ప్రజ్ఞ చూడండి!

తల్లడగు తపము సేయగ అల్లన తిరుగాడు చంద్ర భ్రమరములవిగో
చల్లని జలపాతంబులు నల్లని శిఖరము గన మది మల్లుట చేతన్!
పద పద శ్రావక పద పద మదిలాగెదు అంద చందమది మారునిదే!
చెదరక యనిత్య ప్రజ్ఞల్బదలక సంఘమును చేర వడి వడి పదవో!
... 13, 14



అంగులిమాలుడు

**రాత్రి సౌందర్యం :** భగవానుడు ప్రశాంతమైన వెన్నెలలోనే బోధి పొందాడు. ధ్యానానికి రాత్రులనే ఎక్కువగా ఎంచుకోవలసినదిగా కూడా భగవానుడు సూచించాడు. ఎందరో భిక్షువులు రాత్రులందే అర్హతులయ్యారు. సాణపోతి థేరుని అనుభూతి ...

**చుక్కలున్న చూడ చక్కని రాత్రులు పండు వెన్నెలెంతో పండుగాయె**

**పాడు నిద్ర ఏల...? పశ్యనందు నిలుపు మంచి సమయమంత మించిపోవు...!** ...193

**"నిదురించు జనులంత నిశి రాత్రులందు,**

**మేల్కొని సాధించు మేలు పశ్యనుడు"**

**"యానిశా సర్వభూతానాం, తస్యం జాగర్తి సంయమీ!"**

అనే గీతా వాక్యం దీనికి దగ్గరగా ఉండటం విశేషం!

ఈ విధంగా ప్రకృతి సౌందర్యాలను నిరామిషంగా తిలకిస్తూ, మోక్షసాధనంగా ఉపయోగిచుకోవడం మరెక్కడా చూడలేం! వాల్మీకి రామాయణంలో రమ్య రమ్య వర్ణనలెన్నియున్నా వాటిని నిరామిషంగా చూడటం జరుగ లేదు. థేరగాథల్లో ఒక నిందుదనం, ఒక ఆధ్యాత్మికతా, కనిపిస్తుంది. నిర్వాణ మార్గ నిర్దేశకత్వం కనిపిస్తుంది.

**భవతు సబ్బ మంగలం! భవతు సబ్బ మంగలం!!**

**భవతు సబ్బ మంగలం!!!**



బింబిసారుడు - పరివ్రాజక సిద్ధార్థ



కర్మకాండలను నిరసించుట

# నాగసేన - మిళింద సంవాదం

- అన్నపరెడ్డి బుద్ధఘోషుడు

**నా**గసేన అనే పేరు గల స్థవిర భిక్షువుకు, సాగల నగరాన్ని ఏలే బాక్ట్రియన్ రాజు మిళిందకు బౌద్ధ సిద్ధాంతాల మీద, వాటిపై తీర్థకులు (ఇతర మతాలవారు) చేసిన విమర్శల మీద చాల గంభీరమైన సంవాదం (debate) నడిచింది. ఇది గ్రంథస్థమైంది. ఈ గ్రంథం *మిళింద ప్రశ్నలు* పేరుతో ప్రసిద్ధమైంది. వాస్తవానికి ఇందులో మిళిందరాజు ప్రశ్న వేయడం, ఆ ప్రశ్నకు భిక్షు నాగసేన సమాధానం చెప్పడం జరిగింది. ప్రశ్నవేయడం అంత తేలిక కాదు. ప్రశ్న వేయాలంటే, విషయం మీద అధికారం ఉండాలి. అప్పుడే అతడు సమాధానం చెప్పే వాణ్ణి ముప్పుతిప్పలు పెట్టగలడు, అతని నిగ్గుతేల్చగలడు. ఇక్కడ రాజా మిళింద బౌద్ధవిషయాలలో ఆరితేరిన వాడు. పైగా తార్కికుడు, పండితుడికి అంతగట్టిగానే ప్రశ్నలు వేసి నాగసేనుని జ్ఞాన-దర్శనాన్ని (knowledge and vision) ప్రపంచానికి పరిచయం చేశాడు. అంటే నాగసేనుడూ ప్రశ్నలు వేసినవాని పూర్తిగా సంతృప్తి చెందేలా సమాధానాలు చెప్పాడు. విషయం ఇలా ఉంది గనుక ఈ గ్రంథానికి *నాగసేన -మిళింద సంవాదం* అని పేరు పెట్టి ఉండాల్సింది. కాని మన గ్రంథ కర్త కేవలం ఒక్క మిళిందుని పేరుతోనే మిళింద ప్రశ్నలు (మిళిందపఞ్హ) అని నామకరణం చేశాడు. కాని దీని కంటె భిన్నంగా చైనా అనువాదం *నాగసేన భిక్షు* సూత్ర నామాన్ని స్వీకరించింది.

ఏది ఏమైనా ఈ గ్రంథం, తిపిటక సాహిత్యం తరువాత, బుద్ధఘోషుని *విశుద్ధిమగ్గ* తరవాత అత్యంతగా ప్రాధాన్యాన్ని సంతరించుకొన్న గ్రంథం. బౌద్ధులంతా దీనిని బౌద్ధ గ్రంథాలలో తలమానికంగా చూస్తారు, గౌరవిస్తారు. బుద్ధుని పరినిర్వాణం (బి.సి.483) తరువాత 500ల సంవత్సరాలకు రూపుదిద్దుకొంది. పాళీగ్రంథాలను అత్యంత సమర్థవంతంగా అనువదించిన టి.డబ్లియు రైస్ డేవిడ్ ఈ గ్రంథాన్ని మిక్కిలిగా కొనియాడాడు : "భారతీయ వచనంలో కెల్ల *మిళింద ప్రశ్నలు* నిస్సందేహంగా అత్యుత్తమ గ్రంథం నిజంగా ఆ తరగతి గ్రంథాలలో సాహిత్య పరంగా చూస్తే సర్వోత్కృష్టమైంది-ఏ దేశ సాహిత్యంలో కంటె గూడ."

*Questions of king Milinda - Introduction.*

పాశ్చాత్య దేశాలలో Plato's Dialogues (ప్లేటో సంవాదాలు) తాత్త్విక సాహిత్యంలో ఎటువంటి స్థానం ఉందో, మిళింద ప్రశ్నలకు ప్రాచ్యదేశాల తాత్త్విక సాహిత్యంలో అంతటి స్థానం ఉందని పండితులు చెబుతారు. ప్లేటో సంవాదాలలో సోక్రటీజ్ స్థానాన్ని మిళింద ప్రశ్నలలో నాగసేన భిక్షువు ఆక్రమిస్తాడు. ఈ గ్రంథంలో ఇంతగా ప్రాముఖ్యమైంది గనుకనే, శ్రీలంక, థాయ్ బౌద్ధ తిపిటిక సాహిత్యంలో తమ *బుద్ధక నికాయ*లో చేర్చకపోయినా, బర్మా తిపిటక సాహిత్యంలో మాత్రం దీనికి *బుద్ధక నికాయ*లో చివరి గ్రంథంగా చోటు కల్పించారు.

అయితే నాగసేన-మిళింద సంవాదం ఇంత ప్రసిద్ధ గ్రంథమైనా రచయిత ఎవరో ప్రపంచానికి తెలియకుండా పోయింది. బౌద్ధతత్త్వం, మనోవిజ్ఞాన శాస్త్రం, శీలం మీద రాజా మిళింద అడిగిన అనేక ప్రశ్నలకు అత్యంత సమర్థవంతంగా సమాధానాలను చెప్పించిన గ్రంథకర్త మొట్టమొదట దీనిని బాక్ట్రియన్ గ్రీకుభాషలో రాసి ఉంటాడు. ఆ తరువాత ఇది సంస్కృతం, పాళీలలోకి అనువాదితమై ఉంటుంది.

ఈ గ్రంథ అజ్ఞాత రచయిత, ఈ గ్రంథంలో పేర్కొనబడిన, స్థల భౌగోళిక అంశాలను బట్టి, వాయవ్య భారతదేశానికి లేదా పంజాబు ప్రాంతానికి చెందిన వాడని



గాంధార నరేషుడు

భావించ బడుతోంది. అయితే రాజు మినాండర్‌గా గుర్తించిన మిళిందుని గురించి ఎక్కువే తెలుస్తుంది. ఎలాగంటే ఈ రాజు మినాండర్‌కు సంబంధించిన అనేక నాణేలు పశ్చిమాన కాబూల్‌లో, తూర్పున మధురాలో, ఉత్తరాన కాశ్మీరంలో అనేకంగా దొరికాయి. ఫ్లుటార్క్ ఇలా రాస్తున్నాడు: "మినాండర్ ధర్మపాలన చేశాడు. ప్రజల మన్ననలను ఎంతగానో పొందాడు. ఎంతగానో అంటే, ఆయన మరణానంతరం అతడి అస్థికల కోసం అనేక నగరాల వారు పోటీ పడ్డారు. చివరకు ఆ అస్థికలను పంచుకోవడానికి అంగీకారానికి రాగా ఆ తగవు సద్దుమణిగింది. ఆ తరువాత వాటిపై స్తూపాలు నిర్మించారు." మినాండర్ చారిత్రక పురుషుడనడంలో ఎవరికి ఏ సందేహం లేదు. ఎందుకంటే ఎన్నో చారిత్రకాంశాలు దానికి రుజువు పలుకుతున్నాయి. అతడు కాబూలును, హజరను, స్వాత్ లోయను పాలించాడు. దీనిని బట్టి మనకు అర్థమయ్యేది, అలెగ్జాండరు స్థాపించిన రాజ్యంలోని బాక్ట్రియాను ఇతడు గ్రీకు రాజుగా కొనసాగించాడు. బహుశ ఇతడు 150-110 బి.సి. వరకు పాలించాడు. సింధు డెల్టాను, మధురను, సౌరాష్ట్రను, సాకేతను ఆక్రమించాడు. బాక్ట్రియన్లు బౌద్ధులుగా మారారు గనుక, గ్రంథంలో సూచించిన మిళిందుడు మినాండరే అనడానికి సందేహంలేదు.

అయితే సంవాదాలు మాత్రం, ఆసక్తికరంగా ఉండడానికి రచయిత కల్పించిన సాహితీ ఉపాయం; రచయిత ముఖ్య ఉద్దేశం ఏమిటంటే బౌద్ధ సిద్ధాంతాలను వివరించి తీర్థికుల దృష్టులను పరిహరించడం.

లభించిన చారిత్రకాధారాలను బట్టి మినాండర్ బాక్ట్రియాలో పుట్టాడని, కాని కాబూల్ లోయలో పెరిగాడని, అతడు పాలన చేపట్టిన తొలిదినాలలో, తన తండ్రి తన



ఆక్రోశ భారద్వాజుడు

కిచ్చిన రాజ్యాన్ని సింధులోయకు, ఇంక ఆ పైకి విస్తరించాడని, సాగల నగరాన్ని తన రాజధానిగా చేసుకొన్నాడని గ్రహించవచ్చు. ఈ కొత్తగా కలపబడిన ప్రాంతాలు బౌద్ధం ప్రాభవంలో ఉన్నాయి. అతడు మొదట గ్రీకు సంస్కృతికి చెందిన వాడే అయినా, తరవాత బౌద్ధంతో సంబంధాలు ఏర్పరుచుకొన్నాడు. కాని *మిళిందప్రశ్నలు* గ్రంథంలో నాగసేన భిక్షువుతో సమానంగా సంవాదం నడపడానికి సరిపోయినంత బౌద్ధతత్త్వంతో పరిచయం ఉన్నదా? అతడికి బౌద్ధం మీద అంతలోతైన జ్ఞానం లేకపోయినా, రచయితకు అంతటి జ్ఞానం ఉంది కనుక, తను చెప్పదలుచుకొన్నవన్నీ అతని నోట పలికించాడు.

ఒక ప్రాక్కల్పన ప్రకారం మనరచయితకు మినాండర్‌తో అతి క్లుప్తంగా పరిచయం ఉందని, ఆ తరువాత బహుశ అతడు మౌఖిక సంప్రదాయం (oral tradition) గా వస్తున్న సంవాదాన్ని మన రచయిత పెంచి పెద్దది చేసి, దాని నిండా గాఢ బౌద్ధ జ్ఞానాన్ని కూరి ఇప్పుడు మనకందిన రీతిలో పరిణతి చెందించాడు. గ్రీకు రాజును సంతృప్తం చేయడానికి అతనిని ఈ సంవాదాలకు కేంద్రబిందువు చేశాడు. ఈ గ్రంథం చైనా అనువాదాలను చూస్తుంటే పై ప్రాక్కల్పనకు కొంత బలం చేకూరుతోంది.

మన రచయిత మిళింద ప్రశ్నలను అసలు మొదట సంస్కృత భాషలో రాసినట్లుగా కనిపిస్తున్నది. ఎందుకని అంటే చైనా అనువాదాలు సంస్కృతం నుంచి చేసినట్లు తెలుస్తుంది. ఎలాగంటే 1860ల్లో వి. ట్రెన్క్‌నర్ పాళీ పాఠాన్ని రోమన్ లిపిలోకి పరివర్తితం చేసినప్పుడు, మిళింద ప్రశ్నల మూలం సంస్కృతంలో ఉందనే నిర్ణయానికి వచ్చాడు. అతడు ఈ నిర్ణయానికి రావడానికి దోహదం చేసిన అంశం: సంస్కృత మిళింద ప్రశ్నలు "తమ్ యథానుసుయతా", (ఈ విధంగా అది దత్తమైంది) అనే వాక్యంతో ఆరంభమైతే, పాళీ మిళింద ప్రశ్నలు – "చేవమ్ మే సుతమ్" (నేను ఈ విధంగా విన్నాను) అనేక వాక్యంతో ఆరంభం కావడం. ఈ తేడాను చైనా అనువాదాలు స్పష్ట పరిచాయి. బహుశా ఈ రెండు సంస్కృత, *పాళీ, మిళింద ప్రశ్నలు* రెండు గ్రంథాలు అంతకు ముందర ఉన్న ఒకే మూలం నుంచి వచ్చి ఉండవచ్చు. ఆ భాష ఏదైనా కావచ్చు.

*పాళీ* గ్రంథంలో- 1. పూర్వయోగం (నాగసేన, మిళిందుల పూర్వజన్మ చరిత్ర), 2. *మిళింద ప్రశ్నలు*, 3. *లక్షణ ప్రశ్నలు* (వేరు చేసి చూపే లక్షణాలకు

సంబంధించిన ప్రశ్నలు), 4. మేణ్డక (ఉభయ కోటిక) ప్రశ్నలు, 5. అనుమాన (inference ) ప్రశ్నలు, 6. ఓపమ్మ కథా (ఉపమాన కథా) ప్రశ్నలు-అనే ఆరువిభాగాలుంటే చైనా అనువాదంలో మొదటి మూడు విభాగాలు మాత్రమే ఉన్నాయి.

పాళీగ్రంథం మిళిందుని కేంద్రకం చేసుకొంటే చైనా గ్రంథం నాగసేనుని ఆస్థానంలో నిలిపింది. పాళీగ్రంథం మిళింద ప్రశ్నలైతే చైనా గ్రంథం నాగసేన భిక్షు సూత్రమైంది.

ఇద్దరి పూర్వ జన్మకథలు పాళీ గ్రంథంలో కంటె చైనా అనువాదంలో భిన్నంగా ఉన్నాయి. అలాగే *అభిదమ్మ పదం* పాళీగ్రంథంలో కనిపిస్తుంది. కాని చైనా అనువాదంలో అది కానరాదు. ఇంకా చాల తేడాలు రెండు గ్రంథాల మధ్య కనిపిస్తాయి.

ఈ రెండు గ్రంథాలు ఒకే మూల గ్రంథం - అది సంస్కృత గ్రంథం నుంచి వచ్చినా, ఈ రెండింటిలో ఏది అధికారికం అని అంత తేలికగా నిర్ణయించలేం. సంస్కృత మూలం మీద ఆధారపడిన చైనా అనువాదంలో-అభిధమ్మ, వినయ, సుత్తలాంటి పదాలు కనిపించక పోవడంలో, ఆ సంస్కృత మూలం, సుత్త, వినయ, అభిధమ్మలు బౌద్ధ సాహిత్యం స్పష్టంగా విభాజితమైన మూడో సంగీతి తరువాత నిరూపితమైనదిగా భావించవచ్చు. అయితే రాజు మినాండర్ ఈ సంగీతి తరువాత 100 సంవత్సరాలకు గాని జనించలేదు. అందుకని మూల సంస్కృత గ్రంథం బి.సి. ఒకటో శతాబ్దికి ముందరిది కావడానికి వీలులేదు. మరి అనువాదాలు 400 ఎ.డి. లో వెలువడే నాటికి ఎంతో కాలం గడించింది. ఇంతకాలంలో దానిలో అనేక మార్పులు, చేర్పులు, ప్రక్షిప్తాలు చోటు చేసుకొని ఉండవచ్చు. ఏది ఏమైనా నాగసేన-మిళింద సంవాద రచన బుద్ధుని నిర్వాణానంతరం 500 సంవత్సరాలకు జరిగింది. దానికి ఒక వంద యేండ్లు ముందు మినాండర్ జీవించాడు. బహుశా ఇతడు మరణించిన కొంతకాలానికి, మౌఖిక సంప్రదాయం ఆధారంగా వచ్చిన మిళింద ప్రశ్నల ఆధారంగా సంస్కృత గ్రంథం రచితమైందని భావించ వచ్చు.

*నాగసేన-మిళింద సంవాదం* (మిళింద ప్రశ్నలు) లో ఆరు విభాగాలు, ఇరవై రెండు ప్రకరణాలు, రెండు వందల అరవై రెండు ప్రశ్నలు ఉన్నాయి. ఇంక నలభై రెండు ప్రశ్నలు లభించ లేదని తెలుస్తుంది. వాటితో కలిపి, మూడువందల నాలుగు ప్రశ్నలు అవుతాయి. అయితే ఈ లభించకుండ పోయినవి నలభై రెండు అని ఎలా నిర్ధారించారో తెలియదు. అంతటి ప్రాచీన గ్రంథం, లిఖిత సంప్రదాయం లేని కాలానికి చెందినది, రకరకాల పాఠాలలో లభించడంతో, అటువంటి తేడాలుండడం సహజమే. ప్రస్తుతం మాత్రం రెండు వందల ముప్ఫై ఏడు ప్రశ్నలు మాత్రమే ఉన్నాయి.

రాజు మిళిందునికి, భిక్షు నాగసేనునికి మధ్య జరిగిన ప్రశ్నోత్తరాలు, మొదటి విభాగమైన పూర్వయోగాన్ని వదిలివేస్తే, మిగతా ఐదు విభాగాలలో ఉన్నాయి. ఏ సమాధానాలను ఆశించి మేణ్డక (ఉభయ కోటిక) ప్రశ్నలు తయారు చేయబడ్డాయో, నిజంగా ఆ సమాధానాలు ఈ గ్రంథంలో ముఖ్యమైనవి. బౌద్ధ తత్త్వం వీటిలో కూర బడింది. వాస్తవానికి ఈ ప్రశ్నలు రాజు మిళిందుడు అడిగినవీకావు, సమాధానాలు నాగసేనుడు చెప్పినవీకావు. ఈ గ్రంథంలో మిళిందుని మీద, నాగసేనుని మీద కురిపించిన ప్రశంసల జల్లులు, నిజంగా వారి పై కురిపించిన జల్లులు కావు. అవి గ్రంథాన్ని ఆకాశాని కెత్తడానికి కని పన్నిన పన్నుగడ. ఈ విషయాన్ని గ్రహించిన పాఠకుడు గూడ ఆ ప్రశంసలు నిజంగా వారిపై కురిపించినవే అనే భ్రమలో పడతాడు. అది రచయిత అద్భుత సృష్టి.

మచ్చుకు ఒకటి రెండు మేణ్డక ప్రశ్నలను సమాధానాలను ఇక్కడ ఇస్తాను. అయితే ముందుగా మేణ్డక ప్రశ్నల స్వభావ, రీతులను గురించి రెండు ముక్కలు చెబుతాను.

మేణ్డక ప్రశ్నను ఆంగ్లంలో dilemma అంటారు. 'మేణ్డ' అనే పాళీ పదానికి అర్థం గొర్రె పొట్టేలు. దీనికి బలమైన కత్తుల లాంటి రెండు కొమ్ములుంటాయి. మనం



దాసి ఖుజ్జుత్తర

ఆ రెండు కొమ్ములలో ఏ కొమ్ము తగిలినా, గుచ్చు కొన్నా ప్రమాదమే. అలాగే ఈ మేణ్డక ప్రశ్నకు, గొర్రె రెండు కొమ్ములులా - రెండు సమాధానాలు ఉంటాయి. రెండు సమాధానాలలో దేనినీ అంగీకరించలేం. దేనిని అంగీకరించినా ఇబ్బంది కరస్థితిలో పడతాడు. దీనినే పాళీలో ఉభయకోటిక ప్రశ్నలు అని, సంస్కృతం ఉభయ సంభవ ప్రశ్న అని అంటారు. రెండు కొమ్ములను రెండు వికల్పికలు అంటారు. ఇటువంటి ప్రశ్నలు వేసేవాడికి బాగానే ఉంటాయి కాని, ఏ సమాధానం చెప్పినా, అది చెప్పిన వాని మెడకే చుట్టుకొంటుంది. ఏ సమాధానం చెప్పినా అతనికి చేదు అనుభవమే ఎదురవుతుంది - దీని నుంచి బయట పడడానికి రెండు కొమ్ముల మధ్య నుంచి దూరి పోవాలి. ఉదాహరణకు ఈ ప్రశ్న చూడండి: "నీ తల్లిని కొట్టడం మానావా, లేదా - చెప్పు. 'మానాను', అని సమాధానం చెబితే అంతకు ముందు వరకు కొడుతున్నట్లే; 'లేదు' అని సమాధానం చెబితే, ఇంకా కొడుతున్నట్లే.

మేణ్డక ప్రశ్నల నుంచి ఒక ఉదాహరణ: స్థల విస్తర భీతివలన కేవలం ప్రశ్న మాత్రమే ఇస్తాను.

"భన్తే నాగసేనా, ఈ తీర్థికులు (ఇతర మత శాఖాధిపతులు) ఇలా అంటున్నారు: 'బుద్ధుడు గనుక పూజలు అంగీకరిస్తే, అతడు పరి నిర్వాణం చెందినట్లు కాదు. అతడు ఇంకా ప్రపంచానికి బంధితుడయ్యే ఉన్నాడు, ఈ ప్రపంచంలోనే ఉన్నాడు, లోకసాధారణుడే. అందుకని అతనికి చేసిన పూజలన్నీ వ్యర్థాలు, నిష్ఫలాలే. అంతిమ నిర్వాణం పొందిన వాడు దేనిని అంగీకరించడు. అంగీకరించని వానికి చేసే పూజలు వ్యర్థాలు : ఇది ఉభయ కోటక (మేణ్డక) ప్రశ్న. దీనికి సమాధానం చెప్పండి.

ఈ వ్యాస కర్త నాగసేన- మిళింద సంవాదం పేరుతో గ్రంథాన్ని యథామూలంగా అనువాదం చేస్తున్నారు.

అన్నపరెడ్డి బుద్ధఘోషుడు,
మహాబోధి, తెనాలి.
ఫోన్ : 9441274960



కిసా గోతమీ



ఉత్తమ బ్రాహ్మణుడు సునీతుడు

# మార్గదర్శి

- గువ్వల కోటయ్య

**నేను** ఎవర్ని? ఎందుకు పుట్టాను? ఎందుకు జీవిస్తున్నాను? ఎందుకు చనిపోతున్నాను? నా జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి ఏమి చేయాలి ఎలా చేయాలని దప్పికయిన జంతువు నీటి కోసం, ఆకలయిన పక్షి ఆహారం కోసం, వ్యాధి వలన బాధపడుతున్న రోగి వైద్యుని కోసం వెతుకుతున్నట్లు ఆసక్తితో అన్వేషిస్తున్నాను. మంచి ఆలోచన మంచి మార్గం చూపుతుంది. మంచి మార్గం మంచి లక్ష్యం చేరుస్తుంది. లక్ష్యంలేని జీవితం చుక్కాని లేని నావ వంటిది. "కొన్ని సంవత్సరాల క్రితం నేను పుట్టలేదు. అప్పుడు నా ఉనికిని గురించి ఎవరికి ఏమి తెలియదు. ఇప్పుడు ఒక ఆకారం రంగు రూపు కలిగి ఉన్నాను. పుట్టినప్పుడు నా పుట్టుక గురించి కొద్దిమంది బంధు మిత్రులకు మాత్రమే తెలుసు. తమలోకి ఒక కొత్త వ్యక్తి వచ్చి చేరినందుకు కొందరు సంతోషంతో స్వాగతం పలికారు. కాని నేను మాత్రం ఈ ఈర్ష్య వివాదాలు, ద్వేషం, పగతో రగులుతున్న లోకంలో అడుగుపెట్టానని బాధతో కంటతడి పెట్టాను. కొంతకాలం జీవించి కొన్ని పనులుచేసి నేను చనిపోతాను.

ఈ వివాదాల లోకం వదలి వెళ్లినందుకు నేను సంతోషిస్తాను. కాని ఒక మనసున్న మనిషి మనకు కనిపించని, కలుసుకోవడానికి వీలుపడని దూరతీరాలు చేరాడని కొంతమంది బాధపడతారు. కంటతడి పెడతారు". అలా అందరివాడుగా జీవించడమే జన్మ సార్థకత అంటే. ఈ భూమిపై పుట్టిన ప్రతిజీవి కొంతకాలం జీవిస్తుంది, పెరుగుతుంది, తన సంతతిని వృద్ధి చేసుకొంటుంది, క్షీణిస్తుంది, చనిపోతుందని బుద్ధుడు ఏనాడో చెప్పాడు.

అన్ని జీవుల్లా పుట్టి, తిని, నిద్రపోయి చనిపోతే మనుషులకు ఇతర జంతువులకు తేడా ఏమి ఉండదు. మనిషిని ఇతర జంతువుల నుండి వేరు చేసేది ఆలోచన. మనిషి ఆలోచనలు చాలా శక్తివంతమైనవి. ఈనాడు ఆధునిక మానవులు ఉపయోగిస్తున్న పరికరాలన్ని మనిషి తన ఆలోచనలను అమలు జరుపుట ద్వారా తయారు చేయబడినవే. ఈ ఆలోచనలే మనుషులను ఇతర జంతువుల నుండి వేరు పరచినవి. వీటివలనే విజ్ఞానం వివేకం అభివృద్ధి చేసుకొన్నారు. ఇటువంటి మానవ సమూహంలో నేను ఒకడిని. ఈ లోకంలో కొంతకాలం జీవించి కొన్ని పనులు చేసి మరణిస్తాను. నా మరణానంతరం ఏమి జరుగుతుందో ఎవరికి తెలియదు. మనలో కొందరు వూహిస్తున్నట్లు స్వర్గ నరకాలు ఉన్నవో లేవో ఎవరికి తెలియదు. మన జీవితం మాత్రం ఉంది. అందువలన దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. పొద్దు కుంకక ముందే పనులు ముగించుకోవాలి. ఈ శరీరంలో శక్తి మనసులో యుక్తి ఉన్నప్పుడే చేయదలచిన పనులు చేయాలి. జరిగిన కాలం, తరిగిన వయసు తిరిగిరావు. రోజు గడిచేకొద్ది మృత్యువుకు దగ్గరవుతున్నామను సత్యాన్ని తెలుసుకోండి. జీవితంలో సగభాగం నిద్రకు పోతుంది. మిగిలిన సగ భాగంలో కొంత సమయం చిన్నతనంలో తల్లిదండ్రుల సంరక్షణలో వుంటాం. వృద్ధాప్యంలో కొంతకాలం బిడ్డల సంరక్షణలో వుంటాం. వృద్ధాప్యంలో ఏవో చేయాలను తలంపులు ఉన్నా శరీరం అందుకు అనుమతించదు. రోగం ముదిరిన తరువాత తన వద్దకు వచ్చిన రోగిని చూసి నిస్సహాయంగా నిలబడిన వైద్యునిలా చూస్తూ ఉండిపోతాం. యుక్త వయసులో ఉన్నవారు మాత్రం శక్తి యుక్తి కలిగి స్వతంత్ర నిర్ణయాలు తీసుకొని చేయదలచిన పనులు చేయగలరు. ఆ సమయంలోను చిత్తశుద్ధి లేనివారి బ్రతుకే శూన్యం. ప్రస్తుతం నేను ఇక్కడ ఇలా ఉన్నాను. ఈ స్థలంలో ఒక ఇంటిని నిర్మించుకోవాలని నిర్ణయించు కొన్నాను. ఈ స్థలంలో నాకు ముందు ఎవరున్నారో నాకు తెలియదు. నా అనంతరం ప్రస్తుతం నేను నిర్మించాలను కొంటున్న ఇంటిని ఎవరు స్వాధీనం చేసుకొని నివసిస్తారో నేను



సోణదండుని బోధనలు

వూహించలేను. ఈ ఇంటిని నిర్మించడానికి అవసరమైన ఇనుము, ఇటుక, ఇసుక, సిమెంటు వంటి పదార్థాలను వేరువేరు ప్రాంతాల నుండి సేకరించుకొన్నాను. నిర్మాణానంతరం మరణించు వరకు ఈ ఇంటిలో నివాసం ఉండాలని తలంచుచున్నాను.

ఈ సృష్టిలో ప్రతిజీవి ఇక్కడ పుడుతుంది ఇక్కడే చనిపోతుంది. ఎక్కడ నుండి వచ్చిందో తిరిగి అక్కడికే వెలుతుంది. ఒక చెట్టుకు చాలా కాయలు కాసినవి. అందులో కొన్ని పిందెలుగా రాలిపోయినవి. కొన్ని చీడవలన రాలిపోయినవి. కొన్ని బాటసారుల రాతి దెబ్బలకు రాలిపోయినవి. చివరకు కొన్ని మాత్రమే వాటి నిర్ణీత సమయం వరకు చెట్టున వుండి పండి రాలి పడిపోయినవి. అలాగే మనుషుల్లో కొందరు పుట్టగానే చనిపోతున్నారు. కొందరు వ్యాధుల వలన చనిపోతున్నారు. కొందరు ప్రకృతి ప్రళయాలు, వరదలు, భూకంపాల వలన చనిపోతున్నారు. కొందరు వివాదాలు యుద్ధాలు ప్రమాదాల వలన చనిపోతున్నారు. చివరకు కొద్దిమంది మాత్రం చెట్టున పండి రాలి పడిపోయిన పండులా సంపూర్ణ జీవితం అనుభవించి చనిపోతున్నారు. ఇక్కడ పుట్టిన ప్రతిజీవి ఇక్కడ పదార్థాలను తిని జీవించి ఇక్కడే చనిపోతుంది.

మనం జీవించడానికి కావలసిన ప్రాథమిక అవసరాలైన గాలి, నీరు, ఆహారం ప్రకృతిలోనే లభిస్తున్నవి. మొక్కలు స్వయం పోషకాలు మిగిలిన జీవులన్ని వాటిపై ఆధారపడి జీవస్తున్నవి. మొక్కల ఆకులు, పూవులు, కాయలు, పండ్లు, దుంపలు వంటివి తిని మనుషులు, శాఖాహార జంతువులు, పక్షులు జీవిస్తున్నవి. ఈ శాఖాహార జంతువులను తిని మాంసాహార జంతువులు జీవిస్తున్నవి. ఇలా ప్రకృతిలోని జీవులన్నీ ఒకదానికొకటి సహకరించుకొంటు, సంహరించుకొంటు జీవిస్తున్నవి. చెట్లు, జంతువులు, జీవించి చనిపోయి, ప్రత్యక్షంగా పరోక్షంగా మన మనుగడకు అభివృద్ధికి ఎంతగానో సహకరిస్తున్నవి. అటువంటి ప్రకృతి కోసం, ఇతర జీవులకోసం విజ్ఞానవంతులు వివేకవంతులైన మనం ఏమి చేస్తున్నాం ఎంత చేస్తున్నా ఒక్కసారి ఆగి ఆలోచించండి. ఒకటి లేకుండ మరొకటి మనుగడ సాగించలేదను సత్యాన్ని ముందుగానే గ్రహించిన బుద్ధుడు ప్రతి జీవిని ప్రేమించమన్నాడు. ఏ జీవినీ, ఏ రూపంలో బాధపెట్టుట హింసించుట చేయవద్దని మానవులకు బోధించాడు.



పటాచార

ఈ విశాల ప్రపంచంలోకి ప్రతి మనిషి ప్రతిజీవి వస్తారు కొంతకాలం జీవిస్తారు. తిరిగి వెళ్లిపోతారు. కొన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు చెపుతున్నట్లు పాపుల కొరకు నరకం, పుణ్యాత్ముల కొరకు స్వర్గం. పాపులు పుణ్యాత్ములు కలసి జీవించు ప్రయోగశాలల వంటిది భూమి. ఇక్కడ మన మజిలి తాత్కాలికం. ఒక బండికి కట్టిన ఎద్దుల కాలి అడుగు జాడల్లో బండి చక్రాలు కదలిపోతున్నట్లు మనం జీవించియుండగా చేసిన పనుల ఫలితాలు మాత్రం తీపి గురుతుల్లా ఇక్కడ వదలి వెళతాం. మంచికోసం మార్పుకోసం జీవించి మరణించినవారు చిరంజీవులుగా మారతారు. వారి చరిత్ర, రచనలు, పనులు సజీవాలై నిత్యం కదులుతూ కొందరిని కదిలిస్తూ ఉత్సాహం ఉత్తేజం నింపుతుంటాయి. మనలో ఎక్కువమంది ప్రతి మనిషి తాను పుట్టేటప్పుడు ఏమి తీసుకురాలేదని, పోయేటప్పుడు ఏమి తీసుకుపోమను సత్యాన్ని ఏదో ఒక సందర్భంలో అంగీకరిస్తున్నారు. కాని నిజ జీవితంలో అందుకు పూర్తి భిన్నంగా జీవిస్తున్నారు. వారు అందమైనవి, విలువైనవి, ఉన్నతమైనవి అనుకొంటున్నవన్నీ తమకే కావాలని ఆరాటపడుతున్నారు, పోరాటం చేస్తున్నారు, వాటిని పొందడానికి ఎంతటి హింస, దౌర్జన్యాలకైనా వెనుకాడుట లేదు. మరణానంతరం నీ వెంటరాని వాటి కొరకు పోరాడుతూ జీవించిన మానవులను, ఇతర జీవులను హింసించుట దూషించుట ద్వేషించుట ఎందుకని బుద్ధుడు ప్రశ్నించాడు. ఇలా మానవులు భ్రమల వలయాల్లో చిక్కుకొంటున్నారు. నేరస్తులు తప్పించుకొని పారిపోకుండ కాళ్లకు, చేతులకు ఇనుప సంకెళ్లు వేస్తారు. ఇవి నిజమైన సంకెళ్లు కాదు. ఒకరు వేసినవి. ఒకరు తీసివేస్తే తొలగిపోతాయి. కాని మన మనసుకు మనం వేసుకొనునవి నిజమైన సంకెళ్లు. కొన్ని సంకుచిత బంధనాల్లో మనసును

బంధించు కొంటున్నాం. ఈ భ్రమల బంధనాల నుండి బయటపడలేక రంగులరాట్నం ఎక్కిన వ్యక్తులు తమ చుట్టూ తాము అక్కడక్కడే తిరుగుతున్నట్లు తిరుగుతున్నాం. ఈ బంధనాలు ఒకరు వేసినవి కాదు. ఒకరు వచ్చి తొలగించలేరు. ఎవరికి వారు తొలగించుకొని బయట పడవలసిందే. అలా బయటపడిన వారు మాత్రమే సత్యాన్ని సత్యంగా అసత్యాన్ని అసత్యంగా చూడగలరు.

చీకటిలో ఉన్నవారు వెలుతురుకోసం వెదకుతుంటారు, ఎదురు చూస్తుంటారు. జబ్బుతో బాధపడుతున్న రోగి డాక్టరు కోసం వెదకుతాడు. మనలో ప్రతి ఒక్కరు వారి సమస్యలకు పరిష్కారం కావాలని కోరుకుంటారు. హింస, వివాదాలు చీకటి వంటి బాధను కలిగించు భావనల్లో ఎవరూ ఎక్కువ సమయం గడపలేరు. శాంతి, సంతోషం, వెలుతురు వంటి మనసుకు ఆనందం ఆహ్లాదకరమైన పరిస్థితుల్లో ఎంత సమయమైనా గడపగలం. ఇది మానవ సహజనైజం. మనం ఎంత చదివినా, ఏ వృత్తిని స్వీకరించినా, ఎన్ని పదవులు పొందినా చివరకు కోరుకొనేది శాంతి, సంతోషం. అవి లేని జీవితం అడవి కాచిన వెన్నెల వంటిది. అన్నీ ఉన్నా అవి లేని జీవితం వ్యర్థం. శాంతం మనిషి స్వాభావిక లక్షణం. బుద్ధునికి ముందున్న వేదాంతులందరు మానవులను వికృతంగా మారుస్తున్న దుష్టతలంపులను అదుపు చేయుటకు సరైన మార్గాలు తెలుసుకోలేకపోయారు. ఒక విష వృక్షాన్ని చంపి దాని బారిన పడకుండా మానవజాతిని కాపాడాలని తలంచారు. ఆ చెట్టు ఆకులు కొమ్మలు నరికివేస్తున్నారు. అది కొంత కాలానికి చిగురించి మరలా పెరుగుతుంది. కాని బుద్ధుడు మాత్రమే దానిని కూకటివేళ్లతో పెరికిన తిరిగి పుట్టదని తెలుసుకొన్నాడు. అలా మానవజాతి ఎదుర్కొంటున్న ప్రతి సమస్యను శాస్త్రీయంగా పరిశోధించి తర్కించి మూల కారణాలు తెలుసుకొన్నాడు. ఆ సమస్యలకు చక్కని పరిష్కార మార్గాలు కనుగొన్నాడు. కొన్ని ప్రాణ రక్షణ మందులు చేదుగా ఉంటాయి. తీసుకొనునప్పుడు బాధ కలుగుతుంది, అయినా బలవంతంగా తాగిస్తాం. ఎందుకని వాటి వలన మన శారీరక బాధలు తొలగించబడతాయి. ఆరోగ్యంగా జీవించగలుగుతాం. ఎంత అందంగా ఆకర్షణగా ఉన్నా విషసర్పం దగ్గరకు వెళ్లం. ఎందుకని, అది కరిస్తే చనిపోతాం. అలానే మన దైనందిన జీవితంలో మంచి మార్గాలన్ని మొదట కష్టంగానే మొదలవుతాయి. వాటిని దాటి వెళ్లినవారు తీపి ఫలితాలను పొందగలరు. చెడు మార్గాలన్నీ మొదట సరళంగా సంతోషంగా మొదలవుతాయి. వాటి ఫలితాలు చేదుగా బాధగా ఉంటాయి. అందువలన వివేకవంతులు కష్టమైనా, నష్టమైనా మంచిపనులు చేయాలి. తాత్కాలిక లాభం, సంతోషం కోసం చెడుమార్గాలు అనుసరిస్తే వాటి బాధాకర ఫలితాలు జీవితాంతం అనుభవించవలసి ఉంటుంది. అందువలన వివేకవంతులైన మనుషులు కొన్ని పనులు తప్పక చేయాలి. కొన్నింటిని ఎట్టి పరిస్థితుల్లో చేయకూడదు. అడవిలోకి వెళితే క్రూరమృగాలు దాడి చేస్తాయి. పుట్టలు గుట్టలు ఉన్న చోటుకు వెళితే విషసర్పాలు కాటు వేస్తాయి. మన పరిధిలో మనం ఉంటే అవి మనపై దాడి చేయలేవు. ఇలా ప్రతి మనిషి తన దైనందిన జీవితంలో ఎక్కడకు వెళ్లాలి, ఎక్కడకు వెళ్లకూడదు, ఎప్పుడు మాట్లాడాలి, ఎప్పుడు వినాలి, ఎవరితో స్నేహం చేయాలి, ఏ పదార్థాలను తినాలి వంటి అనేక అంశాలను బుద్ధుడు వివిధ సందర్భాల్లో చక్కగా వివరించాడు. మానవుడి సంపూర్ణ వికాసానికి అవసరమైన అన్ని అంశాలను శిష్యులతో చక్కగా చర్చించాడు.

బుద్ధుడు మానవజాతికి మార్గదర్శి. తనకు ముందు ఎవరు తెలుసుకోని సత్యాలు తెలుసుకొన్నాడు. చేయని పనులు చేశాడు. బోధించని ధర్మాలు బోధించాడు అదే ఆయన ప్రత్యేకత. వెలుగుతున్న కొవ్వొత్తి, తాను కాలుతూ కరుగుతూ చీకటిలో ఉన్నవారికి దారి చూపినట్లు, మానవజాతి కోసం ఆయన తన జీవితాన్ని కొవ్వొత్తిలా మార్చుకొన్నాడు. మన ఒంటి నిండా మురికి ఉంది. మనకు దగ్గర్లో మంచి నీరున్న ఏరు పారుతుంది. మనలో కొందరు ఆ ఏరు దగ్గరకు వెళ్లి అందులో దిగి వారి వంటిపై ఉన్న బురదను నీటితో శుభ్రం చేసుకొని ఆనందంగా ఆరోగ్యంగా జీవిస్తున్నారు. ఆ ఏరు అక్కడ ఉందని అందులో శుభ్రమైన



నిత్య సంతోషి తథాగతుడు

నీరు పారుతుందని మనకు తెలుసు. మరి తెలిసి ఆ నీటితో మన శరీరంపై ఉన్న బురదను కడుగుకొనకుంటే అది మన దోషం గాని ఏరు దోషం కాదుకదా! అలాగే మానవు లందరు శాంతి, సంతోషం, సహకారం, సామరస్యంగా జీవించాలని బుద్ధుని ఆశ, ఆశయం. మానవులందరు అలా జీవించడానికి అవసరమైన సత్యాలను తెలుసుకొన్నాడు. ధర్మాలను బోధించాడు. ఉన్నవాటిని గురించి తెలుసుకొని అనుసరించి ఆచరించి మన జీవితాలను శాంతి సంతోషాల నిలయంగా మార్చుకోకుంటే అది మన దోషం గాని బౌద్ధం దోషం కాదుగదా!

మంచిగాని చెడుగాని మన అనుమతి ఆహ్వానం లేకుండ మన మనసులో ఆశ్రయం పొందలేవు. సామాన్యులు ఒక చెట్టుకు ఉన్న ఆకులు, పూవులు, కాయలు, పండ్లు, కొమ్మలు, కాండం వంటి భాగాలను చూడగలరు కాని భూమి లోతుల్లో విస్తరించిన చెట్టు వేళ్ళను చూడలేరు. కాని జ్ఞానులు వారి దూరదృష్టితో సామాన్యులకు కనిపించని వాటిని చూడగలరు, తెలియని వాటిని తెలుసుకోగలరు. బుద్ధుడు మానవులు ఎదుర్కొంటున్న ప్రతి ప్రధాన సమస్యను లోతుగా అధ్యయనం చేశాడు. చక్కని పరిష్కార మార్గాలు తెలుసుకొన్నాడు. ఆయన బోధించిన ధర్మసూత్రాలు అంత శాస్త్రీయమైనవి గనుకనే నాటి నుండి నేటికి, మరెప్పటికీ సజీవాలే. మనసుకు బలాన్నిచ్చు టానిక్కులా పని చేస్తున్నాయి. ప్రతిరోజు వేలు, లక్షలు, కోట్ల మందిని ఉత్సాహం ఉత్తేజంతో ముందుకు నడిపిస్తున్నాయి. ఆనాడు బుద్ధుడు బోధించిన ధర్మ సూత్రాలు సూర్యకిరణాల్లా భూమంతా విస్తరించినవి. తన బోధనలు ఇంత మందిని ఇంతకాలం ఆలోచింప జేస్తాయని, మానవుల జీవితాల్లో విప్లవాత్మక మార్పుకు మంచికి బీజాలు నాటుతాయని, వాటి ఫలితాలు



అర్హంతుని సహిష్ణుతా భావం

ప్రపంచ గమనాన్ని మార్చివేస్తాయని ఆనాడు మహనీయుడు బుద్ధుడు వూహించి వుండకపోవచ్చు. సూర్యుడు ఉదయిస్తున్నానని, గాలి వీస్తున్నానని ఎప్పుడు ఎవరితో చెప్పుకోవు. అయినా వాటి ఉనికి అందరు అంగీకరిస్తారు. అలానే బుద్ధుని బోధనలు సార్వజనీనాలు, నిత్యసత్యాలు వంటివి.

ఈనాడు ఎక్కడ చూసినా హింస, దౌర్జన్యం, దోపిడి విలయతాండవం చేస్తున్నవి. ఇనుముకు పట్టిన తుప్పు ఇనుముని తినివేసినట్లు మానవుల కోరికలు మనుషులను ప్రమాదపుటంచులకు చేరుస్తున్నవి. అదుపు తప్పిన కోరికలు అన్ని అనర్థాలకు మూలం. మనం వేటిని సుఖాలు అనుకొని వాటివెంట బ్రేకుల్లేని కారులా పరుగులు తీస్తున్నామో అవన్నీ చివరకు మనల్ని బాధలు దుఃఖం అను మజిలీకి చేరుస్తాయి. ఆధునిక మానవులు వారి అవసరాల కోసం, ఆనందం కోసం, కొన్ని యంత్ర పరికరాలు ఎలక్ట్రానిక్ పరికరాలు తయారు చేసుకొన్నారు. మనం ఎంత ఎక్కువగా ఈ పరికరాలపై ఆధారపడితే ఆ మేరకు మానవ సంబంధాలు కోల్పోతాము. జీవితం యాంత్రికంగా మారుతుంది. ఈ పరికరాలన్నీ ఉన్నవని నేటికీ తెలియకుండ చాలామంది సంతోషంగా ప్రశాంతంగా జీవిస్తున్నారు. ఇటువంటి పరికరాలను చాలానే ఉపయోగిస్తున్న వారు సంతోషం ప్రశాంతతకు ఆమడ దూరంలో ఉన్నారు. వీరు ప్రశాంతతను కోరుతూ అరణ్యాలు, ఆశ్రమాల వెంట తిరుగుతున్నారు. మనం ఏ పరికరాలు శాంతి, సంతోషం, సౌకర్యాలను అందిస్తాయని నమ్ముతున్నామో చివరికి వాటివలనే మన ప్రశాంతత సంతోషాలకు ప్రమాదమని అంగీకరించక తప్పదు. సాంకేతిక పరిజ్ఞానం మానవ సంబంధాలను అభివృద్ధిని పెంచేవిగా వుండాలిగాని తుంచేవిగా మారరాదు.

మనం చేస్తున్న పనులకు ఆలోచనలు మూలం. ఆలోచనలకు భౌతికరూపం లేదు. ఆలోచనలు ఆలోచనలుగా ఉన్నంతవరకు భౌతికరూపం సంతరించుకోవు. అమలు జరవడానికి ప్రయత్నించినప్పుడు భౌతికరూపం సంతరించుకొంటాయి. ప్రతి మనిషిలో లెక్కకు మించి మంచి ఆలోచనలు ఉంటాయి. వాటిలో కొన్నింటిని అమలుపరచినా అద్భుతాలు చేయవచ్చు. అసలు ఈ ఆలోచనలు మనలో ఎలా పుడతాయి ఎందుకు పుడతాయను సందేహం కలగకమానదు. మన శరీరంలోని కళ్లు, ముక్కు, నాలుక, చర్మం, చెవులు అను అవయవాలను

పంచేంద్రియాలు అంటారు. ఈ ఇంద్రియాల ద్వారా ఉన్న దానిని గురించిన సమాచారం మనసుకు అందుతుంది. వీటిలో కొన్నింటిని మనసు ఇష్టంగా స్వీకరిస్తుంది. కొన్నింటిని కష్టంగా తిరస్కరిస్తుంది. ఇష్టమైన దానిని పదేపదే కావాలని కోరుకొంటుంది. ఇలా కోరుకోవడం ద్వారా కోరికలు పుడతాయి. ఈ కోరికలే మొదట అవసరాలు, తరువాత అలవాటు, దురలవాటుగా మారతాయి. ఈ ఇంద్రియాలను నియంత్రించకుండ బ్రేకుల్లేని కారులా వదలివేస్తే ప్రమాదాలకు దారితీస్తాయి. వీటిని నియంత్రించ గల శక్తి అందరిలో ఉంది.

ఒక ఎద్దును బలహీనమైన తాడుతో కట్టివేసినారు. దానికి ఆకలవుతుంది. దగ్గర్లో పచ్చిగడ్డి కనిపిస్తుంది. ఎద్దు తాడును తెంచుకొని గడ్డిని తింటుంది. అదే ఎద్దును బలమైన తాడుతో కట్టివేసినారనుకో, దానికి ఎంత ఆకలయినా తాడును తెంచుకొని వెళ్లలేదు. తాబేలు భూమిపై నడచి వెళుతున్నప్పుడు దానికి ప్రమాదమని తలచినప్పుడు తన తల, కాళ్లు, చేతులు వంటి భాగాలను తన వీపుపై ఉన్న గట్టి టెంక వంటి భాగంలోకి వెనుకకు లాక్కొని, ఆగిపోతుంది. అప్పుడు దానిపై ఏనుగుకాలు పెట్టినా, దానికి హాని జరగదు. ప్రమాదం లేదని తలచినప్పుడు తల, కాళ్లు, చేతులు వంటి భాగాలను ముందుకు చొప్పించి మెల్లగా వెళ్లదలచిన చోటుకు వెళుతుంది. అలా వివేకవంతులు వారి ఇంద్రియాలను నిగ్రహించి చేయవలసిన పనుల పై మనసును కేంద్రీకరిస్తారు. చెడుకు దూరంగా మంచికి చేరువగా వెళుతుంటారు. ఎక్కడ కష్టం, నష్టం, ప్రమాదం, హింస ఉంటాయో అక్కడకు వెళ్ళక, ఎక్కడ మంచి, మానవత్వం శాంతం, సహనం, ప్రేమ ఉంటాయో అక్కడకు వెళతారు. సూర్యోదయానికి ముందు నిద్రలేచిన వారు ఎక్కువ పగటి సమయాన్ని ఆనందగా గడపగలరు. జీవితంలో లక్ష్య సాధనకు చిన్న వయసులో ప్రయత్నాలు మొదలు పెట్టినవారు ఎక్కువ ప్రయత్నాలు చేయగలరు. ఎప్పుడు మంచిని గురించి ఆలోచిస్తూ మంచి పనులు చేయువారికి చెడును గురించి ఆలోచించు సమయం చాలదు. వారి సమయాన్ని, డబ్బును, శక్తి యుక్తులను మంచి పనులు చేయడానికే పరిమితం చేసుకొంటారు. అలా కోరికలను అదుపు చేయగలవారు మాత్రమే శాంతి సంతోషాలను పొందగలరని బుద్ధుడు అందరికన్నా ముందు తెలుసుకొని బోధించాడు.

ఒక వ్యక్తిని విషసర్పం కరచింది. దాని విషప్రభావం వలన అతని శరీరం వికృతంగా మారింది. భయం, బాధ, ఆందోళనతో బాధ పడుతున్నాడు. సకాలంలో సరైన వైద్యం అందించకుంటే చనిపోతాడు. వెంటనే దగ్గరలోని వైద్యుని వద్దకు తీసుకొని వెళ్లారు. డాక్టరు పరీక్షించి విషానికి విరుగుడు (Anti Venom) ఇచ్చాడు. విరుగుడు ప్రభావం వలన క్రమంగా అతని శరీరంలోని విషప్రభావం తగ్గి ఆరోగ్యవంతునిగా మారాడు. ఇలా మనలో కొంతమంది మనసులో చెడు భావనలను, మంచి భావనలను వారి మనసులోకి ప్రవేశపెట్టుట ద్వారా పాము కాటుకు గురైన వ్యక్తి ఆరోగ్యవంతునిగా మారినట్లు చెడు భావనలు గల వారిని మంచి వారుగా మార్చవచ్చు. రోగం ముదిరిన తరువాత డాక్టరు రోగి పరిస్థితికి జాలి పడతాడుగాని అతనిని ఆరోగ్యవంతునిగా మార్చలేని నిస్సహాయకునిగా మారతాడు. దుర్గుణాల వలన వికృతంగా ప్రవర్తిస్తున్న వారి మనసులోకి ప్రేమ, దయ, శాంతం, సహనం వంటి సద్గుణాలను ప్రవేశపెట్టాలి. అప్పుడు దుర్గుణాలను వదలి సద్గుణాలను స్వీకరిస్తాడు. చీకటిలో ఉండువారు వెలుతురులోకి రాకుండ, హింసలో ఉన్నవారు అహింసను అనుసరించకుండా వాటి గొప్పదనం తెలుసుకోలేరు. అలా చేసినప్పుడు వారి జీవితాన్ని వారు మార్చుకొని మరికొందరి జీవితాల్లో మార్పుకొరకు మంచి కొరకు కృషి చేయగలరు. మురికిని మురికితో శుభ్రం చేయలేరు. మలినాలున్న నీటిని మంచి నీటితో కలపడం వలన మంచినీరు మలినమవుతుంది. మలినాలు గల నీటిని వడకట్టుట ద్వారా మంచినీరుగా మార్చవచ్చు. కోపం ఉండగా శత్రువులతో పనిలేదు. అది ఎక్కడ ఉంటే అక్కడ శత్రువులు తయారవుతారు. శాంతం ఉండగా రక్షణ కవచం అవసరంలేదు. అది ఎక్కడ వుంటే


అర్హంతుల సమతా భావం

అక్కడ మిత్రులు తయారవుతారు. మానవులను దీర్ఘవ్యాధుల్లా పట్టి పీడిస్తున్న అన్ని సామాజిక రుగ్మతల నుండి కాపాడు దివ్య ఔషధం బౌద్ధం. దీని సుగుణాల సువాసనలు మానవజాతికి ఆనందం ఆహ్లాదం అందిస్తాయి.

నిప్పు అవసర వస్తువు. అది లేకుండ ఆధునిక మానవుని జీవితం ఊహాతీతం. అది ఎంత అవసర వస్తువైనా, ఉపయోగకరమైనదయినా దానికి దూరంగా వుండి మన పనులకు ఉపయోగించుకోవాలి. దగ్గరకు వెళితే కాలుతుంది. ఎక్కువగా కాలితే చనిపోతాం. పడవ నీటిలో ఉంటుంది. కాని నీరు పడవలోకి వస్తే మునిగిపోతుంది. అలా మనుషులకు కోరికలు సహజంగా ఉంటాయి. అసలు కోరికలు లేనివారుండరు. జీవించాలను భావన కోరికే. అసంఖ్యాలుగా ఉన్న కోరికల యెడల మన ప్రవర్తన ఎలా ఉండాలి. కోరికలు, అవసరాలు ఎప్పుడు సహేతుకాలుగా ఉండాలి. నీ కంటిలో నలుసు, కాలులో ముల్లు విరిగితే నీవు ఎంత బాధపడతావో ఇతరులు, ఇతర జీవులు అలాగే బాధపడతాయను విచక్షణతో మానవులు నడుచుకోవాలి. ఒకరు నీకు ఏమి చేస్తే నీ మనసు భారమవుతుందో, బాధపడుతుందో, అదేపని నీవు చేసి ఇతరుల మనసు బాధపెట్టవద్దు. బ్రేకుల్లేని కారు ప్రమాదానికి గురైనట్లు అదుపులేని కోరికలు అనర్థాలకు దారితీస్తాయి.

ఒక మొక్కను పెరకగలం, కాని చెట్టును పెరకలేం. కోరికలు కోరికలుగా ఉన్నప్పుడు నియంత్రించగలం; అవి వ్యసనాలుగా మారిన తరువాత మనిషిని, మనసును నియంత్రించి పతనానికి దారి తీస్తాయి. ప్రతి వ్యసనం మొదట కోరికగా మొదలవుతుంది. మనిషికి ఆనందం ఆహ్లాదం అందిస్తానని హామీ ఇచ్చి మన అనుమతితో ఆశ్రయం పొందుతాయి. ఆశ్రయించిన తరువాత వద్దని పొమ్మన్నా వదలక పట్టి పీడిస్తాయి. జూదం, మద్యం, ధూమపానం వంటి వ్యసనాలన్నీ ఈ కోవకు చెందినవే.



క్రోధాతీతుడు

జంతువులు వాటికి హానికరమని అనుమానించిన పదార్థాలను తినవు. కాని విజ్ఞానం, వివేకం గల మానవులు మద్యం పొగత్రాగడం వలన ఆరోగ్యానికి హానికరమని తెలిసి కూడా వాటికి బానిసలుగా మారుతున్నారు. మన పురాణాలలో చెప్పబడిన రాక్షసులు మనుషులను శారీరకంగా హింసించేవారు. కాని దుర్వ్యసనాలు మనల్ని మానసికంగా శారీరకంగా పట్టి పీడిస్తున్నవి. ఎండమావులను చూసి నీరని భ్రమించి వాటి వెంట పరుగులు తీస్తున్న వారిలా కొందరు వ్యసనాలు, సుఖాలను అందిస్తాయని అదుపు తప్పిన అడవి గుర్రంలా వాటివెంట పరుగులు తీస్తున్నారు. అవి ప్రతి ఒక్కరిని చివరకు దుఃఖం, బాధ అను మజిలీకి చేరుస్తాయి. తగలబడుతున్న చెట్టుపై పిట్టలు వాలవు. అడవిలో చాలా రకాల చెట్లున్నవి కాని బాగా పండ్లున్న చెట్టుపై అన్ని రకాల పిట్టలు వచ్చి వాలతాయి. ఎందుకని ఆ పండ్లు వాటి ఆకలిబాధను తీరుస్తాయి గనుక. అలాగే వివేకవంతులు ఎప్పుడు మంచి మార్గంలో నడుస్తూ బాధలు, దుఃఖాలకు దూరంగా ఉండాలని, శాంతి సంతోషాలకు చేరువ కావాలని బుద్ధుడు బోధించాడు.

బంగారు పాత్రలో విషం ఉంది. అయినా దానిని త్రాగం ఎందుకని? త్రాగిన వారి ప్రాణాలు గాలిలో కలుస్తాయి. మట్టికుండలో మంచినీరుంది, దానిని తప్పక త్రాగుతాం ఎందుకని?అవి పోయే ప్రాణాలను నిలుపుతాయి. అలాగే ఈ ప్రపంచంలో చాలా రకాల ఆధ్యాత్మిక సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నవి. అవన్నీ మనిషిని వాస్తవాలకు దూరంగా భ్రమలు, వూహల్లో తిప్పుతున్నవి. మనిషి శక్తిని తక్కువగా అంచనా వేసినవి. అద్భుత శక్తులపై ఆధారపడమంటున్నవి. కాని మట్టికుండలో మంచినీరు ప్రాణాలు కాపాడినట్లు బౌద్ధం మనిషిని శక్తివంతునిగా గుర్తిస్తుంది. మీరు దేనిని గుడ్డిగా నమ్మకండి. ప్రతిదానిని తర్కించి, నిజమని నిరూపించుకొని, అనుసరించండి, ఆచరించండని బుద్ధుడు చెప్పాడు. అమెరికన్లు ఆటంబాంబులు తయారుచేశారు. జర్మన్లు యుద్ధటాంకులు తయారుచేశారు. ఫ్రెంచ్‌వారు యుద్ధవిమానాలు తయారుచేశారు. ఇంగ్లాండ్‌వారు తుపాకులు, తూటాలు తయారుచేశారు. వీరు కనుగొన్న మారణాయుధాలను ఉపయోగించి కొంతమందిని చంపగలరు. ఆస్తులు నాశనం చేయగలరు. రక్తపాతం సృష్టించగలరు. లేని సమస్యలు సృష్టించగలరు. కాని చనిపోయిన చిన్న చీమను బ్రతికించగలరా? ప్రజలు ఎదుర్కొంటున్న ఒక్క ప్రధాన సమస్యనైనా పరిష్కరించగలరా? లేదు. కాని, మహనీయ బుద్ధుడు కనుగొన్న అహింస అను అదృశ్య ఆయుధం ఎప్పుడు ఏ జీవిని ఏ రూపంలో హింసించదు. ప్రాణాలు తీయదు.

మానవులను, మూగజీవులను, ఆపదలు, ప్రమాదాల నుండి రక్షిస్తుంది, కాపాడుతుంది. ఎప్పుడు హింసను కోరుకొనువారికి, ఎప్పుడు ఎక్కడ ఏమి జరుగుతుందో ఎవరు వూహించలేరు. వారు ఎక్కడ ఉంటే అక్కడ శత్రువులు తయారవుతారు. వారు ప్రశాంతంగా జీవించరు. మరికొందరిని ప్రశాంతతకు దూరం చేస్తారు. వారి నీడను చూసి వారు భయపడు తుంటారు. శాంతం సహనం గలవారు ఎక్కడ ఉంటే అక్కడ మిత్రులు తయారవుతారు. వారి జీవితం ప్రశాంతంగా సంతోషంగా సాగిపోతుంది. వారి ప్రశాంతతను సంతోషాన్ని పదిమందికి పంచగలరు. ఒక తండ్రి తన బిడ్డలందరు ప్రశాంతంగా సంతోషంగా జీవించాలని కోరుకున్నట్లు ఒక రాజు తన రాజ్యంలోని ప్రజలందరు, పాడిపంటలతో ఆనందంగా జీవించాలని కోరుకున్నట్లు, మహనీయుడు బుద్ధుడు ప్రపంచంలోని ప్రజలందరు జీవులన్నీ శాంతి, సంతోషం, పరస్పర సహకారం, సహనం, సామరస్యంతో జీవించాలని కోరుకొన్నాడు. ఆ మహనీయుని మంచితనం, మానవత్వం, జీవకారుణ్యాన్ని ఏ స్కేలుతో కొలవాలో విజ్ఞులు మీరే నిర్ణయించండి.

మనిషిగా పుట్టడం మన అదృష్టం. ఈ పవిత్ర జీవితాన్ని పనికిరానిదిగా మార్చుకోవడం అవివేకం. నేను బలహీనుడను. నా ఒక్కని వలన ఏమి జరుగుతుందని అనుమానించి అడుగు వెనక్కు వేయకండి. జీవితం చిన్నది కావచ్చు. మనసు శక్తివంతమైనది. మీ భవిష్యత్తును నిర్ణయించేది మీ చేతలుగాని, మీ చేతిలోని గీతలు కావన్నాడు బుద్ధ భగవానుడు. మీ చేతివ్రాతతో మీ తల వ్రాతను తిరగ వ్రాయగల శక్తి మీలో ఉంది. నిన్ను నీవు ప్రేమించు కోలేనప్పుడు ఇతరులను ప్రేమించలేవు. బలహీనతలు వదలి బలవంతులుగా మారండి. హింసను విడచి అహింసను అనుసరించండి. ఒకరు పాలు, నెయ్యి, తేనె వంటి పదార్థాలను కలిపి మధురమైన వంటకాలు తయారుచేశారు. వాటిని తిని వారి మనసు సంతోషం సంతృప్తిని పొందింది. అలా వారు పొందిన సంతోషం సంతృప్తి వారి బంధుమిత్రులు పొందాలని ఆశించడం మానవసహజం. అలానే మహనీయుడు బుద్ధుడు తన కోరికలను తాను జయించి బలవంతునిగా మారాడు. జ్ఞానోదయం ద్వారా తెలుసుకొన్న సత్యాలను బోధిస్తూ, ధర్మాన్ని అనుసరిస్తూ, అనిర్వచనీయ ఆనందానుభూతులు అనుభవించాడు. అలా తాను పొందిన ప్రశాంతత, సంతోషం, జీవులన్నీ పొందాలని ఆయన ఆశ, ఆశయం. అందుకే తుదిశ్వాస విడచువరకు ధర్మబోధ చేశాడు. ఈ మహాప్రస్థానంలో ఎదురైన ఆటంకాలను ఆనందంగా అధిగమించాడు. కష్టాలను కన్నీటిని చిరునవ్వుతో స్వీకరించాడు. మానవజాతిని కోరికల విషవలయంలో చిక్కుకోకుండా తప్పించుటకు మార్గం తెలుసుకొన్నాడు.

ముందుగా మార్గం తెలుసుకొన్నవారే మరొకరికి మార్గం చూపగలరు. మన దగ్గర ఉన్న దానినే ఇతరులకు ఇవ్వగలం. గురువు మార్గం చూపగలడుగాని లక్ష్యం చేర్చలేడు. అందుకు ఎవరికి వారు ప్రయత్నించి పొందవలసిందే. ఎవరో మామిడిపండును తిని మధురంగా ఉందని చెబితే మనమూ మధురంగా ఉంటుందనుట సమంజసం కాదు. ఎవరికి వారు తిని రుచిని తెలుసుకోవలసిందే. అలాగే బుద్ధుని బోధనలు మంచివని ఎవరో చెబితే మంచివని తలవూపి అంగీకరించడం కాదు. మనకు మనం తెలుసుకొని అనుసరించి, ఆచరించాలి. ఎవరి జీవితాన్ని వారు శాంతి, సహనం, సామరస్యంగా మార్చుకోవాలి. అలా ఎవరి జన్మను వారు సార్ధకం చేసుకోవాలి. ఒక చెట్టుకు చాలా కాయలు కాసినవి. అందులో ఒక్కదాన్నీ చెట్టు తినలేదు. ఒక నదిలో చాలా నీరుంది, అందులో ఒక్క చుక్కనూ అది తాగలేదు. ఒక మేఘం చాలా నీరు వర్షిస్తుంది. అందులో ఒక్క చుక్క నీటినీ తనకోసం ఉంచుకోదు. ఇవన్నీ ఎవరికోసం, దేనికోసం, ఇలా చేస్తున్నవి. అది ప్రకృతి ధర్మం. ఎవరి నుండి ఏ ప్రతిఫలం ఆశించక వాటిపనులు అవి చేసుకుపోతున్నవి. అలాగే బుద్ధుడు తాను తెలుసుకొన్న సత్యాలను బోధిస్తూ తుదిశ్వాస విడుచువరకు ధర్మ మార్గంలో నడిచాడు. అలా ఆయన ధర్మాన్ని ఆయన నిర్వర్తించాడు. ఇక మన ధర్మమే మిగిలింది. ●

---

**గువ్వల కోటయ్య**
రచయిత, గుంటూరు జిల్లా, ఫోన్ : 88010 37737



ప్రజలు భిక్షువులను నిందించుట

# శీల, సమాధి, ప్రజ్ఞ

*- కల్యాణమిత్ర సత్యనారాయణ గోయంకా*

**బు**ద్ధుడు నేర్పిన ధర్మము ఆ కాలంలో అందరికి ఆమోదయోగ్యమై, సార్వజనీనమై వికసించినది. అతని తదుపరి సుమారు నాలుగు వందల సంవత్సరముల వరకు ఏ విధమైన సామూహిక విరోధములు లేకుండా విస్తరించింది.

అతను నేర్పిన ఈ విద్యను 'ధర్మము' అనకుండా 'బౌద్ధధర్మం' అని ఉన్నట్లైతే అది మరొక సంప్రదాయంగా మారి ఉండేది.

ప్రతి సంప్రదాయానికి తమ తమ మాన్యతలు, కర్మకాండలు, వేషధారణలు, ఉత్సవాలు, పండుగలు, పర్వాలు ఉన్నాయి. సంప్రదాయ వాదులు వీటినే వారి వారి ధర్మాలుగా చెపుతారు. ఈ భిన్నమైన పద్ధతుల వలనే పరస్పరం ఒకరినొకరు దూషించు కుంటుంటారు. పోట్లాడుకుంటారు. ఒకరినొకరు నిందించుకుంటూ, ఇతరుల హృదయాలను ముక్కలు చేస్తుంటారు. ఏవిధంగానైతే పుట్టుకతోనే ఏర్పడిన జాతి, కుల, మత భేదాలు సమాజాన్ని విభజిస్తున్నాయో అదే విధంగా ఈ రకరకాల మాన్యతలు మనుషుల మధ్య ద్వేషం, దుర్భావనలను కలిగించి విడదీస్తున్నాయి. పరస్పర స్నేహాలకు, సద్భావనలకు విఘాతం కలిగిస్తున్నాయి. బుద్ధుడు నేర్పిన 'ధర్మము' అందరికి ఆమోదయోగ్యమై, సార్వజనీనమై అందరిని కలపగలదని ప్రజలు అర్థం చేసుకున్నారు. అందువలన బుద్ధుని బోధనలు ఏ విధమైన వ్యతిరేకతను ఎదుర్కోకుండా వికసించి, విస్తరించాయి.



దారుచీరునికి ధర్మోపదేశం

బుద్ధుడు శీల, సమాధి, ప్రజ్ఞలను తాను స్వయంగా అభ్యాసం చేసి జనన మరణాల భవచక్రం నుండి బయటపడ కలిగినాడు. పరిపూర్ణ బుద్ధుడైనాడు. తదుపరి తాను స్వయంగా అభ్యాసం చేసిన శీల, సమాధి, ప్రజ్ఞలతో కూడిన ఆర్య అష్టాంగిక మార్గాన్ని ఎలా అభ్యాసం చేయాలో ప్రజలకు బోధించాడు. ధర్మంలోని ఈ మౌలిక పద్ధతులు అందరికీ ఆచరణదాయకమై అందరిచే కొనియాడబడినవి. అవి ఏ ఒక్క మతానికో చెందినవి కావు.

**శీల** : శీలపాలన అనగా వాణిద్వారాగానీ, శరీరం ద్వారాగానీ, ఇతరులకు హాని కలిగించేవి. వారి మనశ్శాంతికి భంగం వాటిల్లేటటువంటి పనులన్నింటి నుండి దూరంగా ఉండటం, బుద్ధుని యొక్క ఈ బోధన అందరికి ఆమోదయోగ్యమైంది. నిర్మలమైన మనసుతో శీలపాలన చేయటం నేర్పేడు. వాణి ద్వారాగాని, శరీరం ద్వారాగాని జరిగే సమస్త కర్మలు పవిత్రంగా ఉంచుకోవాలి అంటే మనసు నిర్మలంగా ఉంచుకోవాలి.

**సమాధి** : ఏదైనా మంత్రాన్ని జపించటం ద్వారాగానీ లేక దేవతల నామాలను జపించటం ద్వారాగాని మనసు తేలికగా ఏకాగ్రపరుచు కోవచ్చు. తద్వారా కొంత వరకు మానసిక ప్రశాంతతను పొంది మనసును మలినరహితం చేసుకోవచ్చు. కానీ ఈ విధంగా పొందే ఏకాగ్రత మనోవికారాలను వ్రేళ్ళతో సహా పీకివేయలేదు. ఆసాంతం నిర్మూలనం కాకపోగా, వికారాలు మనసు లోలోతులలోకి అణచివేయ బడతాయి. మనసులోని మలినాలను ఆసాంతం నిర్మూలించే సమాధినే సమ్యక్ సమాధి అన్నాడు. బుద్ధుడు సమ్యక్ సమాధి అభ్యాసం చేయటం నేర్పేడు.

**ప్రజ్ఞ** : ప్రజ్ఞపై ధర్మ ప్రవచనాలు విని లేదా ఉపదేశాలు చదివి పొందిన జ్ఞానం శృతమయ ప్రజ్ఞ (వినికిడి జ్ఞానం) అవుతుంది. బుద్ధికుశలత ద్వారా చింతన మననములు, తర్కవితర్కములు చేసుకొనుట వలన పొందిన జ్ఞానం చింతనాయ ప్రజ్ఞ (బుద్ధి కుశలత వలన కలిగిన జ్ఞానం) అవుతుంది. తనలోపలి సత్యాన్ని స్వానుభవంతో స్వయంగా తెలుసుకోవటం ద్వారా కలిగిన జ్ఞానమే ప్రత్యక్ష జ్ఞానం అవుతుంది. భావనామయ ప్రజ్ఞ అవుతుంది.

ఆధ్యాత్మిక జగత్తులో మహావైజ్ఞానికుడు అయిన బుద్ధుడు మననును నిర్మలం చేసుకునే మార్గాన్ని కనుగొన్నాడు. నిష్ఠగా పనిచేసే ఒక శాస్త్రవేత్తవలె మనశ్శరీరాల స్వభావం, వాటి పనితీరుపై ప్రయోగాలు చేశాడు. విభజించి, విశ్లేషించి స్వానుభవంతో వాటి స్వభావాలను తెలుసుకోవటం ద్వారా పరమసత్యాన్ని కనుగొన్నాడు. మనసులో వికారాలు ఎలా ఉత్పన్న మవుతాయో అవి మనసును ఎలా కలుషితం చేస్తాయో తెలుసుకున్నాడు. విపశ్యనను అభ్యాసం చేయటం ద్వారా, సమతను వృద్ధి చేసుకోవటం ద్వారా వాటిని ఎలా నిర్మూలించుకోవచ్చో తెలుసుకొన్నాడు. వికారాలు అసాంతం నిర్మూలించ నంతవరకు ఎవరూ వాటి నుండి విముక్తులు కాలేరు. అయినప్పటికి ఎంతమేరకు వికారాలను నిర్మూలించుకో గలుగుతారో అంతమేర వాటి నుండి స్వేచ్ఛ పొంది దుఃఖ విముక్తులవుతారు.

బుద్ధ భగవానుడు బోధించిన, అత్యంత వైజ్ఞానికమైన, ప్రత్యక్ష ఫలదాయిని అయిన ఈ విద్యను ప్రజలు ఏ విధమైన సంకోచము లేకుండా స్వీకరించారు. దాని వలన లాభాన్వితులు అయినారు. ఈ విధంగా అతి సరళంగా ఈ విద్య వ్యాప్తి చెందింది. బుద్ధుని తరువాత నాలుగు వందల సంవత్సరాలకు అశోక చక్రవర్తి ఈ విద్యను భారతదేశంలోనే కాకుండా పొరుగున ఉన్న ఇతర దేశాలకు కూడా విస్తరింపజేశాడు. అటు పిమ్మట కాలక్రమేణ బుద్ధుని బోధనలు భారతదేశంలో కనుమరుగైపోయినాయి. 2000 సం॥ల తరువాత తిరిగి ఈ విద్య భారతదేశం వచ్చింది. ఇక్కడినుండి ప్రపంచమంతా వ్యాపించింది. బుద్ధుని బోధనల సారాంశం అయిన ఈ విపశ్యన మరో 2000 సం॥ల వరకు స్వచ్ఛంగా ఉండి ఎంతో మందికి మేలు చేస్తుందని ఆశిద్దాం.

విపశ్యన సాధనలో పట్టుదలతో క్రమం తప్పకుండా లోతుగా సాధన చేయడంలో లీనమైపోయిన సాధకుడు, తరచూ ఎంతో వేడిపుట్టించే సంవేదనలను ఎదుర్కోవలసి వస్తుంది. ఎన్నోసార్లు గమనించిందేమంటే ఈ వేడి (తాపం) బయటి వాతావరణం కారణంగా కలిగేది కాదు. శీతాకాలంలో లేక మంచుకురిసే హిమాలయ ప్రాంతాల్లో జరిగే శిబిరాల్లో సాధకులు చలికి కంబళ్లు, బొంతలు, స్వెట్టర్లు ఒక దాని మీద ఒకటి కప్పుకొని సాధన చేస్తుంటారు. కాని విపశ్యన ఆరంభించిన తరువాత వారిలో చాలామందికి వేడితో ఎంత ఉక్కగా అనిపిస్తుందంటే కప్పుకున్న కంబళ్లను, బొంతలను తీసి ప్రక్కన పెడతారు. కొందరైతే వేసుకున్న స్వెట్టర్లు చొక్కాలు కూడా తీసేస్తారు. ఇది కేవలం శరీరం యొక్క వేడి కాదు. ఎందుకంటే సాధకునికి తన శరీర ఉష్ణోగ్రత కన్నా ఎక్కువ వేడిగా అనిపిస్తుంది. (సాధకునికి జ్వరం లాంటిదేమీ ఉండదు కానీ ఒళ్ళంతా వేడెక్కినట్లు, మంట మంటగా చిటపటలాడినట్ల నిపిస్తుంది.) ఒక్కో సాధకునికైతే శరీరమంతా మండే కుంపటిలో వేయించినట్లనిపిస్తుంది. అలాంటప్పుడు సాధకుడు విపశ్యన చేయడం ఆపి, కొద్దిసేపు బహిర్ముఖుడై ధ్యాస మళ్ళిస్తే మొత్తం తాపం (వేడి, మంట) దూరమై పోతుంది. సాధకుడు మామూలు స్థితికి వస్తాడు. కాని మళ్ళీ సాధన మొదలు పెట్టగానే, అలాంటి మంటలే అనుభవ మవుతాయి. సాధనపట్ల సరైన అవగాహన గల గంభీర సాధకుడు ఇలాంటి సమయంలో ఈ తాపాన్ని అనిత్యబోధ ఆధారంగా తటస్థ భావాన్ని స్థిరపరుచుకొని చూస్తాడు.

దీనిపట్ల కొంచెం కూడా ప్రతిక్రియ చూపడు. దాంట్లో ఈ తాపం కొంత సమయానికి సమాప్తమైపోతుంది. ఫలితంగా ఎంతో చల్లదనం - అనుభవమౌతుంది. ఇంతకు ముందెన్నడూ అనుభవించని అంతఃశీతలం - లోలోపల ఎంతో చల్లదనం అనుభవమౌతుంది. మొదట అనుభవానికొచ్చిన వేడి, శరీర స్వభావమైన వేడిగానీ - బయటి వాతావరణంలోని వేడిగానీ కానట్లే ఇప్పుడు అనుభవమౌతున్న చల్లదనం శరీర స్వభావమైందిగానీ, బయటి వాతావరణానికి చెందిందిగానీ కాదు. కొన్ని పూర్వ సంచిత మనోవికారాలు వేడినీ, మంటనూ పుట్టించే స్వభావం గలవిగా ఉంటాయి. లోతుగా విపశ్యన అభ్యాసం చేస్తుంటే, అవి పెల్లుబికి వస్తాయి. ఒళ్ళంతా మంటగా చిటపట లాడినట్లు, ఒక్కోసారి కుంపట్లో వేయించినట్లనిపిస్తుంది.



మహాసాల బ్రాహ్మణుడు

ఎలాంటి ప్రతిక్రియ చేయకుండా తటస్థంగా వాటిని గమనిస్తూపోతే, వాటి సహజ స్వభావమైన క్షీణదశకు చేరుకుంటాయి. ఉపశమిస్తాయి. ఇదంతా సాధనలో ఎరుక కలిగి ఉంటూ సమతను నిలబెట్టుకోవడం వల్లనే జరుగుతుంది. విపశ్యన అభ్యాసం చేస్తూ సాధకుడు ఎంతెంత సమతను పుష్టి చేసుకుంటాడో, అంతంతగా పూర్వ సంచిత కర్మసంస్కారాలు పెల్లుబికి వచ్చి నశించి పోతుంటాయి. ఈ కర్మసంస్కారాలు తాపం ఎంతెంత క్షీణించి పోతుందో, సాధకుడు అంతంత సుఖ శాంతులను (హాయిని, శీతలాన్ని) అనుభవిస్తాడు.

**ఉప్పజ్జిత్వా నిరుజ్ఝన్తి, తేసం ఊపసమో సుఖో!**

సాధన చేస్తున్నప్పుడు ఎంతోమంది సాధకులకు ఈ లోపలి తాపం మూలంగా రాత్రంతా నిద్రరాదు. సాధకునిలో సరైన అవగాహన లేకపోతే, వ్యాకులత చెంది తనకు నిద్రపట్టని రోగమేదో ఉందని తలుస్తాడు. అటూ- ఇటూ దొర్లుతూ- పొర్లుతూ రాత్రంతా నిద్రలేక అలజడికి గురవుతాడు. కాని తెలివిగా విషయం గ్రహించి, తటస్థ భావం నిలుపుకుంటే ఈ అంతర తాపమే అతని కళ్యాణానికి కారణమౌతుంది. పూర్వ సంచిత (గతంలో కూడబెట్టుకున్న) కర్మ బీజాలను ఈ అంతరవతాపంలో (వేడిలో) వేయించి వేస్తాడు. వాటిని ఫలించనివ్వడు. భవిష్యత్తులో అవి కొనితెచ్చే అత్యధిక దుఃఖ పరిణామాల నుండి పూర్తిగా విడుదల పొందుతాడు. ఈ అంతర తాపం సమాప్తమైనప్పుడు, సాధకునికి లోలోపల ఎంతో చల్లగా, హాయిగా అనిపిస్తుంది. దాంతో సుఖంగా నిద్రపోతాడు. ఇలాంటి అనుభవం ఎంతో మంది సాధకులకు ఎదురవుతూనే ఉంటుంది.

ఏ సాధకుడైతే అన్ని రకాల కర్మకాండలను, దార్శనిక నమ్మకాల చిక్కుముడులను వదిలించుకొని, ధైర్యంగా అనన్యభావంతో విపశ్యన అభ్యాసంలో నిమగ్నమౌతాడో, అతడు మరింత లోలోతుల్లోంచి, తన అంతర్మనసులో అణిగి ఉన్న లోతైన సంస్కారాలను పెకలించివేస్తూ, వాటి ఉపశమనం (నిర్మూలనం) చేసుకుంటూ ముందుకుసాగి ఇంద్రియాతీత స్థితిని అనుభూతి చెందుతాడు. అనిత్య ధర్మంగల ఇంద్రియ జగత్తును దాటి నిత్య ధర్మంగల నిర్వాణసత్యాన్ని సాక్షాత్కరింపజేసుకుంటాడు. వాణం అంటే మండిపోవడం. నిర్వాణం అనగా తృష్ణ యొక్క నిరంతర మంటలు పరినమాప్తమైన స్థితి. ఇలాంటి స్థితిలో అనుభవమయ్యే చల్లదనం మామూలు చల్లదనం కన్నా ఎన్నో రెట్లు అధికమైంది. ఇలాంటి తణ్హనం ఖయమజ్ఝగా స్థితిని చేరుకున్న సాధకుణ్ణి దృష్టిలో ఉంచుకొనే బుద్ధభగవానుడు శీతలీభూతం వంటి పదాలను వాడాడు. ఈ స్థితిని చేరుకున్న సాధకునిలో భవతాపం నామమాత్రమైనా మిగలదు.



వ్యాధిగ్రస్థ భిక్షువుకి బుద్ధుని సేవ

**ఇలాంటి పరమవిముక్త అర్హంత స్థితిని పొందిన భాగ్యశాలినియైన ఒక సాధకురాలి కథ :**

లిచ్ఛవీ గణతంత్ర రాజ్యంలోని వైశాలీ నగరంలో క్షత్రియ కులానికి చెందిన ఒక సద్గృహస్థురాలు ఉండేది. కల్యాణ కరమైన ధర్మవాణి విని ఆమె మనసులో సంసార జీవితం పట్ల వైరాగ్యం జనించింది. కాని భర్త మనసు ఇందుకు అనుకూలంగా లేకపోవడంతో, అతన్ని నొప్పించడం ఇష్టంలేక గృహస్థ జీవితం గడుపుతూ భార్యగా తన కర్తవ్యం నిర్వహించ సాగింది. ఒక రోజు వంటగదిలో మట్టిపాత్రలో కూర వండుతూ అందులో పులుసు పోయడం మరిచిపోయింది. కొంతసేపటి తరువాత వచ్చి చూస్తే, నీళ్ళు లేనందువల్ల కూరంతా మాడిపోయి ఉంది. ప్రతి గృహిణి జీవితంలోనూ ఇలాంటివి మామూలుగా ఎప్పుడో ఒకప్పుడు జరుగుతూ ఉండేవే. కాని ఈ సామాన్య సంఘటన, ఆమెకు కల్యాణప్రదమైన ప్రేరణా సాగరమై పోయింది. ఆమె మనసులో తీవ్రమైన ధర్మ-సంవేగం మేల్కొంది. అనిత్యము, అనిత్యము; అన్ని సంస్కారాలు అనిత్యమైనవి. వీటిలో ఆస్వాదనము (అనుభవించుట) అనే రసాన్ని (పులుసు) వేయకపోతే ఇవికూడా ఈ కూరవలె మాడి మసై నశించిపోతాయి. ఇక ఆమెకు కామభోగ రసాస్వాదన అసహ్యమైపోయింది. భార్యలో తీవ్రమైన వైరాగ్యభావం జన్మించడం చూసిన భర్త ఈ సారి ఆమెకు తోడుగా నిలిచాడు. ఎంతో ప్రసన్న భావంతో ఆమెను భగవానుని ఆశ్రమంలో వదిలివచ్చాడు. అక్కడ ఆమెకు మహా

ప్రజాపతి గౌతమి ప్రవ్రజ్య దీక్ష ఇచ్చింది. విపశ్యన నేర్పింది. దృఢదీక్షతో సాధనచేస్తూ, ఆ సాధకురాలు కృతకృత్యురాలయింది. సాధన చేస్తున్నప్పుడు ఆమెలో జన్మించిన కామ, రాగాల తాపాలు (కామవాంఛలు, రాగ ద్వేషమోహాలు) ఉపశమించాయి. అంతర శీలత్వం ప్రాప్తించింది. గతంలో రాత్రంతా, వ్యాకులతతో, అలజడితో గడిపేది. ఇప్పుడది దూరమైపోయింది.

భగవానుడు ఆమె పూర్వ వర్తమాన స్థితులను చూసి ఆహ్లాదభరితమైన ఈ క్రింది హర్షవచనాలు (ప్రశంస నిండిన వాక్కులు) పలికాడు. వాటినే ఈ సాధ్వి కూడా ఉల్లాసపూర్వకంగా పలువురితో పదే పదే చెబుతుండేది.

**సుఖం సుపాహి థేరికే, కత్వా చోళేన పారూతా ।**
**ఉపసన్తో హి తే రాగో, సుక్ఖదాకంప కుమ్భియం ॥**

ఓ భిక్షుణీ, నీవు సుఖమైన నిద్రపోదువు గాక ! స్వయంగా నీ చేత్తోనే నేసిన వస్త్రాలను కప్పుకొని నీవు పరమశాంతిని పొందావు. బాణలిలోని పొడికూరవలె ఇప్పుడు నీలోని రాగ ద్వేషాలన్నీ మాడిమసైనాయి. ఉపశమన మైనాయి. కల్యాణకారిణియైన ఈ హర్షవచనాలు సాధకులందరి మేలుకొలుపుకు కారణభూతమవ్వాలి. అందరూ తమతమ సంచిత, సంగ్రహిత కర్మ సంస్కారాలు విపశ్యనాసాధన అనే మంటలో కాల్చి, మసిచేసి పరమశాంతి సుఖము పొందాలి! దుఃఖాల నుండి సర్వదా విముక్తులవ్వాలి! ఇదే మన శుభానికి సముచితమైన ఉపాయం.

**ఈ క్షణం :** మట్టి పిడతలో మాడిపోయిన కూరను చూసి, తన అన్ని కర్మబీజాలను విపశ్యన సాధన ద్వారా మాడ్చి మసి చేసుకోవాలనే ప్రేరణ, ఉత్సాహం ఒక సాధకురాలి మనసులో ఏ విధంగా కలిగాయో, అదే విధంగా పూర్వ కాలంలో అలాంటి అనేక సంఘటనలతో ప్రేరణ పొంది అత్యంత ఉత్సాహపూర్వకంగా సాధకులు విపశ్యన ధ్యానంలో నిమగ్నులై పరమ ముక్తిని పొందారు.

కోశలదేశ రాజ పురోహితుని కూతురు దంతియ ఇందుకు ఉదాహరణ. ఈ బ్రాహ్మణ పుత్రిక భగవానుని సంపర్కంలోకి వచ్చింది; అనగా ధర్మ సంపర్కంలోకి వచ్చింది. విపశ్యన విద్య లభించింది. ఆ రోజుల్లో శ్రావస్తి నగరంలో అనాథపిండకుడు నిర్మించిన జేతవన విహారంలో అనేకమంది భిక్షువులు - భిక్షుణిలు, గృహస్థులైన స్త్రీ-పురుషులు ధ్యాన సాధన చేసుకుంటూ ఉండేవారు. దంతియ కూడా అక్కడ చేరి అత్యంత శ్రద్ధతో సాధన నేర్చుకుంటూ ఉంది. సాధనలో స్థిరపడుతూ కొంత పురోగతి సాధించిన తరవుఆత ఆమెలో గృహస్థజీవితం పట్ల ఆసక్తి తగ్గిపోతూ భిక్షుణిగా మారాలనే వైరాగ్య భావం బలపడసాగింది. మహాప్రజాపతి గౌతమి నుండి ప్రవ్రజ్య దీక్ష స్వీకరించి ఆమె భిక్షుణిగా మారింది. అత్యంత నిష్ఠతో సాధన చేయసాగింది.

ఒకసారి భిక్షుణీ సంఘంతో కలిసి ప్రయాణం చేసి ఆమె రాజగిరి నగరం చేరింది. అక్కడ భిక్షుణీ విహారంలో నివసించ సాగింది. ఒకరోజు భోజనం తరువాత గిజ్ఝకూట పర్వతం మీద ఒక చెట్టునీడలో కూర్చొని ఉంది. ఆ సమయంలో మహాబలశాలియైన ఒక పెద్ద ఏనుగు పర్వత సానువు లో ప్రవహిస్తున్న నదిలో మునిగిన తర్వాత నది ఒడ్డున విశ్రమిస్తుండటం ఆమె చూసింది. ఇంతలోనే ఒక మావటివాడు చేతిలో అంకుశం పట్టుకొని అక్కడికి వచ్చాడు. ఏనుగు వద్దకు వెళ్ళి "కాళ్ళు చాపు" అని ఆజ్ఞాపించాడు. అది కాళ్ళు చాపింది. వాటి మీది కెక్కి మావటివాడు ఏనుగుపై కూర్చున్నాడు. ఏనుగు అతని ఆదేశాలను పాటిస్తూ నగరం వైపు సాగిపోయింది.

అంతటి మహాకాయం కలిగిన బలశాలియైన ఆ ఏనుగు తలచుకుంటే తనలో పదోవంతైనా లేని ఆ మనిషిని కాళ్ళ క్రింద తొక్కి నుజ్జు నుజ్జు చేయొచ్చు. కానీ అది అలా చేయలేదు. అతనికి బానిస అయింది అతని ఆజ్ఞను శిరసావహించింది. సేవకునిలా వ్యవహరించింది, మేలు చేసేదిగా మారిపోయింది. భిక్షుణికి విషయం అర్థమయింది. ఒక చిన్న అంకుశాన్ని ధరించి మావటివాడు మహాశక్తిశాలియైన మదగజాన్ని తన వశంలోకి తెచ్చుకోగలిగినప్పుడు, నేనెందుకు నా మనసును వశం చేసుకోలేను? తప్పక చేసుకోగలను. ఈ విధమైన ఆలోచనతో ప్రేరణ పొందిన భిక్షుణి దంతియ తన సంకల్పాన్ని దృఢతరం



ముక్తుడైన బందీ

చేసుకుంది. దగ్గరలో ఉన్న వనంలోకి వెళ్ళి మొక్కవోని దీక్షతో ముక్తిదాయిని అయిన విపశ్యనాభ్యాసంలో లీనమైపోయింది. నిర్విరామంగా కృషిచేసి అచిరకాలంలోనే మనసులోని అన్ని కల్మష కషాయాలను (క్లేశములను) నిర్మూలనం చేసుకొని, అర్హంతావస్థలో ప్రతిష్ఠితమైంది. భవచక్రం నుండి పూర్తిగా విముక్తి పొందింది. మానవజన్మను సఫలం చేసుకుంది.

**నూతన సంకల్పం :** శ్రావస్తి నగరంలో మావటివాని కుటుంబంలో జన్మించిన బాలకుడొకడు హస్త్యారోహ పుత్రుడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. చిన్న వయసు నుండే ఏనుగులను వశం చేసుకుని, వాటిపై స్వారీ చేయడంపై అతనికి అమితమైన ఆసక్తి ఉండేది. యువకుడయ్యే కొద్ది చండాతిచండ స్వభావం గల మదపుటేనుగునైనా ఎంతో చతురతతో సునాయాసంగా లొంగదీసుకొని వశం చేసుకోవటంలో సిద్ధహస్తుడయ్యాడు. ఒక రోజు ఏనుగును వశం చేసుకునే పని చేస్తుండగా తటాలున అతనిలో ఒక ఆలోచన కలిగింది. "నేను ఈ ఏనుగులను వశం చేసుకునే పనిలోనే జీవితమంతా గడుపుతున్నాను. ఎంత చండ స్వభావం గల ఏనుగునైనా అవలీలగా అదుపుచేసి వశం చేసుకోగలుగుతున్నాను. కాని నా మనసు మాటేమిటి? ఇది కూడా చండ స్వభావం గలదే! ఎప్పటికైనా దీన్ని నేను కట్టడిచేసి వశపరుచుకోగలనా, లేదా?"

ఈ కుశల చింతనతో అభిభూతుడై అతడు జేనవన విహారానికి వెళ్ళాడు. అక్కడ భగవానుని ధర్మామృత వాణి విన్నాడు. అతనిలో ధర్మవేగం మేల్కొంది. "నేను నా మనసును స్వాధీనం చేసుకోవాలి. దాన్ని వశం చేసుకోవాలి. ఇదే నాకు అధిక ప్రయోజనకారి. నా మనసుకు నేను యజమాని కావాలి. అందుకు పూర్తి కృషి చేయాలి. మనసుపై ఆధిపత్యం సంపాదించాలి. అడవి ఏనుగును



నదిలో స్నానం చేస్తే పాపాలు పోతాయా?

ఆధీనం చేసుకోవడం వల్ల ఎంత లాభాన్వితుడనౌతానో, అంతకు మించి ఎన్నోరెట్లు ఈ ఆటవిక మనసును అధీనపరుచుకున్నందువల్ల లాభం పొందుతాను. ఇది ఎప్పటివరకూ ఆటవికంగా ఉంటుందో, అప్పటివరకు నాకు ఎంతో పెద్ద శత్రువై ఉంటుంది. కాని వశమైతే, అధీనంలోకి వస్తే ఎంతో పెద్ద మిత్రుడై పోతుంది. శ్రేయస్సునిచ్చే సేవకుడైపోతుంది". ఇలా అతనిలో సద్ధర్మం పట్ల అత్యంత శ్రద్ధ కలిగింది. దాంతో హస్త్యారోహపుత్రుడు గృహస్థ జీవితాన్ని త్యజించి భిక్షువయ్యాడు. భగవానుని వద్ద సాధనావిధిని నేర్చుకొని చాలా కాలం విపశ్యన అభ్యాసం చేశాడు. కాని మనసు వశంలోకి వచ్చేది కాదు. భూత భవిష్యత్తులకు చెందిన పలురకాల కోరికల్లో, ఆహ్లాదకరమైన కల్పనల్లో విచ్చలవిడిగా అటూ-ఇటూ పొర్లాడుతూనే ఉండేది. ఏ మాత్రం అదుపులోకి వచ్చేది కాదు.

అలాంటప్పుడు అతనికి తన హస్తి విద్యా కౌశలం గుర్తుకు వచ్చింది. ఏ విధంగానూ అదుపు చేయటానికి వీలులేని మదపుటేనుగులను కూడా ఎంతో నైపుణ్యంతో ఎలా వశం చేసుకునేవాడో, ఆ పనిలో ఎంత ధైర్యం, ఓర్పు వహించవలసి వచ్చేదో, గుర్తుకు వచ్చింది. ఇష్టమొచ్చినట్లు విచ్చలవిడిగా తిరిగే అడవి ఏనుగును లొంగదీసే ప్రయత్నంలో దానికి ఎప్పుడు ఎంత ఆటవిడుపు ఇవ్వవలసి వచ్చేదీ, ఎప్పుడు ఎంత అంకుశం గ్రుచ్చవలసి వచ్చేదీ, ఎంత శ్రమకోర్చి పట్టువిడువకుండా ప్రయత్నం చేయవలసి వచ్చేదీ, ఎంత నేర్పరి తనంతో దాన్ని వశంలోకి తెచ్చు కోవలసి వచ్చేదీ అంతా గుర్తుకు వచ్చింది. ఇలా ఆలోచిస్తున్న అతని అంతరంగంలో ఒక్క మెరుపు మెరిసింది. నిరంకుశమైన మనసును కూడా అలాగే నిగ్రహించవలసి ఉంటుందనే విషయం బోధపడింది. "ఎంతో విచ్చలవిడిగా ఈ మనసు తనకు ఇష్టమున్నట్లు చాలానే చేసింది. అటూ-ఇటూ ఎంతో పరుగెత్తింది. ఎంతో తెలివి కోల్పోయి ఉంది. చాలు, ఇప్పుడిక దీన్ని అధీనంలోకి తెచ్చుకోవలసిందే!!

ఈ దృఢసంకల్పంతో మనసును వశం చేసుకునే పని మొదలు పెట్టాడు. తన పుర్వానుభవాన్ని అన్వయించుకొని మదపుటేనుగు కన్నా బలమైన మనసును స్వాధీన పరుచుకునే ప్రయత్నంలో పడ్డాడు. ధైర్యంగా, పట్టుదలతో, ఓర్పుతో, ఎంతో తెలివితో పనిచేస్తూ, తన శుభప్రయత్నంలో సఫలుడయ్యాడు. క్రమ క్రమంగా సోతాపన్న; సకదాగామి; అనాగామి స్థితులను అధిగమించి అర్హంతస్థితి యొక్క అమృతత్వాన్ని సాక్షాత్కరింప జేసుకున్నాడు. కృతకృత్యు దయ్యాడు. జీవన్ముక్తుడయ్యాడు. ధన్యుడయ్యాడు.

# వైతాళికుడు

- బొర్రా గోవర్ధన్

**భా**రతీయ సమాజానికి పెద్ద గుదిబండ కులం. ఈ 'కులం' పుట్టుక, పూర్వోత్తరాల గురించి ఎంతోమంది సామాజిక శాస్త్రకారులు ఎన్నో విధాలుగా విశ్లేషించారు. కుల సంస్కరణలు ఎన్నో వచ్చాయి. అయినా కులం పోలేదు. విద్య పెరిగితే కులం పోతుందని వివేకానందుని లాంటి వారు తెగ నమ్మారు. అదీ తప్పనే తేలిపోయింది. కులం పోవాలంటే కుల నిర్మూలనా మార్గం ఒక్కటే అనేది నేడు దాదాపుగా అందరూ ఒప్పుకొంటుంది. ఈ కుల నిర్మూలనా మార్గానికి ఏనాడో 2550 సం॥ల క్రితమే కులం ఈనాడున్నంత శాఖోపశాఖలుగా విస్తరించకముందే ఒక శాస్త్రీయమైన దారి కనిపెట్టినవాడు బుద్ధుడు.

బుద్ధుడు తక్కువ కులాలపట్ల 'జాలి' చూపలేదు. ఊరికే 'సానుభూతినీ' కురిపించలేదు. తన సంఘ నిర్మాణంలో వారికి గౌరవ ప్రదమైన హోదా కల్పించాడు. వారిని 'గురు' స్థానంలో కూర్చోబెట్టాడు. బౌద్ధసంఘంలో ముందుగా దీక్ష తీసుకున్నవారు తరువాత దీక్ష తీసుకున్నవారి కంటే గౌరవనీయులు. ఎక్కువ హోదా కల్గినవారు. తరువాత దీక్ష తీసుకున్నవారు తమకంటే ముందు దీక్ష తీసుకున్నవారికి గౌరవం చూపాలి. నమస్కరించాలి. ఈ నియమాన్ని కులనిర్మూలన విషయంలో చక్కగా ఆచరణాత్మకంగా ప్రయోగించాడు బుద్ధుడు.

పెద్ద కులానికీ, చిన్న కులానికీ చెందిన ఇద్దరు వ్యక్తులకు దీక్ష ఇచ్చే సమయంలో బుద్ధుడు వారిలో దిగువ కాలానికి చెందిన వ్యక్తికే ముందు దీక్ష ఇచ్చేవాడు. ఆ తరువాత అతనితో పెద్ద కులానికి చెందిన వ్యక్తికి దీక్షనిప్పించేవాడు. ఈ విధంగా దిగువ కులాల వారికి 'గౌరవ' స్థానం, 'గురు' స్థానం ఇచ్చి వారిలోని న్యూనతా భావాన్ని తొలగించాడు. స్వయానా తన కొడుకు రాహులుడికి కూడా దిగువ కులానికి చెందిన వ్యక్తితో దీక్షనిప్పించాడు. అందుకే బుద్ధుడు గొప్ప ఆచరణ వాది కూడా. బ్రాహ్మణ కులం గొప్పది, మిగిలిన దిగువ కులాలు హీనమైనవి అనే భావాన్ని కొందరు బ్రాహ్మణులు స్వయంగా బుద్ధునితోనే వాగ్వివాదానికి దిగారు. కానీ బుద్ధుడు బ్రాహ్మణ కులం గొప్పది కాదని, వారితోనే ఒప్పిస్తాడు.

ఎవరైతే వ్యతిరేక ధోరణితో వస్తారో, వారిని, వారి సమాధానాలతోనే ఎదుర్కొని, నెమ్మదిగా వారిని తన దారిలోకి తెచ్చుకునేవాడు బుద్ధుడు.

ఈ విషయంలో ఆరోజుల్లో, వాదనల్లో బుద్ధునితో తలపడి గెలిచినవారు లేరనే చెప్పాలి. అందుకే బుద్ధుణ్ణి 'సింహం'తో పోలుస్తారు. సింహం గర్జించేవేళ అడవిలో జంతువులన్నీ నోరెత్తి బదులు పలకలేవు. దీనికి గుర్తుగానే బౌద్ధులకు 'సింహం' ఒక చిహ్నంగా మారింది. కుల విషయంలో కొందరు బుద్ధునితో జరిపిన సంభాషణ చూద్దాం...

అది క్రీ.పూ. 515. అప్పుడు ఈ శాక్యసింహుడు శ్రావస్తిలో అనాథ పిండకుని జేతవనంలో ఉంటున్నాడు. ఆ సమయానికి ఏదో పరిషత్తు జరిగి ఓ 500 మంది బ్రాహ్మణ పండితులు శ్రావస్తికి వచ్చారు. వారికి 'వర్ణ వ్యవస్థని' నాశనం చేస్తున్న బుద్ధుడు ఆ సమయంలో అక్కడే ఉన్నాడని తెలిసింది. ఇక ఏమాత్రం ఉపేక్షించ కూడదని అనుకున్నారు. బుద్ధుణ్ణి ఒక పట్టు పట్టాలని నిర్ణయించుకున్నారు. అందరూ కూడబలుక్కున్నారు. తమ అందరిలో యువకుడు, మహా పండితుడు, మూడు వేదాల్ని కాచి వడపోసిన సమర్థుడు అశ్వలాయనుడే అందుకు తగినవాడుగా నిర్ణయించుకున్నారు. తమ నిర్ణయం అశ్వలాయునికి తెలియజేశారు. బుద్ధుని జ్ఞాన సంపత్తి, వాద పటిమ, తెలిసిన అశ్వలాయనుడు అందుకు ఒప్పుకోలేదు. పైగా 'ఈ పని తగదు'



భిక్షుణి ధమ్మదిన్నా

అని కూడా హెచ్చరించాడు. అయినా వారు వినిపించు కోలేదు.

"అశ్వలాయనా! యుద్ధంలోకి దిగకుండానే పరాజయాన్ని ఒప్పుకుంటే ఎలా?" అని ప్రశ్నించారు. "బుద్ధునికి తగిన బుద్ధి చెప్పే శక్తి నీకే ఉంది" అని బలవంతం చేశారు. అశ్వలాయనుడు 'బలవంతపు బ్రాహ్మణార్థం'గా ఒప్పుకున్నాడు.

అందరూ బుద్ధుని దగ్గరకు వెళ్ళారు.

బుద్ధుడు నిజంగానే "ధర్మవాది" అనే విషయం అశ్వలాయనునికి తెలుసు. అందుకే తాను వేసే ప్రశ్నలు తనవి కాదనే విషయం తెలిసేలా ఇలా అడిగాడు:

**అశ్వలాయనుడు:** "భగవాన్ గౌతమా! బ్రాహ్మణుడు మాత్రమే శ్రేష్ఠ కులంవాడు. మిగిలిన వారు హీన కులంవారు. బ్రాహ్మణులు తెల్లని రంగు కలవారు. మిగిలినవారు నల్లని శరీరం వారు. బ్రాహ్మణుడు మాత్రమే పరిశుద్ధుడు. మిగిలినవారు ఎప్పటికీ పరిశుద్ధులు కాలేరు. బ్రాహ్మణులు బ్రహ్మ మానస పుత్రులు. బ్రహ్మ ముఖం నుండి పుట్టినవారు. బ్రహ్మకు వారసులు. బ్రహ్మకు దాయాదులు - అని వీరంతా అంటున్నారు. మరి దీనికి మీరేమంటారో?'

**బుద్ధుడు:** 'అశ్వలాయానా! బ్రాహ్మణులు కూడా మిగిలిన మనుషులందరిలాగా ఒక తల్లికి పుట్టినవారే. వారి తల్లి కూడా ఋతుమతి అవుతుంది. గర్భవతి అవుతుంది. అందరి తల్లుల్లానే కంటుంది. బాలింత అవుతుంది. తన పిల్లలకు పాలిచ్చే పెంచుతుంది. ఇలా బ్రాహ్మణులు కూడా అందరిలాగా "యోనినుండి పుట్టినవారే. మరి, బ్రహ్మకు వారసులు, బ్రహ్మ ఔరసులూ (ముఖం నుండి పుట్టినవారు), దాయాదులు ఎలా అవుతారు?"

**అశ్వలాయనుడు:** ఈ విషయంలో తమరు ఏమన్నా సరే ఈ బ్రాహ్మణులు మాత్రం బ్రహ్మదాయాదులుగానే భావిస్తారు.

**బుద్ధుడు:** అయితే అశ్వలాయనా, నువ్విది వినలేదా? యవన (గ్రీకు), కాంభోజ (తజకిస్థాన్) దేశాల్లో ఆర్యులు, దాసులు అనే రెండే వర్గాలు ఉంటాయి. అవకాశాన్నిబట్టి దాసులు ఆర్యులుగా, ఆర్యులు దాసులుగా మారిపోతారు? మరి అలాంటప్పుడు బ్రాహ్మణుడు బ్రాహ్మణుడే. బ్రహ్మ వారసుడే అనడం ఎలా?

**అశ్వలాయనుడు:** మీరన్నది నేను విన్నాను గౌతమా! కానీ దానికి వీరు ఒప్పుకోరు.

**బుద్ధుడు:** ఓ అశ్వలాయనా, అందరికీ మరణం వస్తుంది. మరణానికి కులంతో పని లేదు. మరణించాక ఈ శరీరం కుళ్ళిపోతుంది. కాల్చితే బూడిదవుతోంది. కుళ్ళి పోవడానికీ కాలి బూడిదవడానికీ కులంతో పని లేదు కదా!

**అశ్వలాయనుడు:** భగవాన్ ఇది నిజమే! అయినా సరే వీరు బ్రాహ్మణుడే బ్రహ్మ మానస పుత్రుడు అంటారు. బ్రహ్మలోక గతులు వారికే అంటారు.

**బుద్ధుడు:** అశ్వలాయనా! నీవన్నట్లు పుణ్యం దక్కాలంటేపంచశీలాలు పాటించాలి. జీవహింస చేయని వాడు, అబద్ధాలు చెప్పనివాడు, కామ దురాచారి కానివాడు, ఇవ్వని దాన్ని తీసుకోని వాడు, మత్తు పదార్థాలు, మద్య పానం చేయనివారికే పుణ్య లోకాలు దక్కాలి. కానీ, కులం వల్లకాదు గదా!

**అశ్వలాయనుడు:** ఔను గౌతమా! నీవన్నట్లు పంచశీలాల పాటించేవాడికే పుణ్యం దక్కాలి. అయినా వీరు బ్రాహ్మణులే గొప్పవారంటారు.

**బుద్ధుడు:** ద్వేషం లేని మనస్సు, శత్రు భావం లేని ఆలోచనలు ఒక్క బ్రాహ్మణులకే ఉంటాయా?

**అశ్వలాయనుడు:** కాదు, గౌతమా!

**బుద్ధుడు:** మరి, అవి లేని బ్రాహ్మణుడెలా యోగ్యుడవుతాడు?

**అశ్వలాయనుడు:** అయినా గౌతమా! వీరంతా బ్రాహ్మణుడే గొప్పవాడంటున్నారు



మిగార మాత విశాఖ

బుద్ధుడు: అశ్వలాయనా! గంగా, యమునా, అబల్‌వంతి (సరస్వతికి ముందు పేరు) ఇలాంటి నదుల్లో స్నానాలు చేస్తే ఒక్క బ్రాహ్మణుడి వంటికి పట్టిన మురికే వదిలిపోతుందా?

అశ్వలాయనుడు: లేదు గౌతమా! ఎవరైనా శుభ్రపడతారు. అయినా, వీరు బ్రాహ్మణుడే యోగ్యుడు అంటున్నారు.

బుద్ధుడు: అయితే, అశ్వలాయనా, ఇది విను: బ్రాహ్మణులు, క్షత్రియులులాంటి అగ్రవర్ణాలవారు చందనం కట్టెలతో ఒక మంటను చేశారు. అలాగే ఛండాలురు, నిషాదులు, మేదర్లు... ఇలా దిగువ కులాలవారు చాకలి బానలకు వాడిన కలపతోనో, లేదా పందులకు నీరు పెట్టే తొట్టెల కలపతోనో వేరొక మంట చేశారనుకో... ఈ రెండు మంటలూ కాలుతాయా? వాటి వల్లకూడా ఉపయోగం ఒకే విధంగా ఉంటుందా? ఉండదా?

అశ్వలాయనుడు: భగవాన్! రెండు మంటలూ ఒకే ఫలితాన్నిస్తాయి.

బుద్ధుడు: అశ్వలాయనా! ఒక క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను వివాహమాడాడనుకో. వారికి పుట్టిన బిడ్డను తండ్రి వల్ల క్షత్రియుడనీ, తల్లి వల్ల బ్రాహ్మణుడనీ అనవచ్చా?

అశ్వలాయనుడు: అనవచ్చు భగవాన్!

బుద్ధుడు: అలాగే.. ఒక బ్రాహ్మణునికీ, ఒక క్షత్రియ స్త్రీకి పుట్టిన బిడ్డను కూడా అలాగే అనవచ్చుగదా!

అశ్వలాయనుడు: భగవాన్! అనవచ్చు.

బుద్ధుడు: మరి, ఒక ఆడ గుర్రానికీ, మగ గాడిదకీ పుట్టిన సంతానాన్ని గుర్రం అనీ, గాడిద అనీ అంటామా?

అశ్వలాయనుడు: అనము భగవాన్! దాన్ని 'కంచర గాడిద' అంటాం.

బుద్ధుడు: అశ్వలాయనా! ఇద్దరు బ్రాహ్మణులున్నారనుకో – వారిలో ఒకడు బాగా చదివాడు. ఒకడు చదవలేదు. వీరిద్దరిలో అగ్రతాంబూలం ఎవరికి దక్కుతుంది?

అశ్వలాయనుడు: భగవాన్! తప్పనిసరిగా బాగా చదువుకున్నవానికే అగ్రతాంబూలం దక్కుతుంది.

బుద్ధుడు: ఓ! అశ్వలాయనా! ఇద్దరు బ్రాహ్మణులున్నారు. ఒకడు బాగా చదివాడు వాడికి ఉపనయనం కూడా జరిగింది. మరొకడు కూడా బాగానే చదివాడు. కానీ వాడికి ఉపనయనం జరగలేదు. వీరిద్దరిలో ఎవరికి ప్రథమ గౌరవం దక్కుతుంది.

అశ్వలాయనుడు: మొదటివానికే భగవాన్.

బుద్ధుడు: మరైతే మరో ఇద్దరు బ్రాహ్మణులున్నారు. ఒకడు బాగా చదివాడు. అధ్యయనం చేశాడు. కానీ వాడు దుశ్శీలుడు. రెండోవాడు చదువలేదు. అధ్యయనం చేయలేదు. కానీ సచ్ఛీలుడు. వీరిద్దరిలో నీవు ఎవరికి దానం చేస్తావు?

అశ్వలాయనుడు: రెండోవానికే భగవాన్. ఎందుకంటే పాపికి చేసిన దానం పాపాన్నే ఇస్తుంది. అపాత్ర దానం మహాపాపం.

బుద్ధుడు: చూశావా అశ్వలాయనా! ముందు జాతి గొప్పదన్నావు. ఆ తర్వాత వేదం చదివినవాడు గొప్పవాడన్నావు. తరువాత ఉపనయనం జరిగినవాడు గొప్పవాడన్నావు. చివరికి శీలం గొప్పదన్నావు.

ఇలా బుద్ధుడు సంభాషణల ద్వారా 'కులం' కంటే 'గుణం' 'శీలం' మాత్రమే గొప్పవని ఆ వచ్చిన 500 మంది బ్రాహ్మణులతో ఒప్పించాడు.

అంతేకాదు, చివరికి సప్తరుషుల విషయం చెప్పి, ఒక బ్రాహ్మణి అయిన తల్లికి పుట్టిన బ్రాహ్మణుడికి, తన తండ్రి బ్రాహ్మణుడో, కాదో తెలుసా? అంతేకాదు, తండ్రి తరఫున ఏడు తరాల వరకూ, తల్లి తరఫున ఏడు తరాల వరకూ బ్రాహ్మణేతర సాంగత్యం జరగలేదనే విషయం కూడా ఆ పుట్టిన బ్రాహ్మణుడికి రూఢిగా తెలుస్తుందా? అనీ ప్రశ్నించాడు.

దానికి వారంతా తెలియదు అనే సమాధానం చెప్పారు. (ఈ బ్రాహ్మణేతర సాంగత్యం మీదే 'వంశ వృక్షం' అనే నవల ఆధారంగా బాపు దర్శకత్వంలో సినిమా కూడా వచ్చింది. బ్రాహ్మణ రక్తం వర్ణ సంకరం కాకూడదనుకునే ఒక నిష్ఠాగరిష్ఠుడైన బ్రాహ్మణుడే బ్రాహ్మణేతరునికి పుట్టాడనేది ఆ సినిమా ఇతివృత్తం.) చివరికి వారంతా బుద్ధుణ్ణి శరణు వేడుతారు. అశ్వలాయనుడు బౌద్ధ భిక్షువుగా మారతాడు. ❀

---

బొర్రా గోవర్ధన్, నగరం, గుంటూరు జిల్లా, ఫోన్ : 9390600157

# మానసిక వైద్యుడు

*- చంటిగారి శ్రీనివాస రెడ్డి*

వైద్యులు రెండు రకాలు; శారీరక అనారోగ్యాలకు వైద్యం చేసేవారు ఒకరకం, మానసిక రుగ్మతలకు వైద్యం చేసేవారు రెండవరకం. ఏ రకమైన శారీరక అనారోగ్యం లేకుండా ఒక సంవత్సరము, రెండు సంవత్సరాలు, మూడు సంవత్సరాలు, నాలుగు సంవత్సరాలు, పది సంవత్సరాలు, ఇరవై, ముప్పై, నలభై, ఏభై సంవత్సరాలు, వంద సంవత్సరాలు, కూడా బ్రతికి ఉండవచ్చు. కాని ఏ ఒక సందర్భంలోనైనా ఏరకమైన మానసిక రుగ్మత లేకుండా ఎవరూ జీవించలేరు.

ఈ ఆధునిక కాలంలో మానిసిక సమస్యలు చాలా ఎక్కువైనవి. పని ఒత్తిడి, ఆత్రుత, ఆవేశం, ఆందోళన, అనుమానం, అభద్రతా భావం ఎక్కువైంది. వీటివలన చాలా రకాల దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడుతున్న వారి సంఖ్య కూడా రోజు రోజుకి పెరుగుతుంది. నిరాశ, నిస్పృహలు ఎక్కువై ఆత్మహత్య చేసుకొనే వారి సంఖ్య కూడ రోజు రోజుకి పెరిగి పోతుంది. ఆర్థిక ఇబ్బందులు ఎక్కువైనవని కొందరు, పరీక్షల్లో ఫెయిల్ అయ్యారని కొందరు, తల్లి దండ్రులు, టీచర్ మందలించారని మరి కొందరు ఆత్మహత్య చేసుకుంటున్నారు. తను నమ్మిన వ్యక్తులు నమ్మక ద్రోహం చేశారని, అయిన వాళ్ళు అన్యాయం చేశారని, ఇంజనీరింగ్, వైద్య విద్య చదువుతూ కూడా సీనియర్లు అవమాన పరిచారని, మార్కులు తక్కువ వచ్చాయని కూడ కొందరు విద్యార్థులు ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఇలాంటి వార్తలు ఎన్నో మనం టి.వి లో, పేపర్లో చూస్తున్నాము.


ధమ్మ దూత పూర్ణుడు

ఊహించని సంఘటనలు, మనస్సుకు కష్టం కలిగించేవి ఎదురు కాగానే చాలా మంది మానసికంగా ఒత్తిడికి, ఘర్షణకు గురి అయి, నిద్రపట్టక గందర గోళానికి గురి అవుతూ అనవసర ఔషధాలు వాడుతూ శారీరక మానసిక ఆరోగ్యాన్ని పాడుచేసుకుంటున్నారు. సరియైన వైద్యం అందక, వారికున్న జబ్బు కన్నా, వారు వాడే ఔషధాలే వారికి ఎక్కువ హాని చేస్తున్నాయి. ఈ పరిస్థితికి ముఖ్యకారణం మనకున్న సమస్యపై సరియైన అవగాహన లేకపోవడమే.

విపరీతమైన కోరికలు, కోపం, అహంకారం, భయం, మూర్ఖత్వం ఎక్కువ అవడం వలన రోజు రోజుకి మానసిక వికలాంగులు ఎక్కువ అవుతున్నారు. బిడ్డలకు ఏమి కావాలో, ఏమివద్దో, వారి మానసిక పరిస్థితి ఏమిటో తల్లిదండ్రులకు అర్థం కావట్లేదు. విద్యార్థుల బలమేమిటో, బలహీనతేమిటో, వారి ప్రత్యేకత ఏమిటో, వారి లక్ష్యం ఉపాధ్యాయులకుసైతం తెలియట్లేదు. ప్రజలకు ఏమికావాలో, వారి సౌకర్యాలు ఏమిటో, అసౌకర్యాలు ఏమిటో గుర్తించే పరిస్థితి పరిపాలించే వారిలోనూ లేదు.

భగవాన్ బుద్ధుడు గొప్ప మనస్తత్వ వేత్త (Psychologist) మరియు గొప్ప మానసిక వైద్యులు (psychiatrist) బుద్ధుడు తన జీవితకాలంలో ఎనభైనాలుగు వేల ప్రవచనాలు చెప్పారు. వారు సందర్భానుసారంగా, వచ్చిన వ్యక్తుల మానసిక పరిస్థితి, వారి అర్హత, శ్రద్ధను దృష్టిలో పెట్టుకొని ప్రవచనము చెప్పేవారు తప్ప, ఏ రోజూ ఆయన తన పాండిత్యాన్ని ప్రదర్శించ లేదు. బుద్ధుని ప్రవచనము ముగిసిన తర్వాత, వారి ప్రవచనాన్ని శ్రద్ధతో విన్న వారందరు ఈ ప్రవచనము తనకోసమే చెప్పారని ఎవరికి వారు అనుకొనే వారు.

బుద్ధుడు సల్లేఖ సుత్తలో నలభై నాలుగు రకాల మానసిక రుగ్మతలు మరియు వాటికి పరిష్కారాలను తెలియజేశాడు. వాటి గురించి మరింత విపులంగా తెలుసుకుందాం.

1. కఠినహింస, చిత్రహింస మరియు యితరుల మనస్సుకు బాధ కలిగించుట.
2. జీవహింస
3. ఇతరులు కలిగియున్న వాటిని పొందాలని ఆశ కలగడం.
4. వ్యభిచారం
5. అసత్యపు మాటలు చెప్పేవాడు
6. వ్యక్తియొక్క బాహ్య ప్రవర్తన, సందర్భానికి తగినటు వంటి కల్పిత కథలు చెప్పేవాడు
7. మోటుగా, క్రూరమైన, కఠినమైన, అసౌకర్యమైన మాటలు మాట్లాడటం.
8. ఫలితం లేని మాటలను ప్రచారం చేయుటం
9. ఇతరుల వస్తువుల మీద వ్యామోహం కలిగి యుండటం
10. అనైతికమైన పనికిరాని ఆలోచనలతో కూడిన మనస్సు
11. చెడుదృష్టి కలిగియుండుట, తప్పుగా చూడటం
12. దుష్టమైన, హానికరమైన, దురదృష్టకరమైన, అసహ్యకరమైన ఆలోచనలు చేయడం
13. చెడు మాటలు మాట్లాడే వాడు
14. చెడు పనులు చేయడం
15. చెడు సంపాదన ఎడల ప్రీతి
16. చెడుదారిలో తీవ్రమైన, శారీరక మానసిక శ్రమ పడటం
17. చెడు లక్ష్యాన్ని కలిగి యుండటం
18. చెడు మీద మనస్సును లగ్నం చేయుటం
19. తను చేసే చెడుపనులను మంచి పనులుగా సమర్థించు కొనుట
20. విచ్చలవిడిగా ఉండడాన్ని ప్రోత్సహించుట
21. సోమరితనంగా ఉండటం దానిని ప్రోత్సహించడం, సమర్థించడం
22. అహంకారంగా ఉండటం, తన విలువల గురించి గొప్ప అభిప్రాయము కలిగియుండుట
23. సందేహము, నిశ్చయానికి రాలేని మానిసిక స్థితి
24. చిన్న చిన్న విషయాలకు కూడా త్వరగా కోపము తెచ్చుకొనే స్వభావం
25. ద్వేషం, పగ, వైరం
26. కపటం, మాయ, వంచన, మోసం
27. ద్వంద్వ వైఖరి
28. అసూయ
29. పిసినారి, దురాశ కలిగిన వ్యక్తి
30. వాస్తవాన్ని దాచి పెట్టడం, వంచన చేయుట, మోస ప్రవృత్తి
31. లేనిది ఉన్నట్లుగా నటించుట
32. మొండితనంగా, మంచికి అనుకూలంగా లేకపోవటం
33. నేను అనే అహంభావమే తన ప్రధాన సిద్ధాంతంగా ఉండుట
34. వినయ విధేయతలు లేక పోవడం
35. హానికరమైన, దుష్టకరమైన, అసహ్యకరమైన స్నేహితులను కలిగియుండటం
36. అయిష్టంగా, విముఖతగా ఉండటం
37. మంచిపై శ్రద్ధ లేకపోవుట
38. సిగ్గులేకపోవడం, పరువు నష్టం కలిగించే పనులు చేయుట
39. తప్పుచేయటం, ధిక్కరించడం, తప్పుచేయడానికి భయపడక పోవడం
40. సరియైన జ్ఞానం లేకపోవడం, ధర్మవిద్య లేకపోవడం
41. నిరుత్సాహంగా ఉండటం
42. ఎరుక లేకపోవడం, జాగరూకత లేకపోవడం
43. వివేకంగా లేక పోవుట, బుద్ధిలేని వాడిగా ఉండటం
44. తను నమ్మిన దాన్నే గుడ్డిగా పట్టుకొని వ్రేలాడటం

ఈ నలభై నాలుగు రకాల మానసిక రుగ్మతలు పెరిగే కొద్దీ మనిషి పతన మవుతున్నాడు. వీటన్నిటికీ కారణం



ఆనంద బోధి

మనిషిలోని రాగ, ద్వేష మోహాలను తొలగించుకొనే ప్రయత్నం చేయకపోవడం, జీవితంలో వచ్చే సుఖదుఃఖాలు, లాభనష్టాలు, కీర్తి-అపకీర్తి, నిందాప్రశంసలపై సరైన అవగాహన పెంచుకుంటూ ప్రతిక్రియ చేయకుండా ఎవరైతే ఉండగలుగుతారో వారికి దుఃఖం ఉండదు.

బుద్ధుడు, గృహస్థ జీవితం గడుపుతున్న వారికి వచ్చే మానసిక రుగ్మతలను ఎదుర్కోవడానికి మొదట దానం చేయడాన్ని తెలుసుకోమన్నాడు. విసుగుతోనో చిరాకుతోనో కాని, కోపంతోనో, భయంతోనో, మొహమాటంతోనో, అహంకారంతోనో, గుర్తింపు కోసమో కాకుండా, సరియైన అవగాహనతో, మనస్ఫూర్తిగా దానం చేయడం నేర్చుకోవాలి. దానం అంటే కేవలం డబ్బు ఇవ్వడం, అన్నం పెట్టడం అనే కాదు, మంచి పనులకు ఉపయోగపడటం, మంచి సలహా ఇవ్వటం, ఉపయోగపడే పుస్తకాలను ఇవ్వడం కూడ దానం అవుతుంది. మంచి ఉద్దేశ్యంతో ఇతరులకు ఉపయోగపడాలని మనస్ఫూర్తిగా చేసేది ఏదైనా అది దానము అవుతుంది. ఇలా దానము చేస్తూ పంచశీల పాటిస్తూ, పది పారమితలను పుష్టి చేసుకుంటూ, చతురార్యసత్యాలపై సరియైన అవగాహన పెంచుకుంటూ ఆర్య అష్టాంగ మార్గాన్ని అనుసరిస్తే మనోవికారాలన్నీ తొలగిపోయి మనస్సు నిర్మలంగాను, నిశ్చలంగాను ఉంటుంది. మనస్సు నిర్మలంగా ఉండాలంటే ఈ క్రిందివి పాటించాలి.

**పంచశీల :**

1. అహింసను పాటించుట
2. అబద్ధం చెప్పకుండుట
3. దొంగతనం చేయకపోవడం
4. వ్యభిచారము చేయకుండుట
5. మత్తు పానీయాలను సేవించకుండుట


యజ్ఞ యాగాలకు జంతు బలులను నిరసించుట

**చేయకూడని అయిదు చెడ్డ వ్యాపారాలు :**

1. ఆయుధాల వ్యాపారము
2. శరీరంతో వ్యాపారము
3. మాంసం వ్యాపారము
4. సారామత్తు పానీయాల వ్యాపారం
5. ప్రాణాంతక విషాల వ్యాపారము

తరువాత మన మనోబలాన్ని పెంచి ధ్యానంలో మంచి ప్రగతి సాధించడానికి ఈ పది పారమితలు ఎంతగానో తోడ్పడతాయి. ఈ పది గుణాలు మనోక్షేత్రాన్ని ఎంతో సారవంతము చేస్తాయి. అవి :

1. దాన పారమి
2. శీల పారమి
3. నెక్ఖమ్మ పారమి (త్యాగ పారమి)
4. ప్రజ్ఞా పారమి
5. విరియ పారమి
6. క్షాంతి పారమి
7. సచ్చ (సత్య) పారమి
8. అధిట్ఠాన పారమి
9. మెత్త (మైత్రి) పారమి
10. ఉపేక్ఖా పారమి (ఉపేక్షా పారమి)

**చతురార్య సత్యాలు :** బుద్ధుని ప్రవచనాలలో ఎంతో విలువైన ప్రవచనము ఈ ఆర్య సత్యాల గురించి తెలియజేయడం. బౌద్ధంలో అవిద్య అంటే చతురార్య సత్యాలను, కర్మ గురించి, త్రి శరణాల గురించి తెలుసుకోక పోవడమే.

ఇప్పుడు క్లుప్తంగా చతురార్య సత్యాలను గురించి తెలుసుకుందాం :

1. దుఃఖం
2. దుఃఖ సముదయం
3. దుఃఖ నిరోధం
4. దుఃఖ నిరోధ మార్గం (ఆర్య అష్టాంగ మార్గం).

**(ఆర్య అష్టాంగ మార్గం) :**

| | | |
|---|---|---|
| 1. సమ్యక్ దృష్టి | - | సమ్మా దిట్ఠ |
| 2. సమ్యక్ సంకల్పం | - | సమ్మా సంకప్ప |
| 3. సమ్యక్ వాక్కు | - | సమ్మా వాచ |
| 4. సమ్యక్ కర్మ | - | సమ్మా కమ్మన్త |
| 5. సమ్యక్ జీవనం | - | సమ్మా ఆజీవ |
| 6. సమ్యక్ వ్యాయామం | - | సమ్మా వాయామో |
| 7. సమ్యక్ స్మృతి | - | సమ్మా సతి |
| 8. సమ్యక్ సమాధి | - | సమ్మా సమాధి |

ఈ ఆర్య అష్టాంగ మార్గాన్ని ప్రజ్ఞ-శీల-సమాధి అనే మూడు ముఖ్య భాగాలుగా విభజించారు. మొదటి రెండు ప్రజ్ఞ క్రిందకు, తరువాత మూడు శీల విభాగం క్రిందకు ఆ తరువాత మూడు సమాధి క్రిందకు వస్తాయి.

ఆనాపాన సతి ధ్యానం చేస్తూ వీటిపై నిత్యం అవగాహన పెంచుకుంటూ నిత్యజీవితంలో ఆచరిస్తూ ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలి. అప్పుడే మనస్సు నిర్మలంగా ఉంటుంది.

బుద్ధుడు తన జీవిత కాలంలో ఎంతోమందికి మానసిక వైద్యం చేశాడు. అందులో ముఖ్యంగా కిసా గౌతమి, పటాచార, అంగుళిమాలుడు మొదలగు వారు. కిసా గౌతమి ఆలస్యంగా మగబిడ్డకు జన్మ నిచ్చింది. పిల్లలంటే చాలా ఇష్టం. ఎంతో అల్లారుముద్దుగా పెంచు కుంటున్న కొడుకు నడక నేర్చుకుంటున్న సమయంలో జబ్బుతో మరణించాడు. మందు యిప్పిస్తే బ్రతుకు తాడమోనని శవాన్ని ఎత్తుకొని వీధిన పడింది. నవ్వుల పాలయింది, కొందరు చనిపోయినవాడు ఎలా బ్రతుకుతాడు అని, పిచ్చిదని రకరకాలుగా ఎగతాళి చేశారు. ఒక పెద్దాయన ఆమెను బుద్ధుని దగ్గరకు వెళ్ళమని, నీకు సరియైన వైద్యుడు బుద్ధుడే అని సలహా ఇస్తాడు. ఆమె బుద్ధుని కలవగా, ఆయన "గౌతమీ, నీవు వెళ్ళి ఏ ఇంట అయితే మరణం సంభవించ లేదో ఆ యింటి నుండి పిడికెడు ఆవాలు తెమ్మని చెప్పాడు. ఆమె ఇల్లిల్లు తిరిగింది. కాని మరణం లేని ఇల్లు ఆమెకు కనిపించలేదు. ఆ విషయమే బుద్ధునికి నివేదించింది. ఆమెకు ప్రపంచంలో ఏదీ శాశ్వతం (అనిత్యం) కాదని బోధించాడు. కిసా గౌతమికి జ్ఞానోదయం కలిగి ఉత్తమ భిక్షుణిగా పేరు గాంచింది.

**పటాచార :** శ్రావస్తిలో ధనవంతుడైన వ్యాపారి తన కూతురు పెళ్ళికి ఏర్పాట్లు చేస్తుండగా, ఆమె తన ఇంట్లో పనిచేసే సేవకునితో లేచిపోయింది. అతడు వ్యవసాయపు పనులు చేసుకుంటూ, ఆమె పాచిపనులు చేసుకుంటూ కాలం గడుపుతుంటారు. ఆమె గర్భం దాల్చింది. అప్పుడు ఆచారం ప్రకారం పుట్టింటికి వెళ్ళాలి అంటే భర్త వద్దని వారిస్తాడు.

ఆ తరువాత మరల కొంత కాలానికి, రెండవ ప్రసవానికి పుట్టినింటికని బయలుదేరుతుంది. కొంతదూరం వెళ్ళేసరికి భర్త తెలుసుకొని దారిలోనే ఆమెను వద్దని వారించాడు. వారు తిరిగి వస్తుండగా పెనుతుఫాను వచ్చింది. పురిటి నొప్పులు ప్రారంభం అయ్యాయి. ఆమెకు రక్షణ కల్పించడానికి ఆకులు, కర్రలు తెద్దామని భర్త అడవికి వెళ్తాడు. అతను పాము కాటుతో అక్కడే మరణిస్తాడు. ఆమె పుట్టింటికి వెళ్ళాలి అంటే నదిని దాటవలసి ఉంది. పెద్దపిల్ల వాడిని ఈగట్టున వదిలి, పసికందుతో ఆ వైపుకు పోయి, ఆ బిడ్డను అక్కడ వదిలి, ఈవలికి వస్తుంటే, ఈ లోపల ఆ పసికందును, రాబందు మాంసపు ముద్దగా భావించి, అది తన్నుకు పోతుంటే, చేతులు ఊపుతూ నది మధ్య నుండి కేకలు పెట్టింది. తల్లి తనను పిలుస్తుందని పెద్ద పిల్లవాడు నదిలో దిగి కొట్టుకు పోయాడు. ఎలాగో తను బయటపడి శ్రావస్తి చేరుకొని తల్లిదండ్రుల గురించి వాకబు చేయగ తాను చేసిన పనికి అవమాన భారంతో ఇంటికి నిప్పు పెట్టుకొని తల్లిదండ్రులు చనిపోయారని తెలుసుకొని ఆమెకు పిచ్చి పట్టినంత పనైంది. ఇద్దరు బిడ్డలను, భర్తను, తల్లిదండ్రులను కోల్పోయి ఆమె పిచ్చిదానిలాగా ఒంటి మీద వస్త్రము కూడ పోయిన విషయం గమనించక వీధుల వెంట తిరుగుతూ బుద్ధుని చెంతకు చేరింది. ఆమెను ముందు సేద దీర్చి, బట్టలిచ్చి ఆమె దీనగాథ విన్నాడు.

ఓ మహిళా! ఎందుకు, ఇలాంటి జీవితాన్ని గడుపుతున్నావు. నా అనే వారు లేరన్న సంగతి బాగా అర్థం చేసుకొని జ్ఞానులైన వారు సుగుణాలతో నిర్వాణ మార్గాన్ని చేరుకోవాలని బోధిస్తారు. పటాచార ఏకాగ్ర మనస్సు అయి, నిర్వాణం పొందింది. వినయంలో ఆమెను అగ్రగామిగా బుద్ధుడు ప్రకటించాడు.

**అంగుళి మాలుడు :** ఇతని అసలు పేరు అహింసకుడు. తక్షశిలలో విద్యను అభ్యసిస్తూ గురువు అభిమానాన్ని చూరగొన్నాడు. దీనిని సహించలేని తోటి విద్యార్థులు అతని మీద లేనిపోని చాడీలు చెప్పి గురువు మనస్సు విరిచి వేశారు. తన స్థానాన్ని ఆక్రమించ చూస్తున్నాడు అని గురువు అతనిని చంపాలను కొని దురుద్దేశ్యంతో గురుదక్షిణగా వేయి మంది వ్రేళ్ళు మాలగా తెచ్చి సమర్పించ వలసిందిగా



ఎవడు వృషలుడు?

కోరాడు. అహింసకుడు మొదట అంగీకరించకపోయినా గురువు పట్టుదలతో అంగీకరించక తప్పలేదు. గురువు ఉద్దేశ్యం ఏమిటంటే వేయిమందిని చంపేలోపు రాజు అతనిని చంపివేస్తాడని అలా అడుగుతాడు. అహింసకుడు అడవిలో ఉంటూ 999 మంది యాత్రికులను చంపి వారి వేళ్ళను మాలగా కూర్చాడు ఇంకొక్క వ్రేలే కావాలి. బుద్ధుని చూచిన అంగుళీ మాలుడు వెయ్యో వ్రేలు ఇతనితో పూర్తి అవుతుందని భావించి ఆగు అని అరుస్తూ అంగుళీ మాలుడు బుద్ధుని వైపు వెళ్తాడు కాని, "నేను ఎప్పుడూ ఆగే ఉన్నాను అహింసకా నీవే ఆగలేదు" అని బుద్ధుడు అన్నాడు. "అంగుళీమాలా నేను ఎప్పటికి ఆగిపోయే ఉన్నాను. జీవులన్నింటి మీద హింసను మానివేశాను, నీకా జీవులఎడ నిగ్రహం లేదు. అందుకనే నేను ఆగాను, నీవు ఆగలేదు" అని బుద్ధుడు అన్నాడు. అంగుళీమాలుడు మారిపోయాడు. బుద్ధుని శరణు వేడాడు. అంగుళీమాలుడు ఎంతో దయామయ భిక్షువుగా మారాడు.

ఇలా ఎంతో మందికి బుద్ధుడు మానిసిక వైద్యం చేశాడు. అందు వలన వీరు గొప్ప మానిసిక వైద్యులని, మనస్తత్వ వేత్త అని మనమందరము తెలుసుకోవాలి. వారిచ్చిన ఆధ్యాత్మిక ఔషధాలను స్వీకరించి, మధ్యస్త మార్గాన్ని పాటిస్తూ, కళ్యాణ మిత్రులుగా పరస్పరం సహకారం చేసుకుంటూ ఈ ధర్మమార్గంలో, రాజమార్గంలో నిర్వాణం పొందాలని కోరు కుంటున్నాను.

డాక్టరు చంటిగారి శ్రీనివాస రెడ్డి,
ఫోన్ : 9849311810



ధర్మాన్ని అర్థం చేసుకొన్న సుజాత



భిక్షుణి శిశుపచాలాను వెంబడిస్తున్న యువకుడు



సుందరిక భారద్వాజుడు

# ఆంధ్రదేశంలో బౌద్ధ సంప్రదాయాలు

- మల్లంపల్లి సోమశేఖర శర్మ

తెలుగుదేశంలో బౌద్ధం ఎప్పటి నుండి పరివ్యాప్తమైనదో తెలియదు. కాని, బుద్ధుడు జీవించి యుండగనే ఆ మహా మహుని బోధలు దక్షిణా పథవాసుల హృదయాలను ఆకర్షించిన వనుటకు ఆధార మున్నది. దక్షిణాపథ నివాసియైన నటుడొకడు బుద్ధుని సమకాలికుడయిన బిందుసారమహీపతి సమక్షమున మహాసంబోధి వరకు బుద్ధజీవితాన్ని నాటకంగా ప్రదర్శించెననీ, దక్షిణాపథం నుంచి వెళ్లిన మరికొందరు నటులు శోభావతీ నగరాధిపతి సమక్షమున బుద్ధ నాటకాన్ని ప్రదర్శించినారనీ, అందులో సూత్రధారుడే బుద్ధవేషాన్నీ, తదితరులు బౌద్ధ భిక్షువుల పాత్రలనీ ధరించారనీ టిబెట్టు దేశ బౌద్ధ గ్రంథాల వల్ల తెలుస్తుంది. బుద్ధుని ప్రధాన శిష్యులలో ఒకడయిన మహాకాత్యానుడు ఒక అస్సక రాజుకు బౌద్ధ దీక్ష యిచ్చినట్లు విమాన పత్థువ్యాఖ్యలో ఉంది. అస్సక మన్నది తెలంగాణాలోని యిప్పటి నిజామాబాదు జిల్లా ప్రాంతము. దీనికి పోతన రాజధాని. పోతన ఇప్పటి నిజామాబాదు జిల్లాలోని బోధన్.

బుద్ధుని జీవితకాలంలో కాకపోయినా, బౌద్ధం ఆయన నిర్వాణం పొందిన కొద్దికాలానికే తెలుగుదేశంలోని భాగమైన కళింగ దేశంలో వ్యాపించింది. దహనమైన వెనుక చితి నుండి బుద్ధుని ఎడమకోరపంటిని తీసి జాగ్రత్తపెట్టి ఖేమా థేరుడనే ముని కళింగ దేశాధిపతికిస్తే ఆ రాజు దానికొక రత్నకరండం చేయించి దానిలో పెట్టి పూజిస్తూ వచ్చాడు. ఆ రాజు రాజధాని దంతపురం బుద్ధదంత మహిమవల్ల బౌద్ధవాఙ్మయంలో చాలా ప్రసిద్ధి చెందింది. ఈ దంత ధాతువుకోసం కళింగం మీదకి ఎందరు రాజులో దండెత్తి వచ్చారు, దానిని బలిమినైనా తీసుకుపోవాలనే ఉద్దేశ్యంతో; చివరకా దంత ధాతువు సింహళ ద్వీపానికి వెళ్ళింది. ఇప్పటికీ అది అక్కడుందంటారు.

బుద్ధుడు తాను జీవించి ఉన్నంత కాలము సాంఘికులలో అభిప్రాయ భేదాలవల్ల చీలికలు రాకుండా ఆపు చేశాడు. ఆయన నిర్వాణం పొందిన తరువాత బౌద్ధసాంఘికులలో బుద్ధుడుపదేశించిన ధర్మాల విషయంలో అభిప్రాయ భేదం కలిగింది. అప్పుడు సప్రమాణంగా బౌద్ధ ధర్మాన్ని గ్రంథస్థం చేయుటకు అజాతశత్రుని ఆదరణ క్రింద రాజగృహంలో ఒక గొప్ప బౌద్ధ మహాసభ జరిగింది. దీనిలో బౌద్ధధర్మం నిర్వచింపబడి గ్రంథస్థం అయింది. అటు తరువాత బుద్ధుడు గతించిన వంద సంవత్సరాలకు వేసాలిలోని వజ్జికులమువారు దశవత్థూని దశవస్తువుల విషయంలో ప్రాచీనాచారం ఉల్లంఘిస్తూ వచ్చారు. ఈ దశవస్తువులలో బౌద్ధసాంఘికులు స్వర్ణరజతములను పరిగ్రహించకూడదు, మద్యపానం చేయకూడదు. ఈవిషయాన్ని విచారించి ఆచార నిర్ణయం చేయుటకు రెండవమారు బౌద్ధమహాసభ వైశాలిలో సమావేశమయింది. థేరులు ఈ దశవస్తువుల విషయము ప్రాచీనాచారం ఉల్లంఘించిన సాంఘికులను బహిష్కరించారు, ధర్మం నిర్ణయించారు. పదివేలమంది భిక్షులు థేరసంఘాన్ని విడిచిపెట్టి పోయినారు. వీరే అధిక సంఖ్యాకులుగా ఉండడం వల్ల ఈ వర్గంవారికి మహాసాంఘికులని పేరు కలిగింది. అప్పటినుండి బౌద్ధసంఘం థేరులని, మహాసాంఘికులని రెండు పక్షాలయింది. థేరులు శీలమునకు,



ఆదర్శ దాంపత్యం

నీతికి, ఆచారమునకు ప్రాధాన్యమిస్తే – మహాసాంఘికులు తత్వవిచారమునకు, లోకోపకార విషయములకు ప్రాముఖ్యం ఇచ్చారు. థేర సంప్రదాయం లోని ఒక శాఖకు విభజ్యవాదమని పేరు.

అశోక చక్రవర్తి ఈ సంప్రదాయం వారిని అధికంగా ఆదరించాడు. అశోకచక్రవర్తి కాలంలో పాటలీపుత్ర నగరమూ మగధ దేశమూ భారతదేశంలో బౌద్ధానికి కేంద్రాలయినవి. మౌర్యులకు తరువాత మగధను పాలించిన శుంగవంశజులు, కాణ్వవంశజులు బౌద్ధులను హింసించడం వల్ల థేరవాదులు సింహళ గాంధారములకు, మహాసాంఘికులు తెలుగు దేశానికీ వలసపోయినారు. మౌర్య సామ్రాజ్యం పతనమైన తరువాత హిందూ దేశంలో బౌద్ధానికి ఆంధ్రదేశమే కేంద్రమయింది. మహా దేవ థేరుడనే ముని ఆంధ్ర దేశానికి వచ్చి ఇచ్చట చైత్యక సంప్రదాయం స్థాపించాడు. మహాసాంఘికులలోని ఆరు సంప్రదాయము లలో ఈ చైత్యక సంప్రదాయం ఒకటి. గోకులిక, ఏకవ్యవహారిక, ప్రజ్ఞప్తివాద, బహుశ్రుతీయ లోకోత్తరవాద సంప్రదాయములు మిగిలినవి.

మహావస్తులో ఉన్నట్టు మహా చైత్యపూజకు ఎక్కువ ప్రాముఖ్యమివ్వడంవల్లనేమో ఈ సంప్రదాయానికి చైత్యక సంప్రదాయమని పేరు వచ్చింది. చైత్యక సంప్రదాయం వారికి ధనకటకం అంటే అమరావతి కేంద్రమయినది. ఈ చైత్యకులలో మరల పూర్వశైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థకములని మళ్లీ నాలుగు సంప్రదాయము లేర్పడినవి. ఈ చైత్యకులు అంధకులు, ఆంధ్ర దేశంలోనివారు. పూర్వశైలమన్నది ధనకటక మహాచైత్యమునకు తూర్పున, అపరశైలము ఆ మహా చైత్యమునకు పడమట నున్న



**సారిపుత్రుడు తన తల్లికి ధర్మాన్ని బోధించుట**

బౌద్ధసంఘములపేరు. పూర్వశైలము ఇప్పటి ఘంటసాల, అపరశైల మిప్పటి నాగార్జునునికొండ కావచ్చునేమో. నాగార్జునునికొండ శాసనములలో బహుశ్రుతీయులు, అపరశైలీయులు, పూర్వశైలీయులు, రాజగిరికులు, విభజ్యవాదులు మొదలైన వేరువేరు సంప్రదాయాలవారు ఉదాహృతులయినారు. వీరందరు అక్కడి విహారాలలో ఉండినట్లు ఊహింపవచ్చును. టిబెట్టు దేశ ఐతిహ్యమును అనుసరించి పూర్వశైల అపరశైల నికాయములవారి ప్రాకృతభాషలో రచించిన ప్రజ్ఞాపారమిత అనే గ్రంథం ఉండేదనిన్నీ, దీనిలోనే మహాయానమునకు సంబంధించిన భావాలు బీజప్రాయంగా ఉండేవనీ, ఇవి మహాయాన సంప్రదాయం రూపొందడానికి చాలా తోడ్పడినవని పరిశోధక పండితులంటారు.

కనిష్క చక్రవర్తి నాలుగవతడవ బౌద్ధ సభను సమావేశపరిచేనాటికే మహాయానమునకు సంబంధించిన భావాలు దేశమంతటా పొటమరించి ఉన్నవి. వాటి కోరూపమిచ్చి ఒక గొప్ప సంప్రదాయం మహాయానంగా రూపొందించిన ఆయన నాగార్జునాచార్యులవారు. మహాయానం రూపొందడంతో బౌద్ధం ప్రతివ్యక్తికీ, ప్రతిగృహస్థుకూ అందుబాటులోనికి వచ్చింది. బౌద్ధం బహు వ్యాప్తమయింది. అంతటినుంచి బౌద్ధంలో తత్వజిజ్ఞాస ఎక్కువయింది.

నాగార్జునాచార్యుల వారు తత్వవిచారము కావించి శూన్యవాదం ప్రతి పాదించారు. కాని దీనితో సాంఘికులకు తృప్తి కలుగలేదు. అప్పుడు మైత్రేయ నాథుడు విజ్ఞానవాదమును ప్రతిపాదించారు. నిర్వాణం పొందిన తరువాత మిగిలేది శూన్యమని నాగార్జునాచార్యులవారంటే విజ్ఞానమని మైత్రేయ నాథుడన్నాడు. విజ్ఞానవాదమునకే యోగాచారవాద మనిన్ని పేరు. ఇంకను బౌద్ధంలో తత్వవిచారం ముదిరి విజ్ఞానానికి మహాసుఖం కూడా కలిసింది.

ఈ మహాసుఖ వాదంలోనుంచే వజ్రయానం ఆవిర్భవించింది. బౌద్ధం పొందిన దశలలో ఇది కడపటిది. వజ్రయానం రావడంవల్ల బౌద్ధంలో సంఖ్యాతీతంగా దేవీదేవతలు వెలిశారు. విగ్రహనిర్మాణం ప్రబలింది. అమరావతిలో దొరికిన సింహనాద, పద్మపాణి, బుద్ధసంభవ రత్నములనే విగ్రహాలు వజ్రయానానికి సంబంధించినవే. దీనిలో తాంత్రిక పూజ, వామాచారం ప్రబలి బౌద్ధం

ప్రజాదరం కోల్పోయింది. బౌద్ధం బాగా వర్ధిల్లిననాడు నాగార్జునునికొండ, ధనకటకాలు గొప్ప బౌద్ధవిద్యాపీఠాలుగా ఉండేవి. వీటికి దేశాంతరాలనుంచీ, ద్వీపాంతరాలనుంచీ కూడా విద్యా సముపార్జనం నిమిత్తం బౌద్ధభిక్షువులు వస్తూ వుండేవారు. దేశంలోని ధనకటకాది స్తూపాలలోని శిల్పచిత్రాలు కావ్యశోభను నంతరించుకొన్నవి. తెలుగుదేశపు స్తూపాలు బౌద్ధాంధ్రులు బుద్ధభగవానునికి భక్తిసంభరితులై ఎత్తిన శిల్పకర్పూర దివ్య నీరాజనాలు.

మహాయానం మూలంగానే బౌద్ధంలో కళకు తావేర్పడింది. నాగార్జునాచార్య శ్రీపాదులు ఎంతటి తాత్త్విక విచారశీలియో, ఎంతటి లోకహితైషియో అంతటి కళాప్రియుడు. ధనకటక మహాచైత్యంచుట్టూ శిల్పచిత్ర రత్నాలతో పొదిగిన మహాప్రాకారం నిర్మించినది ఆయనే అని టిబెట్టు దేశచరిత్రలు చెపుతాయి. ఈ ప్రాకారంలోని ప్రతి శిల్పచిత్రమూ జీవం ఉట్టిపడుతూ నిన్ననో మొన్ననో చెక్కినట్లు కలకలలాడుతూ ప్రాతఃకాలంలో విరిసిన నవమల్లికా కుసుమంలాగ అచ్ఛస్వచ్ఛంగా ఉంటాయి.

ధనకటక మహాచైత్య ప్రాకారంలోని శిల్పచిత్రాలే కాదు, నాగార్జునికొండ, గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి ఈ మొదలైనచోట్ల ఉన్న స్తూప శిల్ప చిత్రాలు కూడా ధనకటక ప్రాకార శిల్ప చిత్రాలకు తీసిపోయేవి కావు. తెలుగుదేశంలో బౌద్ధం అవతరించి తెలుగుజాతిని కళావంతము చేసింది, తెలుగు శిల్పికృతులలో అమృతం చిలికింది. అందువల్లనే అంతకు పూర్వపు బౌద్ధ క్షేత్రాలలో స్తూపశిల్ప చిత్రాలు వట్టి నీరస ప్రతిమలైతే తెలుగు మహాయాన మవతరించి ఆదిమ బౌద్ధము స్వరూప స్వభావములనే పూర్తిగా మార్చివేసింది.

హీనయాన బౌద్ధుడు తన నిర్వాణమునకే తన సంసార దుఃఖవిమోచనమునకే తన అర్హత పదమునకే కృషి చేసే స్వార్థపరుడు, మహాయానవాది అట్లు కాదు. అతనికి అవలోకితేశ్వరుడు ఆదర్శము. అతడు బోధిసత్త్వుడు. మహాయానములో బోధిసత్త్వులనేకులు ఉదయించారు. వేరువేరు మనఃపరిణతులుగల వేరేవేరు వ్యక్తులకు నిర్వాణం సాధించడంకోసం తోడ్పడేటందుకు వచ్చినవారు బోధిసత్త్వులు. నిర్వాణం పొందుటకు సిద్ధంగా ఉండి కూడా లోకంలోని ప్రతివ్యక్తీ నిర్వాణం పొందితేకాని తనకక్కరలేదని నిరాకరించి సర్వలోకహితైషి యై ప్రవర్తించాడు బోధిసత్త్వుడు. ఇటువంటి బోధినత్త్వులు జనులకు తోడ్పడుటకు సృజింపబడినవారు వందలూ వేలూను. అందుచేతనే మహాయానానికి బోధిసత్త్వయానమని కూడా పేరు వచ్చింది. బౌద్ధం విశ్వవ్యాప్తి పొందింది.

మన తెలుగుదేశంలో కృష్ణానదీ తీరాన మహాయానం రూపొందిన తరవాతనే. అందువల్లనే నాగార్జు నాచార్యులవారు బుద్ధుని తరువాత బుద్ధుడంతటి వాడయినాడు. మహాయానం వచ్చి బుద్ధుణ్ని భగవంతుణ్ని చేసి అతనికి లోకోత్తర శక్తులు ప్రసాదించింది. బుద్ధ పురాణం వెలిసింది. ◉

పశుపక్ష్యాదులలోన మానవులలోఁ బల్మాఱు జన్మించి దు
ర్దశలం గుందెడిప్రాణికోటికిఁ గృతార్థత్వమ్ము సేకూర్చి స
ద్యశముం గాంచిన బోధిసత్త్వుని పవిత్ర శ్రీచరిత్ర దివా
నిశముం బాడుఁడు; కావ్యరాజములుగా నిర్మింపుఁడా సత్కవుల్

*– శ్రీ దాశరథి*

*(పరిశోధన, ఏప్రియల్, 1956)*



అసలైన బుద్ధ పూజ అంటే ఏమిటో వివరించుట

# జన్ బౌద్ధము

- వాసిరెడ్డి పార్థసారథి

హవాయి నులూలూ విశ్వవిద్యాలయంవారు ప్రాచ్య పాశ్చాత్య తాత్విక శాఖలు (Philosophy of East and West) అనే పత్రికను ప్రచురించుతుండేవారు. ఇది త్రైమాసిక వేదాంత పత్రిక. దీనిలో అంతర్జాతీయంగా తాత్విక రంగంలో మహామహులైన వారు తూర్పు పడమటి దేశాల తాత్విక సంప్రదాయాలను గురించి రాసేవారు. జన్ బౌద్ధాన్ని గురించి చర్చించుతుండేవారు. జన్ బౌద్ధం ఆధునిక శాస్త్ర శోధనలకు నిలవకలిగినదని రుజువు చేశారు. డి.టి. సుజుకి (D.T.Suzuki)జపాన్ జన్ మహాసభాధ్యక్షుడు. ఈయన ఆంగ్లంలో జన్‌బౌద్ధాన్ని గురించి విపులంగా రాశాడు. జపాన్ కళాశాలలో ఆచార్య పదవిలో వున్నాడు. జన్ బౌద్ధానికి నేడు ప్రమాణ పురుషుడు. జన్ వ్యాసములను (Essays on Zen) 3 సంపుటములుగా రాశాడు. వాటిలో జన్ బౌద్ధాన్ని గురించి విపులంగా వ్రాశాడు. ఈయన జన్‌మీద ఇంకా అనేక గ్రంథములను రాశాడు. ఆంగ్లేయులు, ఫ్రెంచివారు జన్‌బౌద్ధాన్ని గురించి అనేక గ్రంథములను ఆంగ్లములోను, ఫ్రెంచి భాషలోను రాశారు. హంఫ్రీ క్రిస్టమస్ (Humphrey christmas) ఆంగ్ల పండితుడు. జన్‌బౌద్ధం శాస్త్రీయమైన సిద్ధాంతమని వేనోళ్ల శ్లాఘించాడు. ఇతను జపాన్ వెళ్లి, జన్ మఠములో చేరి, దీనిని స్వయంగా సాధన చేశాడు. ఇతను (Zen Buddism) జన్‌బౌద్ధం అను గ్రంథము రాశాడు. జన్ నేటి శాస్త్ర చర్చకు ఆగగలదని రుజువు చేశాడు. పాశ్చాత్యులు జీవితమును, సంసారమును వదలి వెళ్ళుటకు ఇష్టపడరు. జన్ సిద్ధాంతంలో సంసారమును వదలి సన్యాసమును పుచ్చుకోనవసరం లేదు. జన్ రసమయదృష్టి కలది. కడుపుబ్బ నవ్వుతూ, హాస్యమయ జీవితం నెరపుతూ ఈ సాధన చేయవచ్చు. ఇంత రసదృష్టిగల తాత్విక సాధన లోకంలో ఇది ఒక్కటే.



ఆనందుడు ఉలవలను దానంగా స్వీకరించుట

చీనావారిలో టాంగ్ చక్రవర్తుల యుగం స్వర్ణయుగం. జపాన్‌లో 14వ శతాబ్దంనుంచీ స్వర్ణయుగం. ఈ బంగారు పంటలు పండించినది జన్‌బౌద్ధం. చీనావారు చిత్ర రచనలలో కొద్దిగీతలలో గొప్ప అందమును చూపిస్తారు. జపానువారు కొద్దిమాటల పద్యంలో గొప్ప అర్థం, మాధుర్యం, ఇముడ్చుతారు. గృహాలంకరణలలోను దేమాలంకరణలలోను వారు విశిష్టమైన అందమును చేకూర్చారు. ఆధ్యాత్మికంగాకూడ ఉన్నతిని పొందారు. దీనికంతకూ ముఖ్యకారణం జన్ సంప్రదాయం. చీనావారు జపాన్‌వారు మన సోదరులు. భారతదేశంలో పుట్టిన బౌద్ధములో భాగస్తులు. మన పొరుగువారు. వీరు మహాయానశాఖీయులు. మహాయానమును నాగార్జునాచార్యులు ప్రవచించారు. దీన్లో అనేక గ్రంథములను రాశారు. ఈ గ్రంథరాజములన్నీ జన్‌బౌద్ధానికి మూల ప్రమాణాలు. నాగార్జునాచార్యులు తెలుగుబిడ్డ. వీరి విద్యలు మనదేశంలో రూపం లేకుండా పోయినవి. ఇవి చీనా, జపాన్, కొరియా, టిబెటు దేశాలలో బంగారు పంట పండించినవి. తెలుగువారము జన్‌బౌద్ధ సంప్రదాయాన్ని గురించి తెలిసికొనుట ముఖ్యము.

బౌద్ధమతం కొంతకాలం గడచిన తర్వాత రెండు శాఖలుగా చీలింది. మహాయాన శాఖ ఒకటి, హీనయాన శాఖ రెండవది. మహాయానము ఉత్తర ఆసియాలోను, హీనయానము దక్షిణ ఆసియాలోనూ వృద్ధిపొందినది. మహాయానములో జన్‌శాఖ ప్రధానమైనది.

రెండువేల సంవత్సరముల క్రిందటే, బౌద్ధము చీనాలో

ప్రవేశించినది. కాని ఆరవ శతాబ్దము దాకా ఇది వృద్ధి కాలేదు. బౌద్ధ ప్రవ్రజ్యంలో బ్రహ్మచర్యము, భిక్షాటన ముఖ్యం. చీనావారు హేతువాదులు, బలీయమైన మానవత్వం కలవారు. చీనావారిని తూర్పు ఆంగ్లేయు లంటారు. చీనావారు, వారు కష్టించి, ఆర్జించి, జీవించ వలెననీ, తమ పెద్దతనంలో తమను పోషించుటకు సంతానం కావలెనని, వంశవృక్షము శాశ్వతంగా వుండవలెనని కోరుకుంటారు. బ్రహ్మచర్యము, భిక్షాటనం వారికి రుచించలేదు. కనుక వారి పద్ధతులకు అనుకూలంగా బౌద్ధమును మార్చుకున్నారు. ఇట్టి మార్పే జన్‌బౌద్ధము. ప్రొఫెసర్ డి.టి. సుజికి, బౌద్ధం మీద చైనీయుల తిరుగుబాటే జన్‌బౌద్ధం అన్నాడు.

'జన్'కు మూలశబ్దం 'ధ్యాన్.' ధ్యాన్‌కు 'చ-ఆ' చీనా అపభ్రంశము. 'చఅన్'కు 'జన్' జపాన్ అపభ్రంశము. దీనికి మూలపురుషుడు బుద్ధభగవానుడు. 'జన్'ను చీనాలో ప్రవేశపెట్టినవాడు బోధిధర్మ. బౌద్ధానికి భారతభూమిలో 28 మంది ప్రధాన గురువులున్నారు. బుద్ధభగవానుడు వీరిలో ప్రథముడు. బోధిధర్మ చివరివాడు. నాగార్జు నాచార్యులు, అశ్వఘోషుడు, వసుబంధు ఈకోటిలోనివారే. చీనావారికి 28 మంది ప్రధాన గురువులున్నారు. ఇందులో బోధిధర్మ మొదటివాడు. ఇతను దక్షిణ భారతదేశవాసి. కంచి కాపురస్తుడు. ఆరవ శతాబ్దంలో పల్లవులు ఇక్కడ రాజ్యం చేశారు. అప్పుడు ఆంధ్రులకు రాజధాని కంచి. బోధిధర్మ బోధలు తెలుగువారి తత్వములవలె వున్నవి. ఇతను తెలుగుబిడ్డేనని నా నమ్మకము. ఇతను గొప్ప ఇంట పుట్టాడు. అప్పుడు ప్రజ్ఞాతార అను బౌద్ధ పండితుడున్నాడు కంచిలో. ప్రజ్ఞాతార వద్ద బోధిధర్మ నలుబది సంవత్సరములు బౌద్ధంలో శిక్షణ పొందాడు. ప్రజ్ఞాతార నిర్వాణం చెందగానే బోధిధర్మ చీనాకు ప్రయాణం కట్టాడు. క్రీస్తు శకము 520 సంవత్సరములో చీనాలో ప్రవేశించాడు. అప్పుడు చీనా రాజధాని నాన్కింగు. 'వు' అనే చక్రవర్తి రాజ్యం చేస్తున్నాడు. బౌద్ధంలో గొప్ప ప్రజ్ఞా దురంధరుడు భారత భూమినుండి చీనా వచ్చాడని విన్నాడు. బోధిధర్మను నాన్కింగుకు పిలువనంపించుకుని సత్కరించాడు. తాను అనేక బౌద్ధ మఠములను కట్టించానని, బౌద్ధ గ్రంథములను చీనా భాషలోనికి తర్జుమా చేయించానని గొప్పగా చెప్పుకున్నాడు. కాని బోధిధర్మ చప్పరించాడు. అయితే బౌద్ధం ముఖ్యధర్మం ఏమిటని చక్రవర్తి ప్రశ్నించాడు. శూన్యమని జవాబు చెప్పాడు. ఈ జవాబే జన్ సాధనకు పునాదిరాయి. బోధిధర్మ ఎంత గూఢార్థంగా, వికటంగా చెప్పాడో, జన్‌కూడా అట్లా తయారైంది. జవాబు చీనావారికి ఒక విశ్వసందేశమైంది. దీనితో బోధిధర్మ ప్రథమగురువైనాడు. ఇతనివాక్కు ఎంత వికటంగా, గూఢార్థంగా వుంటుందో, ఇతనూ అట్లాగే వుండేవాడు. ఇతనికి కొద్దిగడ్డం వుండేది. సంస్కారం లేనివానివలె, పిచ్చివానివలే వుండేవాడు. ఇతను మాట్లాడేది లేదు. మాట్లాడితే, రాయి తీసుకుని విసిరినట్లుండేది. రూపంలో విలక్షణత వుండేది. ఇతని రూపం చిత్రకారులలో ఒక విశిష్టమైన సంప్రదాయానికి ఆధారమైంది. ఇతనిని అనేకవిధాల, చిత్రిస్తుంటారు. ఏదో గూఢార్థము, సందేశము కనుపిస్తుంటవి ఆ చిత్రాలలో. రూపంవలె ఇతని జీవితం కూడా నిగూఢమైనదే. చక్రవర్తి దర్శనం తర్వాత, ఇతను పల్లెపట్టులకు వెళ్లాడు. షావోలిన్ అనే మఠంలో తొమ్మిది వర్షములు సమాధి నిష్ఠలో వున్నాడు. అప్పుడు ఒక కన్‌ఫ్యూషియన్ విద్యార్థి జ్ఞానార్థియై ఇతని వద్దకు వచ్చాడు. ఇతని పేరు షెక్ క్వాంగ్. కాని బోధిధర్మ ఇతనికి దర్శనమే ఇవ్వలేదు. ఈ విద్యార్థి ఆ మఠం ముందు ఏడు పగళ్ళు ఏడు రాత్రులూ, మంచులో నానుతూ నిరీక్షించాడు. అప్పటికీ ఏ జవాబూ రాలేదు. తన ఆకాంక్ష తెలుపుటకుగాను, ఇతను ఒక చేతిని నరికి బోధిధర్మునికి పంపాడు. ఈ మూల్యం గురుదర్శనం లభింపచేసింది. బోధిధర్మ దేనికిట్లు చేసితివని అడిగాడు. తనకు మనశ్శాంతి లేకుండా వున్నదనీ, శాంతి లభించునట్లు చేయుమని ప్రాధేయపడ్డాడు. ముందు నీ మనస్సును నాకు చూపించు, తర్వాత దానిని శాంతింపచేస్తానన్నాడు గురువు. ఇంత తనను బాధపెట్టే మనస్సును, తాను చూపించలేనన్నాడు. అందుకు గురువు తృప్తి చెందాడు. శిష్యునికి శాంతి లభించింది. ఇంత పరీక్షకు నెగ్గిన విద్యార్థి, జన్‌శాఖకు రెండవ ప్రధాన గురువైనాడు.



పారిలేయక వనగజం భక్తితో ఫలాలను సమర్పించుట

అప్పుడు ఇతనికి హ్యూ-కే-టో అని పేరు వచ్చినది. ఇతనికి బోధిధర్మ, లంకావతార సూత్రముల నిచ్చాడు. ఈ సూత్రములు జన్‌కు ప్రమాణములైనవి. ఇతని జీవిత మెట్టిదో, జీవితం నుంచి ఆయన నిర్గమనం కూడా అట్టిదే. ఈ మఠం నుండి ఆయన ఎవరికీ కనుపించకుండా హఠాత్తుగా వెళ్లాడు. ఈయన వృద్ధాప్యంలో వుండగా ఒకనాడు ఒక పాదుకను నెత్తిన వుంచుకుని, పడమటి ద్వారంగుండా ఎక్కడికో వెళ్లటం కొందరు చూచారు. అంతే లోకానికి ఈయన దర్శనం. వారే చీనా జపాన్ ప్రజల జ్ఞానతార, వారి ముఖ్య ప్రధాన గురువు, మూడవగురువు సెంగుల్సుమ్. నాల్గవగురువు టొహ్సిన్. ఈయన క్రీ.శ. 580 నుండి 651 వరకూ జీవించాడు. ఈయన కాలంలో జన్ రెండు శాఖలుగా చీలింది. జన్‌సిద్ధికి కోన్ (Koan) అను సాధనలున్నవి. ఇవి హేతువాదమునకు అందని చిత్రమైన సూత్రములు. ఈ కోన్‌సాధనల విషయమై వచ్చిన అభిప్రాయ భేదములే, రెండుశాఖలు ఏర్పడటానికి కారణం.

వివేకానందులవారు ప్రపంచమంతా పిచ్చాసుపత్రి అని అన్నారు. బౌద్ధులు ప్రపంచమొక ఆసుపత్రి అంటారు. ఇందులో రోగులకు, కోరికలనే జబ్బులు వచ్చినవి. కోరిక ఒక మంటవంటిది. ఇది మానవుని నిలువునా తగుల పెట్టుతూ వుంటుంది. ఇందువల్ల మానవునికి సుఖ శాంతులు వుండవు. శాంతి పొందవలెనంటే కోరికలనే మంటలను ఆర్పివేయాలి. కోరికలు ఇంద్రియములకు పుట్టిన శిశువులు. పంచేంద్రియములవల్లనే సుఖమున్నదని మానవుడు భ్రమపడుతున్నాడు. కాని ఈ ఇంద్రియములు తమను మోసం చేస్తున్నవని జ్ఞానులు కనిపెట్టారు. ఇంద్రియములు కళ్లద్దములవంటివి. నల్లటి కళ్లద్దములను పెట్టుకు చూచిన ప్రపంచమంతా నల్లగా కనిపిస్తుంది. ఈ



అజాత శత్రువు బింబిసారుని చిత్రహింసకు గురి చేయుట

అద్దాలను తొలగించినగాని అసలు రూపం కనుపించదు. ఇట్లే ఇంద్రియములు సత్యమును మరుగుపరుస్తున్నవి. ఈ ఇంద్రియాలవల్ల తెలియు జ్ఞానము సరియైనదికాదు. ఇదికాక వేరొక అవ్యక్తజ్ఞాన మున్నదని ఆధునిక శాస్త్రవేత్తలుకూడా నమ్ముతున్నారు. దీనినే సత్యమని, సచ్చిదానందమని, పరబ్రహ్మమని, బుద్ధత్వమని అంటారు. ఈ సత్యముతో సంబంధము పెట్టు కొనుటకు ఇంద్రియములు, కోరికలు అడ్డములుగా ఉన్నవి. వీటిని తొలగించి, పరబ్రహ్మముతో సంబంధము పెట్టుకొనుటే జన్. జన్ సిద్ధియే నిర్వికల్ప సమాధి. ప్రపంచములోని అన్ని మతముల లక్ష్యము ఒకటే. కాని అందుకు దారులు భిన్నములు. ఇటువంటి దారులలో జన్ ఒక విశిష్టమైన దారి అవ్యక్తమునకు ఇదొక నిచ్చెన. ఒక సేతువు. ఇవతలి ఒడ్డు నుండి అవతలి (పరము) వడ్డుకు ఇదొక గంతు. పరమనేది, అంచులు లేని అఖాతము. ఇందులో దూకునప్పుడు వేరు రక్షణలుండవు. ఒక్క మనస్సను గాలిగొడుగు (పెరాచూటు) మాత్రం కొంత కాపాడుతుంది. ఇదీ ఆ దూకులో సరిగ్గా విప్పుకుని సాధకునకు రక్షణనివ్వాలి. లేనియెడల సాధకుని మనశ్శరీరములు భగ్నమౌతవి. గమ్యస్థానం మనస్సున కందనిది. అందువల్లే దీనిని అవ్యక్తమంటారు. ఉపనిషత్తులలో కూడా బ్రహ్మము ఎట్టిదనే ప్రశ్నకు జవాబు రాదు. జవాబునిచ్చిన యెడల అతను తెలియనివాడే. ఇట్టిదే జన్ కూడా. జన్ ఇట్టిదని చెప్పుటకు భాషలేదు. కాని చంద్రుని వ్రేలితో చూపించునట్లు ఒకమాటలో చెప్పవచ్చు. అవ్యక్తమైనది కనుక వర్ణించుటకు గ్రంథములు చాలవు. చీనాలో 'టౌ' (Tao)ను గురించి ఒక సామెత ఉన్నది. 'మాటలతో చెప్పబడు 'టౌ', నిత్యమైన టౌ కాదు' టౌ, జన్‌కు అధిదేవత. కనుక జన్‌ను గురించి భాషలేదు. మౌనమే అది. దీనిని గురించి చీనాలో ఒక పద్యం వున్నది.

'అది కదులుతూ వుంటుంది, గ్రహించుటకది ఆగదు,
చూద్దామంటే కనుపించదు,
విందామంటే వినిపించదు,
కాని వాడుకొనుటకు, అది తరగని నిధి.'

జపాన్‌లో ఒక పద్యపు చివరి చరణం ఇట్లా వుంది:
'చేతిలో ఖడ్గం లేదు. మనో నిద్రయే ఖడ్గము.'
ఈ మనోనిద్రయే జన్.

ఇదే భారతీయుల అమనస్కయోగము. జన్‌బౌద్ధం

జీవితంనుండి పారిపొమ్మనదు. అది జీవితంలో ప్రవేశిస్తుంది. కాని మనస్సుతో సంబంధం పెట్టుకోక, అవ్యక్తముతో సంబంధం పెట్టుకో ప్రయత్నిస్తుంది. దానిచేతిలో సాధకుడొక పనిముట్టు మాత్రమే. ఇదే భగవద్గీత బోధించు నిష్కామ కర్మయోగము. గాంధీ మహాత్ముడు అసలైన జన్ సాధకుడు. కాని సాధనల విషయంలో చీనా జపాన్‌వారు విశిష్ట సాధనలు వుపయోగించారు. వీటిని కోన్ (Koan) సూత్రములు అంటారు. కోన్‌లు 1700 వున్నవి. సాధకుడు అన్నిటినీ సాధన చేయ పనిలేదు. సాధకునిబట్టి వుంటవి. సాధకుల శిక్షణకు జన్ మఠములుండేవి. ఇక్కడ జన్ సాధనలలో ఆరితేరిన మహామహులుంటారు – వీరిని, రోషీ అంటారు చీనావారు. గురువులని అర్థము. వీరు సాధకులకు శిక్షణ నిస్తుంటారు. సమయానుకూలంగా సలహాలిస్తుంటారు. సహాయపడుతుంటారు.

కోన్ లక్ష్యము, మనస్సును భగ్నపరుచుట. లేదా, భగ్నావరణస్థితిని కలుగజేయుట. కారణము మనస్సుకు ఆధారము కారణం. ఈ ఆధారంతో మనస్సు నడుస్తుంటుంది. ఈ కార్య కారణ రూపమైన ఆలోచనలు పనిచేయకుండా చేస్తవి కోన్ సాధనలు. కోన్ ఇట్లా వుంటుంది: 'సన్నని మూతిగల సీసాలో ఒక కోడి వున్నది, కోడి చెడకుండా సీసాలో నుండి బైటికిరావాలి. సీసా చెడకూడదు. కోడి బైటికి వస్తుంది' దీనిని సాధకులు మననం చేస్తారు. అలా వచ్చినట్లు మనస్సుకు నచ్చ చెప్పుకుంటారు! కార్యకారణ జ్ఞానాన్ని పట్టుకు వ్రేలాడుతున్న మనస్సును, అవతలకు నెట్టుటే ఈ సాధనల లోగల ప్రయత్నము. ఇటువంటి వాటినే గురువులు సాధకులకు చెప్తుతారు. ఆకాశపు చివర ఎక్కడ, కాలము ఆరంభము ఎక్కడ అని అంటారు. ఆలోచించిన కొలదీ, సమాధానము దొరకదు. మనస్సును బండపారించుట ముఖ్యము. అందుకు ఇలాటి ప్రశ్నలడిగి ఆలోచించ మంటారు. సాధకుడు అవసరమైనప్పు డెప్పుడైనా గురువును ప్రశ్నించవచ్చు. జవాబు ఆ సాధకుని మనోలక్షణమునుబట్టి వుంటుంది. అడిగిన దానికి కారణం చెప్పక పోగా ఇంకా అగమ్యం చేస్తాడు, గురువు అగ్నిలో ఆజ్యంపోసినట్లు చేస్తాడు. ఒక్కోసారి జవాబు మెరుపువలె వుంటుంది. కొందరు దీనివల్ల సిద్ధిపొందవచ్చు. ఏ ఆలోచనా లేకపోవటం, సరిపోతుందా అని ఒకసారి శిష్యుడు గురువును ప్రశ్నించాడు. దానిని కూడా పారవేయమన్నాడు గురువు. దీని భావం గ్రహించిన శిష్యునికి సిద్ధి కలిగింది. కొందరి ప్రశ్నలకు ఫెడీమని దెబ్బకొట్టడం కూడా వున్నది. జన్ ఎటువంటిదంటే చేతిలో కర్ర చూపుతారు. కర్రతో కొట్టుతారు. సాధకుడు తెలివిగలవాడైతే అర్థం గ్రహిస్తాడు. చేతికర్రకు జీవంలేదు. కాని అది నడుస్తుంది. దానిని పట్టినవాని చేతిలో, అదొక పనిముట్టు, ఇట్టిదే జన్. జన్ అవ్యక్తమునకు పనిముట్టువంటిది. నడుచుటే మన విధి. ఇట్లు అంతరార్థములతో వుంటవి. జపాన్‌వారు జన్ యుద్ధ క్రీడవంటిదిగా భావిస్తారు. యుద్ధంలో కత్తి పైన బడబోవునప్పుడు, ఆలోచనలవల్ల లాభం లేదు – తనూ కత్తివిసరాలి. లేనియెడల పై కత్తి అతని శిరస్సును ఛేదిన్తుంది. యుద్ధవీరునకు జయాపజయములు కోరికలుండకూడదు. ఇట్టివాడు జయించలేడు. జీవించుట మరణించుట రెండూ ఒక్కటే సాధకునకు. ఆలోచనలు లేకుండా యుద్ధం చేయుటే వీరుని విధ్యుక్తము. జన్ కూడా ఇట్లే జన్‌లో స్వార్థము, అహము ముఖ్యశత్రువులు. వీటిని విసర్జించాలి.

జన్ అద్దమువంటిది. అద్దము దానివద్దకు వచ్చిన వాటినన్నిటినీ స్వీకరిస్తుంది. కాని దేనిని అది వుంచుకోదు. ఇట్టిదే జన్‌కూడా. జీవితంలో ఎదురైన దానిని స్వీకరిస్తుంది. కాని, అది తనదిగా ఎంచదు. దీనినే భారతీయులు తామరాకుమీద నీటిబొట్టువలె వుండాలంటారు. దీనిని అర్థంచేసుకుంటే, జన్ సాధన చాలావరకు బోధపడినట్లే, జన్‌సాధకులు ఏ ప్రమాణములను స్వీకరించపనిలేదు. వారికి పూర్తిస్వాతంత్ర్యముంటుంది. ఇష్టంలేనియెడల జన్ మందిరములను వదిలి వెళ్ళవచ్చు. సాధనను ఎక్కడైనా చేయవచ్చు. కాని గురువు అవసరము. గురువు ఎంత అవసరమని భారతీయులు భావిస్తారో చీనా, జపాన్‌వారు కూడా అంత అవసరమని భావిస్తారు. జన్ కత్తిమీద



మదించిన నాలాగిరి మదభంగం

సాముపంటిది. కనుక చాలా అపాయకరమైనది. గురువు సలహా చాలా సహాపడుతుంది. లేనియెడల, మంత్రసానిలేని, ప్రసవించు స్త్రీవలె వుంటుంది సాధకునిస్థితి. జన్ సాధకులు నిత్యం కొంతకాలము ధ్యానం చేస్తుంటారు. మంత్ర, సూత్ర పఠనచేస్తుంటారు. పొలములలో వ్యవసాయము చేస్తుంటారు. నాగలి దున్నుతారు, కోతలు కోస్తారు, నూర్పిడులు నూరుస్తారు. మఠంలో ఊడ్పులు మొదలు అలంకరణవరకూ చేస్తారు. మంత్రపఠన, ధ్యానాదులు ఎంత పవిత్రములో, దున్నుట, కోతగోయుట, నూర్పిడి నూర్చుట అంత పవిత్రములు. ఒకటి ఎక్కువాలేదు. ఇంకొకటి తక్కువాలేదు. జన్‌కు అన్నిపనులు పవిత్రములే. జన్‌కు యుద్ధంలో ఖడ్గమూ, మఠములో జపమాల సమానములు. 'అవ్యక్తము' మన చేతిలో పనిముట్టుగా భావించాలి. నమ్మాలి, అట్లు జీవించాలి. మఠములలో వీరికి శరీర మనో పరిశ్రమలను ఇస్తుంటారు. ఈ సాధనలలో సాధకుని యందున్న అపరిశుద్ధమైన ఆ స్థానంలో ప్రవేశిస్తుంది. ఈ సమయం చాలా అపాయకరమైనది.

ఇంద్రియములు చాలా బలవంతములైనవి. ఇవి సాధకునకు త్వరగా, సులభంగా, స్వాధీనముకావు. వీటిని బోనుపెట్టి పెద్దపులిని పట్టుకున్నట్లు, సాధకుడు పట్టుకోవాలి. స్వేచ్ఛగా తిరుగుతున్న పెద్దపులి, బోనులో వుండ నిచ్చగించదు. అది బోనునంతటినీ, తనబలం వుపయోగించి, విరగతీసిపారవేయవలెనని ప్రయత్నిస్తుంది. ఇట్లే బోనులో చిక్కిన ఇంద్రియాల బాధమీద అతిగా విజృంభించి, ఊపివేయును. అట్టి సమయంలో సాధకునికి కూడు నీళ్లు వుండవు. నిద్ర అసలే వుండదు. ఇది సాధనలో చాలా క్లిష్టమైనకాలము. ఈ పరిస్థితులను గురువు కనిపెట్టుతూ వుంటాడు. అతను కొన్ని మార్గములను చెప్పి



చంపుటకు వచ్చి బుద్ధుని శరణు జొచ్చుట

పరిస్థితులనుండి దాటిస్తాడు. సాధకుడు గర్భిణీస్త్రీవంటివాడు. గురువు మంత్రసానివంటివాడు. ఆ మంత్రసానివలె గురువు సహాయం చేస్తాడు. ఈ స్థితిని దాటిన తర్వాత అతనికి దివ్యజ్ఞానము కలుగును. దీనిని బౌద్ధులు బుద్ధత్వం అంటారు. అట్టి జ్ఞానము కల్గినవారిని 'తథాగతుడు' అని అంటారు. జన్ వారి భాషలో ఈ జ్ఞానమును 'శటోరీ' అంటారు. శటోరీ జన్‌కు కొలబద్ధవంటిది. అతని సిద్ధి ఎంతవరకో ఇది చెప్పుతుంది. శటోరీ ఒక మెరుపువలె వస్తుంది. ఇది రెండు సెకండులుండవచ్చు. ఇంకా ఎక్కువ కాలంగూడా వుండవచ్చు. ఎక్కువకాలం వుండుటకు నిత్యసాధన కావాలి. శటోరీ మెరుపు మెరిసి మాయమైనట్లు అవుతుంది. ఈ సామ్యమే భాగవతంలో గోపికలకు కృష్ణభగవానుని గూర్చి చెప్పబడ్డది. భగవానుడు దర్శనమిచ్చి మాయమైపోతాడు. భగవానుని చూచిన కన్నులు ఇతరములను చూడనొల్లవు. గోపికలు భగవానుని వెతకుటకు బయలుదేరుతారు. ఈ స్థితినిగురించి పోతన్నగారు, నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై జల్లెడువాడు... మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే' అని వ్రాశారు. ఆ పరంజ్యోతి పునర్దర్శనమునకై, చెట్లు, చేమలూ, వెదికారు గోపికలు. విలపించారు. బాధపడ్డారు. అట్టిది, ఆ దివ్యమంగళ విగ్రహము. ఇట్లే శటోరీ ఆకస్మికమైనది. అది వస్తుందని తెలియదు. సాధకునికి ఇష్టం వచ్చినప్పుడది రాదు. దాని కిష్టము వచ్చినప్పుడది మెరుపువలె వస్తుంది. ఇది ఆకస్మికంగా వస్తుంది కనుక దీనిని ఆకస్మికవిద్య అంటారు. దీనిని ఒక్కసారి అనుభవించినవారు వదలలేరు. గోపికలు కృష్ణభగవానుని వెంటాడిన స్థితిలో సాధకు లుంటారు. శటోరీ కొలత బద్ధవంటిదని చెప్పాను. శటోరీ పూర్తిగా కలిగినప్పుడే పరిపూర్ణ జ్ఞానం కలుగును. లేనియెడల తెలిసీ తెలియనట్లుంటుంది. శటోరీ కలుగగానే అతను అవ్యక్తజ్ఞానము, ఆనందమూ పొందుతాడు. రసమయ జీవనం వస్తుంది. ఇతను అందరివలె శాసనబద్ధుడై జీవించుతాడు. కాని ఇతనిది, దివ్యజీవను. రసమయ జీవనము. బుద్ధిసూక్ష్మత ఏర్పడుతుంది. శటోరీ మెరుపువలె వచ్చినప్పుడు అతనికి తేజోవంతములైన అభిప్రాయములు కలుగుతవి. ఇవీ మెరుపువలె అతని మనోవీధిలో మెరుస్తవి. కాని వీటికి బైటి సన్నివేశము లుండాలి కొందరకు. వాల్మీకులవారు క్రౌంచపక్షి ఆక్రందనం విన్నాడు. ఆ ఆవేదనవల్ల వాల్మీకులవారి అంతరంగంలో ఏదో

మెరిసింది. అది వాగ్రూపంగా వచ్చింది. అదే శ్లోకమైంది. వాల్మీకులవారు ఆదికవియైనారు. ఇట్లు అనేక సమయాలలో ప్రపంచ రహస్యములు మానవుల అంతరంగమున మెరసి అద్భుతపరచినవి. ఎందరు కాయలు చెట్టునుండి క్రిందకు రాలుట చూడలేదు. న్యూటన్ యాపిల్‌పండు రాలుట చూచినాడు. అది అతని మనస్సులో వక దివ్య సందేశమునకు కారణమైనది. శటోరీ ఇట్లే వస్తుంది. దీనిని పొందినవారు అనేక చిత్రములను రచించారు. కవిత్వమును చెప్పారు. వీరి వాక్కు దివ్యవాక్కు. వీరి జీవితం అంతర్వాణి ప్రకారం జరుగుతుంది. టాంగ్ యుగంలో చీనావారు అనేక అద్భుత చిత్రములను చిత్రించారు. ఇవి ఒక విశిష్ట స్తావమును సంపాదించుకున్నవి. కొద్ది గీతలలో చక్కని చిత్రమును గీస్తారు. అందులో ఏదో సందేశముంటుంది. ఎంతో అర్థముంటుంది. దివ్యత్వం వుంటుంది. మహాయానము ప్రజ్ఞ, కరుణ అను రెండు పాదములమీద నిలిచింది. చిత్రకారులు కరుణను శమంత భద్రునిగాను, ప్రజ్ఞను మంజుశ్రీగానూ చిత్రిస్తారు. పూర్ణజ్ఞానమైన బుద్ధత్వమును బుద్ధునిగా చిత్రిస్తారు. సమంతభద్రుని ఏనుగుమీదను, మంజుశ్రీని సింహంమీదను, వీరిద్దరిమధ్య బుద్ధభగవానుని పద్మంమీద చిత్రిస్తారు. చిత్రకారులు ఈ చిత్రమును అనేకరకాల అద్భుతంగా చిత్రిస్తారు. బోధిధర్ముని చిత్రించని చిత్రకారుడుండడేమో, ఇతను పిచ్చివానివలెవున్నా అతనిలో దివ్యత్వం కనుపిస్తుంది. సందేశం వినుపిస్తుంది.

శటోరీ పొందినవారు జపాన్‌లో విశిష్టమైన కవిత్వం చెప్పుతారు. కొద్దిమాటలలో, గొప్ప అర్థం వుంటుంది. ఇవి రెండురకాలు. మొదటి మూడుపాదములలో వుంటుంది. మొదటి పాదంలో 5, తర్వాత 7, తర్వాత 5 మాటలుంటవి. మొత్తము 17 మాటలు. ఈ పద్యములను హక్కూ, లేక హైకూ అంటారు. రెండవ రకములో 5 పాదాలుంటవి. మొదటి చరణంలో 5, తర్వాత 7, 5, 7, 7 పదములుండి మొత్తము 31 పదములౌతవి. వీటిని టంకాలని, ఉటాలని అంటారు. జపాన్ శ్రమణుకుడు, కవాగుచీ, టిబెటులో, వెండికొండలను చూచినప్పుడు, వీటిని చెప్పాడు. జపాన్ వారికి ఇవి మహా ప్రీతికరములు. వేమన్నగారి పద్యములవలె వుంటవి. ఈ పద్యములుగాని, చిత్రములు గాని అవ్యక్తమునుండి మెరిసిన మెరుపులు. వీటిని వేగంగా చిత్రిస్తారు. ఇందులో తప్పులుండవు. దిద్ద పనిలేదు. దివ్య వాక్కువలె వుంటవి. ఇవి ఆలోచనలనుండి వచ్చినవి కావు. సచ్చిదానందమునుండి వచ్చినవి.

శటోరీ పొందిన తర్వాత గురువులుగా ఉండుటకు కొన్ని సాధనలు చేస్తారు. వీరు ఏకాంతంగా అడవులకు పర్వతాలకు వెళ్ళివుంటారు. మానవానీకము మధ్య మార్కెట్టులోనూ వుంటారు. ఇట్టి సాధనలైన తర్వాత వారికి పెద్దలు గురుత్వం ఇస్తారు. అప్పుడే వీరిని జన్ మందిరములలో చేర్చుకుంటారు 'రోషి'గా.

జన్‌కు కొన్ని సూత్రగ్రంథములున్నవి. ఇందులో ప్రజ్ఞాపారమితలోని హృదయసూత్రము ముఖ్యమైనది. ఇది ఒక్కటే మంత్రము. దీనిని సాధకులు జపిస్తూ ఉంటారు. ఈ మంత్రము కూడా విశిష్టమైనదే.

"గతే, గతే, పరగతే, పరసంగతే బోధిస్వాహా" దీని అర్థమిది. 'బుద్ధి వెళ్ళింది, వెళ్ళింది, అవతలి ఒడ్డుకు (పరముకు) వెళ్లింది, అవతలి ఒడ్డున నిలిచింది, అనగా మనస్సనే ఇవతలి ఒడ్డునుండి, పరమనే, ఆ మనస్సుకు తెలియని, అవతలి ఒడ్డుకు బుద్ధి వెళ్ళిందని అక్కడ నిలిచిందని దీని అర్థము.

దీనిని ధ్యానిస్తుంటారు మహాయానశాఖీయులంతా. కాని చీనావారు సాధకులకు దీని అర్థమును ముందు చెప్పరు. తర్వాత వారికి అర్థమవుతుంది. హుయాన్‌త్సాంగు భారతభూమికి బయలుదేరినప్పుడొక దివ్యవాక్కు వినిపించింది. కష్టములూ, అపాయములూ వచ్చినప్పుడు, ఈ మంత్రమును జపించమని ఆ వాక్కు చెప్పింది. అట్లే కష్టకాలములో ఈ మంత్రమును హుయాన్‌త్సాంగు జపించి, ఇంటికి క్షేమంగా చేరాడు. ప్రజ్ఞాపారమితను సూత్రము లున్నవి. ఇవి, జన్‌ను గురించి విశదంగా చెప్పుతవి. ప్రజ్ఞ+పర+మిత. ప్రజ్ఞ అను అవతలి ఒడ్డుకు చేరుట ఈ గ్రంథనామముయొక్క అర్థము. జన్ గురించి



గణరాజ్యాన్ని రక్షించుకోవటానికి లిచ్ఛవీయులకు ఉపదేశం

*గంధ వ్యూహమనే* గ్రంథమున్నది. *గంధవ్యూహమనగా* పుష్పాలంకరణ. ప్రజ్ఞాపారమిత *గంధవ్యూహములకు* నాగార్జునాచార్యులు భాష్యం వ్రాశాడు. ఈ భాష్యమును, అచింత్య విమోక్ష అంటారు. మనసుకు అందని మోక్షమని దీని అర్థము. 42 పరిచ్ఛేదములును సూత్రములుకూడా జన్ గురించినవే. రెండువేల సంవత్సరములనాడు చీనాలో ప్రథమంగా తర్జుమా చేయబడ్డ బౌద్ధసూత్రములివి. 5వ శతాబ్దంలో, బుద్ధభద్రుడను నతడు, అవతమశాకా సూత్రములను ప్రవేశపెట్టాడు. ఇది జన్ శాస్త్రగ్రంథము. లంకావతారసూత్రములు, వజ్ర సూత్రములు కూడా జన్‌కు నంబంధించినవే. చీనా ఋషులు కూడా కొన్ని సూత్రములను చెప్పారు. వైలాంగ్ సూత్రములిట్టివి.

జన్ మూలపురుషుడు బోధిధర్మ. ఇతను ఇచ్చిన జన్ గ్రంథము లంకావతార సూత్రములు. చీనావారు వీటిని విశేషంగా పఠిస్తుంటారు. జన్ 6వ ప్రధాన గురువు హ్యూనెంగ్. ఇతను వజ్రసూత్రములను వినటంతోనే బుద్ధత్వం పొందాడు. గంధవ్యూహములో పరలోకములను గురించి చెప్పబడినది. ఇవి తేజోమయ లోకములు. ఈ లోకములను గంధవ్యూహము ధర్మధాతువులని అంటుంది. సాధకుడు అహంను నశింపచేయనిదే సిద్ధి కలుగదు. అహం నశింపగానే, ధర్మధాతువులో చేరుతాడు సాధకుడు. ధర్మధాతువు సమిష్టి కుటుంబము వంటిది. వ్యక్తిత్వము వుంచుకుంటూ సమష్టిలో చేరుతాడు. ఒక అద్దముముందు కొన్ని దీపాలున్నవి. ఈ దీపములు అద్దంలో ఒకచోట కనుపిస్తవి. కాని అవి వేరుగానే వున్నవి. ఇట్టే ధర్మధాతువు. వ్యక్తిత్వం వున్నా సమష్టిలో లీనమౌతాడు. ఇక్కడ ఒకరి శ్రేయస్సు అందరిది. ఇందుచేతనే సమస్త జీవుల శాంతిని మహాయానులు కోరుతారు. ఈ లోకములో అంతా వెలుగే.



ఆమ్రపాలి-లిచ్ఛవీ రాజకుమారులు

నీడ అనేది వుండదు. ఈ తేజస్సు వైరోచన బుద్ధునినుండి ప్రసరిస్తుంది. మహాయానులు బుద్ధత్వముకొరకు కోరికపుట్టుట, బోధిచిత్తమంటారు. జ్ఞానమునకై ఎవరికి చిత్తము కలుగునో వారే బోధిచిత్తులు. సాధనలో అనేక మెట్లున్నవి. బుద్ధత్వం పొందక పూర్వపు స్థితిని, బోధిసత్వమంటారు. ఈ స్థితిని పొందక పూర్వపుస్థితిని, బోధినత్వమంటారు. ఈ స్థితిని పొందినవారిని బోధిసత్వులంటారు. బోధిసత్వులనగా జ్ఞానసత్యం గలవారని అర్థము. ధర్మధాతువులో 500 మంది బోధిసత్వులున్నారు. వీరు ప్రపంచంలోని బాధామయ జీవులందరికి, అదృశ్యంగా సహాయం చేస్తుంటారు. మహాయానులు కరుణ, ప్రజ్ఞలను ముఖ్యప్రమాణములుగా స్వీకరిస్తారు. జీవులలో ఒక్కరైనా బుద్ధత్వం పొందకుండా వుండేయెడల వారి సహాయార్థము వారు పొందనున్న బుద్ధత్వమును కూడా విసర్జిస్తారు. ప్రతి మహాయాన మతస్తులు ఇందుకై ప్రతిజ్ఞ తీసికుంటారు. ప్రమాణములను ఈవిధంగా స్వీకరిస్తారు. ఇవి నాలుగు.

1. లెఖ్ఖలేనన్ని ఎన్ని జీవులున్నా, వారిని రక్షించుటకు ప్రమాణము చేస్తాను.
2. ఎన్ని తీరని కోరికలున్నా, వాటిని నశింపచేయుటకు ప్రమాణము చేస్తాను.
3. ఎన్ని తరగని ధర్మాలున్నా, వాటిని పఠించుటకు ప్రమాణము చేస్తాను.
4. ఎంత అగమ్యంగా వున్నా, బుద్ధత్వమును పొందుటకు ప్రమాణం చేస్తాను."

మానవుడు పరంలో వున్న దేనికో ఇతను నీడయని మహాయానులు భావిస్తారు. మానవుని దృష్టాదృష్టములు ఈ పరములో వున్న వస్తువునందే వున్నవంటారు. అక్కడ ఏ విధంగా నడిస్తే, ఇక్కడ ఆ విధంగా జరుగుతుంటుందని అంటారు. ఆ వెలుగుకు మానవుడు నీడయని వారి ఉద్దేశ్యము. దీనిని తెలుసుకొనుటే సాధన.

'కారల్ యూంగ్' నేటి మానసిక శాస్త్రవేత్తలలో గొప్పవాడు. ఇతను శటోరీ పొందినవారిని తాను చూచానని వ్రాశాడు. యూరపు దేశీయులలోనే శటోరీ పొందినవారిని, తాను ఎరుగుదునన్నాడు. తనయొక్క రోగి ఒకామె శటోరీని పొందినది. ఆమె ఆ అనుభవమును గురించి ఈ విధంగా వ్రాశాడు. "ప్రశాంతంగా వుండుటవల్ల దేనిని ఆటంక పరచకుండా వుండుటవల్ల ఏకాగ్రతతో వుండుటవల్ల సత్యాన్ని అంగీకరిస్తున్నందువల్ల ఉన్నదున్నట్లు ఉంచుటవల్ల (నేను కోరినట్లుగాక) అవ్యక్తమైన జ్ఞానం కలిగింది. నేనెన్నడూ

ఎరుగని అవ్యక్తశక్తులు లభించినవి."

పూర్వకాలంలో కూడా అనేకమంది శటోరీని పొందినవారున్నారు. పాల్ ఋషి తన చుట్టూ అవ్యక్తమైన కాంతిసముద్రంవున్నట్లు చూచాడు. మహమ్మదులవారు గెబ్రియల్ దర్శనం కలిగిన తర్వాత తేజోమయలోకములను చూచాడు. మహమ్మదులవారు చదువుకోలేదు. కాని జ్ఞానము పొందినవారౌటచే, వారన్న మాటలు పద్యములైనవి. ఇవి ఖురాన్ గ్రంథమైనవి.

ఆధునికులలో, డాక్టరు బక్కు ఇట్టి అనుభవములను పొందాడు. ఇతను చక్కని మోటారు బండిలో పయనిస్తున్నాడు. అతని చుట్టూ తేజోమయ మేఘం ఆవరించినట్లు కనుపించింది. దీనితో ఆయనకు అవ్యక్తానందము కలిగినది. కొందరు ఏ చక్కని వస్తువునో చూచినప్పుడు, ఇట్టి స్థితిని పొందుతారు. కొందరు విషాదమును చూచినప్పుడు పొందవచ్చు. అవి హృదయాన్ని కదిలించేవిగా వుండాలి. వాల్మీకులవారు క్రౌంచపక్షి ఆక్రందన వినగానే ఇట్టి స్థితిని పొంది శ్లోకమును నూతనంగా చెప్పి ఆదికవియైనాడు. యడ్వర్డు కార్పెంటరు బుద్ధవిగ్రహాన్ని చూడగా ఇట్టి అనుభవాన్ని పొందాడు. టెనిసన్ కవి నలిగిన పుష్పమును చూచి ఇట్టి స్థితిని పొంది మధురమైన కవిత్వం చెప్పాడు. స్త్రీ దిగంబరత్వమును, చూచి వేమన్నగారిట్టి అనుభవాన్ని పొందారు. 'జన్‌బౌద్ధం' గ్రంథకర్త హంఫ్రీ క్రిస్టమస్, జపానులో జన్ శిక్షణ పొందాడు. ఇట్టి స్థితులను మూడు పర్యాయములు పొందాడు. ఒకసారి (టర్కిబాత్) స్నానంచేసే నీళ్ళ తొట్టిలో విశ్రమించగా పొందాడు. తళుక్కున మెరుపు కనిపించింది. ఇది కొన్ని సెకండులే వున్నది. 'బుద్ధిహీనునివలె దానిని తెలిసికో ప్రయత్నించాను. కాని ఈలోగా అది పోనేపోయింది' అని అన్నాడు. డాక్టరు కన్నెతువాకరు తన యోగియొక్క అనుభవమును ఇట్లు చెప్పాడు. ఒకసారి ఆమె హఠాత్తుగా చప్పట్లు కొట్టటం ఆరంభించి దానితో అరవటం మొదలుపెట్టింది. అదుగో మీరు అర్థం చేసుకోలేరు. మీరు అర్థం చేసుకోలేరు. 'అదిగో విశ్వము, నేను చూచాను. నేను చూచాను. అబ్బా, నాలో ఏమి సుఖము, ఏమి సుఖము. ఏమి ఆనందము.' ఆనందము బైటనుండి వచ్చినది కాదు. అది లోపలే వున్నది.

'మాట్లాడే వాడికి తెలియదు,
తెలిసినవాడు మాట్లాడడు.' ఇదే జన్.

ప్రొఫెసర్, డి.టి. సుజికి వ్రాసిన Essays on Zen మూడు సంపుటములు, క్రిస్టమస్ హంఫ్రీ వ్రాసిన Zen Buddhism, 1956 Mahabodi Annual ఆధారంతో వ్రాశాను.

(భారతి, జూన్, 1957)



కోసలేశుడు బుద్ధుని పాదాలను ముద్దాడుట

# చదవండి...

- ఎన్నార్కె



✦ **ధమ్మపదం :** ఇది కవితల రూపంలో స్వేచ్ఛానుసరణ చేసినవారు సుగమ్ బాబు. సులభ శైలిలో, అందమైన భాషలో సరళంగా వ్రాయబడ్డ ఈ కవితలు చిన్నా, పెద్దా అందరినీ అలరిస్తాయి. బౌద్ధ ధర్మపు మూల సూత్రాలు అర్థం చేసుకోవడానికి ఇది ఎంతగానో తోడ్పడుతుంది.

*పేజీలు 125, వెల : ₹ 60/-, ప్రతులకు - ఫోన్ : 8096615202.*



✦ **వేమన :** 25 విమర్శ వ్యాసాల సంపుటి. సి.పి.బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రం ప్రచురణ. ఇతర గ్రంథాలలో విడివిడిగా పడివున్న వేమన సాహిత్య విమర్శ వ్యాసాలను సంపుటాలుగా తీసుకు వచ్చే భాగంగా ఇది మొదటి వ్యాస సంకలనం. తన కన్న ముందు కాలంలో జనించిన వేమన పై ఎంత వ్రాసినా తక్కువే అనిపిస్తుంది

*పేజీలు 250 వెల : ₹ 160/-, ప్రతులకు - ఫోన్: 08562 - 255517.*



✦ **ఒక బానిస ఆత్మ కథ :** ఫ్రెడరిక్ డగ్లస్ ఇంగ్లీషు రచనకు ముక్తవరం పార్థసారథి తెలుగు సేత. "పోరాటం లేక పోతే ప్రగతి లేదు. దున్నకుండానే పంట కోరుకొనేవారే ఉద్యమం లేకుండా స్వేచ్ఛ కోరుకుంటారు. ఉరుములూ మెరుపులూ లేని వానల్ని కోరుకొనేది వారే." ఇది డగ్లస్ మాటలు బానిసగా పుట్టి బానిసత్వాన్ని నిషేధించాలనే ఉద్యమానికి నాయకత్వం వహించాడు. దళితుల మేధాశక్తి గురించి చులకన భావం ఉన్నవారికి అంబేత్కర్ జీవితం ఎలా సమాధానం చెప్పిందో నల్లవారి విషయమై డగ్లస్ అటువంటి తిరుగు లేని సమాధానం ఇచ్చాడు. పీకాక్ క్లాసిక్స్ ప్రచురణ.

*పేజీలు 80, వెల : ₹ 40/-, ప్రతులకు - ఫోన్: 9849940791.*



✦ **సుందర దర్శనం :** రచయిత ప్రసాద వర్మ కామఋషి. మొదటి జ్ఞాపకం అమ్మ. మలి జ్ఞాపకమూ అమ్మే అంటూ తన ఆత్మకథలో చెప్పుకున్న అవంత్స సోమసుందర్ యొక్క సాహిత్యావ లోకనం ఈ పుస్తకం. రచయిత ప్రవృత్తి రీత్యా సాహితీ పిపాసకులు, ప్రతి వ్యాసం సోమసుందర్ యొక్క వ్యక్తిత్వ విశ్లేషణలతో కూడిన ఒక ప్రత్యేక భాగమే. పుస్తకం చిన్నదయినా తెలుసుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. మనం మరచిన రచయితలో మనం తెలుసుకోవలసిన యెన్నో లోతైన విషయాలను రచయిత మన ముందుకు తీసుకుని వచ్చారు.

*పేజీలు 65, వెల : ₹ 30/-, ప్రతులు విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని కేంద్రాలలోనూ లభ్యమవుతుంది.*



✦ **కవిత వ్రాసిన కమ్మవారు :** సూర్యదేవర రవికుమార్ రచయితగా తెలుగు కవితారంగానికి కమ్మవారు చేసిన, చేస్తున్న రచనలను ఈ గ్రంథ రూపంలో పాఠకులకు అందించారు. పన్నెండు కవి పండిత పోషకుల గురించి, కవిత వ్రాసిన మరో 53 మంది గురించి ఉన్నంతలో వివరాలు ఇచ్చారు.

*పేజీలు 300, వెల : ₹ 150/-, ప్రతులకు - ఫోన్: 09966147265*



✦ **ధిక్కార నానీలు :** రచయిత్రి గురజాడ శోభా పేరిందేవి. నిండైన ఆర్ద్రతా, మానవత్వపు స్పందనతో కవిత్వాన్ని సృజించారు రచయిత్రి. చక్కటి శైలిలో, ఉత్తమ కవయిత్రిగా రూపుదిద్దుకునే సూచనలున్నాయి.

*పేజీలు 60, వెల : ₹ 50/-, ప్రతులకు - ఫోన్: 040-65979525.*



✦ **నవలా హృదయం :** 27 ప్రసిద్ధ తెలుగు నవలలను విమర్శనాత్మకంగా వి. రాజారామమోహన రావు చేసిన పరిచయ వ్యాసాలు. మంచి పుస్తకమే జీవితంగా భావించిన శ్రీరామదుగు రాధాకృష్ణమూర్తి గారికి ఈ పుస్తకం అంకితం ఇవ్వబడింది. నవలల ఎంపిక నిష్పక్షపాతమైన విశ్లేషణ ఈ రచనలు మనల్ని చదివిస్తాయి. ఆధునిక తెలుగు నవలలు గురించి తెలుసుకోవాలనే విద్యార్థులకు (పెద్దలకు) ఇది ఒక కరదీపికగా ఉపయోగపడుతుంది.

*పేజీలు 160, వెల : ₹ 75/-, ప్రతులకు - విశాలాంధ్ర, నవోదయ బుక్ హౌస్‌లు.*



✦ **ప్రలోభం :** నవల రచయిత నాయని కృష్ణమూర్తి. అడవి మనిషిగా పుట్టిన మానవుడు అనూహ్యమైన నాగరికతను పెంపొందించుకున్నాడు. అయితే ఇప్పుడేం జరుగుతుంది? ఒకరితో ఒకరు మాట్లాడు కోవటం ఎక్కడా కనిపంచటం లేదు, ఎందుకని? ఎవరికీ భుజాల మీద తలలు ఉన్నట్లు లేదే! తలకు బదులు టి.వి.లు, సినిమా తెరలు, కంప్యూటర్లు కనిపిస్తున్నాయి. ఎంతో ఆవేదనతో, ఆర్తితో దిగజారుతున్న మానవ విలువలను విశ్లేషిస్తూ రచన సాగించారు కృష్ణమూర్తి. వి.ఎన్.ఆర్ బుక్ వరల్డ్, చిత్తూరు వారి ప్రచురణ.

*పేజీలు 220, వెల : ₹ 80/-, ప్రతులకు - ఫోన్: 08581-256234.*



✦ **అనంతాకాశం :** అనువాద కథల సంపుటి. రచయిత గోవిందరాజు రామకృష్ణరావు. విపుల మాస పత్రికలో ప్రచురితమైన 20 కథలున్నాయి. అనువాదకులు ఇతర భాషల నుండి కథలను సేకరించేటపుడు వీలైనంత వరకూ ఆ భాషలో నున్న ఉత్తమ కథలనే ఎన్నుకుంటారు. ఇక్కడ అలానే ఉత్తమ కథలనే ఎన్నుకున్నారు రచయిత. కథలు ప్రమాణంలో చిన్నవయినా పరిణితిలో పెద్దవి.

*పేజీలు 140 వెల : ₹ 60/-, ప్రతులకు - పాలపిట్ట పుస్తక కేంద్రం- ఫోన్: 9848787284*



✦ **చైనా తత్త్వ వేత్తలు - లావోజి సూక్తులు :** కన్ఫ్యూషియస్ తాత్త్విక విచారము, మావో ఆలోచనా విధానము కలిపి చేసిన రచన. రచయిత వేదాంతం లక్ష్మీప్రసాదరావు. చైనా దేశపు తాత్త్వికతలో నూతన సిద్ధాంతాలను ప్రవేశపెట్టిన వారు వీరు. ఇందులో లావోజీ సూక్తులు ఎక్కువగా వచన కవిత్వంలో చెప్పారు రచయిత. అనువాదం ఎంతో సరళంగా సాగింది.

*పేజీలు 111, వెల : ₹ 80/-, (ప్రతులకు - ఫోన్: 9848054288.*



✦ **ఇంకెన్నాళ్ళు :** మూడు కథలు, ముప్పై కవితలు. రచయిత వేదాంతం లక్ష్మీప్రసాదరావు. సహజమైన శబ్దాలతో, వర్తమాన పరిస్థితులపై, సమకాలీన సమస్యల పైనా స్పందనకు అక్షర రూపమే ఈ కవితలు, కథలు. సమాజం పట్ల మన మందరం బాధ్యతాయుతంగా వ్యవహరించాలన్న విన్నపమే ఈ రచనలు.

*పేజీలు 80, వెల : ₹ 60/-, ప్రతులకు - నవోదయ బుక్ హౌస్ - ఫోన్: 9848054288.*



✦ **శ్రీ సాధన కవిత్వం :** అనంతపురం కేంద్రంగా పప్పులూరు రామాచార్యులు సంపాదకులుగా శ్రీ సాధన అనే పత్రికను 1926 నుండి 1947 వరకూ నడిపారు. 1929వ సంవత్సరంలోనే "ఆలయంబుల కేగ ననుమతివ్వరు మాకు - స్వారాజ్య మెటుల జేకూరు మీకు, అంగళ్ళ పైకేగ ననుమతివ్వరు మాకు" అంటూ అరుంధతీయ సమాజము వారు ఆనాడే వ్రాసిన గీతాలు ఇందులో ఉన్నాయి. ఆనాటి సామాజిక దృక్పథానికి అద్దం పట్టే అన్ని రచనల సంకలనం చేశారు డా॥ అప్పిరెడ్డి హరినాథ రెడ్డి.

*పేజీలు 100, వెల : ₹ 40/-, (ప్రతులకు - అన్ని ప్రధాన బుక్ హౌస్‌లు.*



**ఐన్‌స్టీన్ :** మీ నటనలో గొప్పతనం, మీరు ఒక్క మాట మాట్లాడక పోయినా ప్రపంచం మిమ్మల్ని అర్థం చేసుకుని ఆనందిస్తోంది.

**చాప్లిన్ :** మీరు ఇంకా గొప్పవారు. మీరు చెప్పేదేమిటో అర్థం చేసుకోలేక పోయినా ప్రపంచం మిమ్మల్ని గౌరవిస్తోంది.

The Greatness of Chaplin's art was that he could make the audience laugh and weep at the same time. No other comedian could perfect this perticular art as Chaplin did. Chaplin had faced very rough and unfriendly atmosphere in America during 1940's. The Telugu translation of Chaplin 's Autobiography is very good. I never felt that I am reading a translation. Aswini Kumar had done a wonderful job in translating the original and should be complimented for making Chaplin even dearer to telugu readers.

- Ampashayya Naveen (The Hans India)



...జీవితంలో సాధనాసాధ్యాలకూ, కలిమిలేములకూ, కీర్తికీ, పతనానికీ అన్నిటికీ ఆఖరి మజిలీ చార్లీచాప్లిన్ జీవితం. ఇంగ్లీషు నవల చదివినంత సుగమంగా, సుఖవంతంగా చదివిస్తుంది తెలుగు అనువాదం...

- సాక్షి



భూమి స్పర్శ



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M104 |
| పుస్తకం పేరు | మిసిమి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Prasad |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |